# ప్రథమముద్రణ (1966) పీఠిక

"మహి మున్ వాగనుశాసనుండు సృజియింపన్ గుండలీంద్రుండు త-
న్మహనీయస్థితిమూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవన్ మహా-
మహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపు వాటించు నీ
బహుళాంధ్రోక్తిమయప్రపంచమునఁ దత్ప్రాగల్భ్య మూహించెదన్"
-రామరాజ భూషణుడు

కవిసార్వభౌముడైన శ్రీనాథుడు పుంభావసరస్వతి. ఆంధ్ర గీర్వాణ భాషలు ఆతని కన్నుసన్నల మెలగినవి. ఆతడు బ్రాహ్మీదత్తవరప్రసాదుడు. సమస్త శ్రుతి స్మృతి పురాణ శాస్త్రముల నాపోశనము పట్టినవాడు. సంస్కృత వాఙ్మయ భాండాగారమును కొల్లగొట్టి ఆంధ్ర వాఙ్మయమునకు పుష్టిని తుష్టిని కూర్చినవాడు.

"సంస్కృత ప్రాకృత శౌరసేనీ ముఖ్య- | భాషాపరిజ్ఞానపాటవంబు
పన్నగపతిసార్వభౌమభాషిత మహా- | భాష్యవిద్యాసమభ్యాసబలము
నక్షపాద కణాద పక్షిలోదీరిత | న్యాయకళాకౌశలాతిశయము
శ్రుతి పురాణాగమ స్మృతి సాంఖ్య సిద్ధాంత | కబళన వ్యుత్పత్తిగౌరవంబు
పూర్వకవిముఖ్య విరచితాపూర్వకావ్య- | భావరస సుధాచర్వణప్రౌఢతయును"

కలవాడని దగ్గుపల్లి దుగ్గన కొనియాడినాడు. అతివేలములైన ప్రతిభాపాండిత్యములు కలవాడగుటచే బ్రతికినన్నాళ్ళు వాఙ్మయరంగమున తన కెదురొడ్డువారు లేక దేశదేశములు తిరిగినాడు. ఉన్నతమైన పదవు లలంకరించినాడు. సమస్తవైభవము లనుభవించినాడు. అటు కర్ణాటమునకు పోయి ప్రౌఢదేవరాయల ఆస్థానమున ఉద్దండపండితుడైన డిండిమకవిసార్వభౌము నోడించి కనకాభిషేకగౌరవ మందినాడు. ఇటు రాచకొండ కేగి సర్వజ్ఞసింగభూపాలుని మెప్పించి తన యేలిక కోరిక తీర్చి మనసు కెక్కినాడు. ఇక కొండవీటి రెడ్డిరాజ్యమున పెదకోమటి వేమారెడ్డి యాస్థానమున దాదాపు రెండు దశాబ్దములు విద్యాధికారిగా నుండి ఆతడు నెరపిన యధికారము వర్ణింపరానిది.

శ్రీనాథుని తాత కమలనాభామాత్యుడు గొప్ప కవియట. భీమాంబా మారయామాత్యు లీతని గన్న ధన్యులు. పాకనాటిలోని కాల్పట్టణ మీతని జన్మస్థలము. శ్రీనాథుని దేశకాలముల గూర్చి పెద్దరగడ జరిగినది. వీరేశలింగంపంతులుగారు మొదలుకొని ఆరుద్రగారి వరకున్న సాహిత్య చరిత్రకారు లందరును శ్రీనాథుని దేశకాలములు, ఆతని జీవిత విశేషములు, ఆతడు సృష్టించిన వాఙ్మయమునుగూర్చి విపులముగా చర్చించియున్నారు. వాని నన్నింటి నిట ప్రస్తావింప నక్కరలేదు. పదునాల్గవ శతాబ్దము నాల్గవపాదము, పదునేనవ శతాబ్దము పూర్వార్ధ మాతని వాక్కు ఆంధ్రదేశ మంతటను మేఘగంభీరనాదముతో ప్రతిధ్వనించినదని తెలిసికొనుట చాలును.

మహాశివభక్తుడైన శ్రీనాథుడు తన రచనముల నన్నింటిని శివభక్తులకే కృతినిచ్చుట విశేషము. చతుర్విధ పురుషార్థముల నాతడు చూరగొన్నాడు. విధివశమున జీవితసంధ్యాసమయమున దైన్య మనుభవించినాడు. ఆతని నాదరించి పోషించిన మహాసామ్రాజ్యములే కూలిపోయినప్పు డొకవ్యక్తికి కలిగిన దైన్యము చెప్పుకొన నక్కరలేదు. ఆతడు పండించిన కీర్తి రెడ్డిరాజులకు, ఆతని దండించిన యపకీర్తి యొడ్డెరాజులకు శాశ్వతముగా దక్కిపోయినవి. ఆతడెక్కి తిరిగిన పల్లకీ మోసిన బోయల ఓంకారనాదము, ఆరగించిన రుచులు, అలదుకొనిన కస్తూరీచందనములు, సేవించిన తాంబూలము

పచ్చకప్పురపు గమగమలు, ధరించిన తారహారముల ధగధగలు, కర్ణకుండలముల వజ్రాల తళతళలు ఈనాటికిని ఆతని సాహిత్యమున మన కనుభూత మగుచున్నవి.

శ్రీనాథ సాహిత్యమునుగూర్చి సాహిత్యచరిత్రలందే కాక ప్రత్యేకగ్రంథములందును వివిధ వ్యాసములందును కాననగును. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి (శృంగార శ్రీనాథము), శ్రీ గడియారము వేంకటశేషశాస్త్రి (శ్రీనాథుని కవితా సామ్రాజ్యము), శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి (శ్రీనాథకవితా సమీక్ష), ఉస్మానియా విశ్వవిద్యాలయ విద్యార్థులు (శ్రీనాథ భారతము), శ్రీ కుందూరి ఈశ్వరదత్తు (శ్రీనాథుని కవిత్వతత్త్వము) వంటివారు ప్రత్యేక గ్రంథములే వ్రాసినారు. శ్రీ శ్రీహరిగారు, శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తిగారు సిద్ధాంత రచనలు చేసి Ph.D. పట్టము లందుకొన్నారు. శ్రీ బండారు తమ్మయ్యగారు, శ్రీ నిడుదవోలు వేంకటరావుగారివంటి పెద్దలెందరో యమూల్యవ్యాసములు ప్రకటించినారు.

కృతులు:

కాశీఖండమున శ్రీనాథకవిసార్వభౌముడు తన రచనములగూర్చి యీ విధముగా చెప్పియున్నాడు.

సీ. చిన్నారి పొన్నారి చిఱుతకూఁకటినాఁడు | రచియించితి మరుత్తరాట్చరిత్ర
నూనూఁగుమీసాల నూత్నయౌవనమున | శాలివాహనసప్తశతి నొడివితి
సంతరించితి నిండు జవ్వనంబునయందు | హర్షనైషధ కావ్య మాంధ్రభాషఁ
బ్రౌఢనిర్భరవయఃపరిపాకమునఁ గొని- | యాడితి భీమనాయకుని మహిమఁ
గీ.బ్రాయ మెంతయు మిగులఁ గై వ్రాలకుండఁ | గాశికాఖండమను మహాగ్రంథ మేను
దెనుఁగుఁ జేసెదఁ గర్ణాటదేశ కటక- | పద్మవనహేళి శ్రీనాథభట్టసుకవి.(I-7)

ఇందులో మొదటి రెండుకృతు లిప్పటికి లభించలేదు. నైషధము పెదకోమటి వేమారెడ్డి (క్రీ.శ. 1402-1420) మంత్రి మామిడి సింగనామాత్యున కంకితము. భీమేశ్వరపురాణము అల్లయ వీరభద్రారెడ్డి (క్రీ.శ. 1423-1448) మంత్రి బెండపూడి యన్నయమంత్రి కంకితము. కాశీఖండము వీరభద్రారెడ్డి (క్రీ.శ 1423-1448) కంకితము. పై పద్యమున పేర్కొనని కృతులు హరవిలాసము, శివరాత్రి మాహాత్మ్యములు. హరవిలాసము శ్రీనాథుని బాల్యసఖుడును, కుమారగిరిరెడ్డి (క్రీ.శ. 1386-1402) కడ సుగంధభాండాగారాధ్యక్షుడుగా నుండినవాడునగు అవచి తిప్పయసెట్టి కంకితము. ప్రకృతగ్రంథమైన శివరాత్రి మాహాత్మ్యము శ్రీశైల మందలి భిక్షావృత్తిమఠాధ్యక్షులగు శాంతభిక్షావృత్తియతీశ్వరుల మూలభృత్యుడు ముమ్మయ శాంతయ కంకితము. అక్కిరాజు ఉమాకాంత విద్యాశేఖరులు శ్రీనాథుని పేరుతో ప్రకటించిన పల్నాటి వీరచరిత్ర మాతని కృతి కాదనియు, దాని రచయిత మరియొక శ్రీనాథుడై యుండుననియు శ్రీ శిష్ఠా రామకృష్ణశాస్త్రిగారి యభిప్రాయము.[1] శ్రీనాథుడు రచించిన కాటమరాజు కథ, పండితారాధ్య చరిత్ర, ధనంజయ విలాసములు కూడ లభించలేదు. వినుకొండ వల్లభరాయడు రచించిన క్రీడాభిరామమున శ్రీనాథుని తోడ్పాటున్నట్లు పండిత పరిశోధకుల తీర్మానము. శ్రీనాథుని పేరుతో చాటువు లనేకములు ప్రచార మందున్నవి.[2] వీనిలో శ్రీనాథునివేవో కానివేవో శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు నిష్కర్ష చేసియున్నారు.[3] ఇట్టి కృతులే కాక శ్రీనాథుడు రచించిన ఉపలభ్య శాసనముల వివరములు శ్రీ చాగంటి శేషయ్యగా రిచ్చి యున్నారు.[4]

శివరాత్రిమాహాత్మ్యము:

శ్రీనాథుని జన్మస్థలము, జననకాలములవలెనే ఆతని గ్రంథముల పౌర్వాపర్యము

కూడ వివాదాస్పదము. వీరేశలింగంపంతులుగా రిది భీమఖండమునకు పూర్వకృతి యనిరి. నాగపూడి కుప్పుసామయ్యగా రిది శ్రీనాథుని బాల్యకవిత యనిరి. కాని జీవితము ప్రొద్దువ్రాలు సమయమున ఆశ్రయులు, దాతలు అడుగంటిపోయిన తరువాత శ్రీనాథుడు చిత్తశాంతికై శ్రీశైలక్షేత్రమునకు కడపటిసారిగా పోయి శాంతభిక్షావృత్తియతీశ్వరుల యాదేశమున క్రీ.శ. 1440 ప్రాంతములందు దీనిని రచించినట్లు [5]శ్రీ కట్టి సాంబమూర్తిశాస్త్రిగారు నిర్ణయించినారు. శ్రీయుతులు [6]వేటూరి ప్రభాకరశాస్త్రి, [7]బండారు తమ్మయ్య, [8]చాగంటి శేషయ్యగారలు తదితరు లందరును అటులే తలంచినారు. ఇటీవల [9]శ్రీ చన్నాప్రగడ తిరుపతిరావుగారు శ్రీనాథుని వివిధపద్యముల శాతమునుబట్టి దీనిని కాశీఖండమునకు పూర్వరచన మన్నారు.

శివరాత్రి మాహాత్మ్యమందలి అవతారిక మరియు ఆశ్వాసాంతపద్యములు శ్రీనాథుని రచనములు కావని శ్రీ కట్టి సాంబమూర్తిశాస్త్రిగారి అభిప్రాయము. కాని యవి కూడ శ్రీనాథవిరచితములనియే నా నమ్మకము. ఇన్నాళ్ళకు మనకు లభించిన ఒండురెండు శిథిల ప్రతు లాధారముగా అవతారికా భాగము శ్రీనాథునిది కాదనుట సమంజసము కాదు. శివరాత్రిమాహాత్మ్యము జంగము మఠములందు తలదాచికొని కొనయూపిరితో నిలిచినది. దానిని చదువుకొనుచు పుత్రికలు వ్రాసికొనుచు ఇన్నాళ్ళు బ్రతికించినవారిలో పండితులెందరో కానివారెందరో తెలియదు. అవతారికలో కొన్ని పద్యములు శిథిలములైపోగా నెవరైన పూరించి యుండవచ్చును లేదా వ్రాయసకాని పొరపాటులేమైన చేరియుండవచ్చును. కాలక్రమమున పాఠాంతరములు ప్రవేశించి యుండును. శ్రీ సాంబమూర్తిశాస్త్రిగారు చూపిన పండ్రెండు దోషములలో ఒకటి,

"సకల సద్గుణ విఖ్యాత సారసాఖ్య
మహిత పంచాక్షరీమంత్ర మానసాత్మ"

యనునది. ఇది క్రొత్తగా లభించిన తాళపత్ర గ్రంథమందలి పాఠాంతరములవలన (I-30) నిర్దుష్టమైపోయినది.

"కాకోదరగ్రామణి కంఠగ్రైవేయు" (I-64) అనునది వచనములోని భాగము. తాళపత్ర గ్రంథములందు గుడిదీర్ఘము లుండవని విజ్ఞు లెరుగుదురు. కనుక దీనిని 'గ్రామణీ' యని తలచవలెను. వారెత్తి చూపిన తక్కిన పది దోషములును అప్రౌఢకవితాబంధములును ఈ క్రొత్త తాళపత్ర గ్రంథమున గూడ నటులే యున్నందున వాని నట్లే యుంచినాను. వీనిలో "వడి ప్రాస విడంబబంధమై" (I-16) యనునది సమాసముగా కాక వ్యస్తపదములుగా గ్రహించినచో దోష ముండదనుకొందును.

'కృతిపతులగు కవిముఖ్యుల' (I-14) అనునది కృతిభర్తలగు కృతికర్తల (తిక్కనవంటివారి) గురించిన మాట యని భావించవలెను.

శ్రీ సాంబమూర్తిశాస్త్రిగా రెత్తిచూపిన తక్కిన దోషము లివి.

సుతుని నుద్యుక్తశాంతాత్మునిన్. (I-1)
పుణ్యాఋషీశ్వర సప్తతుల్యులం బోలిన. (I-25)
వైభవప్రఖ్యాత వరహరిశ్చంద్రుండు. (I-26)
ఘనుఁడు కొమరగిరీంద్రుండు కలిగియుండు (I-26)
నేర్పరతడు. (I-28)
పరమపాతివ్రత్యభావంబు తలఁపంగ గౌరి గాఁబోలు నీ కాంత తలఁప. (I-40)

నల్విటు చింత. (I-62)

శాస్త్రిగారు చూపిన యప్రౌఢబంధములే కాక నాకు మరికొన్ని తోచినవి. I-18 వచనమున శాంతభిక్షావృత్తియతి శాంతయ్య కంకితముగా శ్రీనాథుని కృతి రచింపుమని కోరిన సందర్భ మేమాత్రమును అన్వయము సరిగా లేదు. కృతిభర్త వంశావతారమును వర్ణించు పద్యములు కూడ కొన్ని యటులే యున్నవి. I-40 వచనము చివర భాగముకూడ అన్వయము సరిగా లేదు. ఇవి చూడగా కాలక్రమమున పెక్కుదోషము లిందు చేరినవని తెలియుచున్నది. అవతారికలోని కొన్ని పద్యములు మాత్రము (1, 6, 8, 9, 34) తప్పక శ్రీనాథునివే యని చెప్పవచ్చును.

ఇతివృత్తము:

ఈ శివరాత్రి మాహాత్మ్యమునకు మూలము స్కాందపురాణాంతర్గతమగు [10]ఈశాన సంహిత. దానిలో 336 అనుష్టుప్పులందున్న మూడధ్యాయముల కథను శ్రీనాథు డనేక వర్ణనలతో పెంచి ఐదాశ్వాసముల ప్రబంధముగా తీర్చిదిద్దినాడు. ఈ రెంటికి గల పోలికలు భేదములు శ్రీ కట్టి సాంబమూర్తిశాస్త్రిగారు ఈశానసంహితకు తాము వ్రాసిన పీఠికలో నిచ్చియున్నారు.

శౌనకాది మహామునులు సూతుని శివరాత్రిమాహాత్మ్యము నడుగ నాతడు ప్రళయాంతమున శ్రీమన్నారాయణుడు క్రోడాకారమున భూమి నుద్ధరించి గర్వముతో క్షీరసాగరమున శయనించుట, నిద్ర మేల్కాంచిన బ్రహ్మ శివానుగ్రహమున మరల సృష్టిచేసి తానే జగత్కర్తనని గర్వించి పాలసముద్రమున పవ్వళించియున్న నారాయణుని కవ్వించుట, విరించి-నారాయణు లహమహమికతో పాశుపతాస్త్రములు ప్రయోగించుట, లోకములు గగ్గోలువడుట, మాఘకృష్ణచతుర్దశీ మధ్యనిశిని శివు డనలస్తంభాకారముగా నవతరించుట, పద్మజ-పద్మాక్షులు దాని యాద్యంతములు పొడగాననేరక శివుని స్తుతించుట, శివుడు వారికి శివరాత్రివ్రతం బుపదేశించుట, తొల్లి యొక శివరాత్రిదర్శనమున మహాపాపియైన బ్రాహ్మణుడు శివలోకమున కేగెనని సూతుడనగా నా కథ వినుపింపుమని శౌనకాదు లడుగుటతో ప్రథమాశ్వాసము ముగియును.

దండకారణ్యమున రత్నపురి రాజధానిగా హేమాంగదుడను శబరరాజు పాలించుచుండెను. ఆతని మంత్రి యజ్ఞదత్తుడు. యజ్ఞదత్తుని భార్య సుశీల. ఎంతో కాలమునకు పుణ్యోపవాసవ్రత దానధర్మ దేవతారాధనంబుల వలన నామె గర్భము దాల్చుట, దోహదములు, ప్రసూతిగృహవర్ణనము, సుకుమార జననము, జాతకర్మలు, శైశవము, సంస్కారములు, విద్యాభ్యాసము, యౌవనము, దురభ్యాసములు, తల్లిదండ్రుల హితోపదేశము మున్నుగా గలది ద్వితీయాశ్వాసము.

సుకుమారుని దౌష్ట్యము పెచ్చుపెరుగుట, రాజాతని దేశము వెడలనడచుట, సుకుమారుడు కీకటదేశము మీదుగా హూణమండలమున కేగుచు కాంతారమధ్యమున నొక తటాకముకడ సేదదేరుట, అచటికొక చండాలకన్యక స్నానార్థమై వచ్చుట, పరస్పర మోహశృంగారములు, సాయం-నిశావర్ణనములు, సుకుమారుడు భద్రకాళికాస్థానమున నుండి రహస్యముగా చండాలకన్యకతో కాపురము సేయుట, శబరులతోడి సహవాసము, వారి దుర్వర్తనము హూణమండలమున పొక్కుట, ఇరువురును మరియొకచోటికి వెడలిపో నుద్యోగించుట లాదిగా గలది తృతీయాశ్వాసము.

కాళిజాతర, సుకుమారుడు చండాలకన్యకతో కలిసి కిరాతమండలమున వణిక్పథము

చేరి బ్రహ్మపురివాడలో కాపురముండుట, సంతానలబ్ధి, చండాలి మరణము, సుకుమారుడు కూతులతో పాపకార్యము చేయుట, వాని దుశ్చేష్టితము లెరిగి యచటివారు ప్రాయశ్చిత్తములు చేసికొనుట, సుకుమారుడు కూతులవలన సంతానము బడయుట, హేమంతవర్ణనము, నాగేశ్వర వర్ణనము, శివరాత్రివర్ణనము. సుకుమారుడు నాగేశ్వరాలయమునకు వచ్చి శివరాత్రిని దర్శించి విగతకల్మషుడై కొంతకాలమునకు మరణించుట, కాలకింకరులు వాని గొనిపోవ వచ్చుట, శంకరకింకరులు వారి నడ్డగించుట, యుద్ధము, వాదోపవాదములు, యము డులుంబరుని మృత్యువును తన కింకరులకు బాసటగా పంపుట, యమభటుల పరాభవము, ప్రమథులు సుకుమారుని కైలాసమునకు గొనిపోవుట, సుకుమారుడు శివుని స్తుతించి, ప్రమథు డగుట యనువానితో గూడినది చతుర్థాశ్వాసము.

తన భటుల పరాభవమును విన్న యముడు చిత్రగుప్తుని సంప్రదించి తన యశక్తాధికారము శివునకే విన్నవింప నిశ్చయించుకొని కైలాసమున కేగుట, కైలాసవర్ణనము, శివసందర్శనము, శివస్తుతి, యముడు సుకుమారుని పాపకార్యములు శివునికి వినిపించుట, శివుడు యమునకు శివరాత్రి మాహాత్మ్యము శివభక్తుల లక్షణములు చెప్పుట, యముడు తన లోకమునకు తిరిగివచ్చి తన భటులకు శివరాత్రి మాహాత్మ్యము శివభక్తుల లక్షణములు మరల చెప్పుటతో పంచమాశ్వాసము ముగియును.

ఈ శివరాత్రి మాహాత్మ్యమునకే సుకుమార చరిత్రమని నామాంతరము కనుక శ్రీనాథు డీ సుకుమారుని కథను ప్రబంధోచితవర్ణనలతో పెంచి అట్టి దుష్టుడు కూడ శివరాత్రి దర్శనమున పూతుడైనట్లు స్థాపించెను. కాశీఖండమున (IV. 76-163) గల గుణనిధి కథ యిట్టిదే. పాపకార్యములందు గుణనిధి వెన్నుదన్ని పుట్టినవా డీ సుకుమారుడు. సుకుమార చరిత్రమున శ్రీనాథుడు నైషధము కాశీఖండము మున్నగు తన పూర్వకృతుల నుండియే కాక భట్టబాణుని కాదంబరిలోని రసవంతములగు భాగము లనేకము గ్రహించెను. కనుకనే పూర్వకవిస్తుతి యొనర్చు సందర్భమున అవతారికలో శ్రీనాథుడు తొట్టతొలుత "బాణు నద్భుతశాస్త్ర బహుకళాపారీణు" (I-12) గొనియాడెను.

గీ. వానిఁ గలలోనఁ గానని వనజముఖియు
వాని మార్పునఁ బేర్కొని మానవతియు
వానిఁగా నాత్మ భావించి వరునిఁ గవయ
నప్పళింపని సతియు లేదయ్యె నచట.

అను శృంగార నైషధమందలి (I-62) పద్యము శివరాత్రిమాహాత్మ్యమున (II-94) రసవత్తమముగా విస్తరింపబడినది.

కాశీఖండము గుణనిధి చరిత్రమందలి (IV-114) పద్య మున్నదున్నట్లు శివరాత్రి మాహాత్మ్యమున (III-19) అవతరించినది. కాశీఖండమున శివదూతలకును యమదూతలకును జరిగిన సంవాదమందలి (IV-127) పద్యములోని మాటలు కొన్ని శివరాత్రి మాహాత్మ్యమున (IV-73) చేరినవి.

పుష్పదంతుని మహిమ్నస్తవమందలి

"అతీతః పంథానం తవ చ మహిమా వాఙ్మనసయో
రతద్వ్యావృత్త్యా యం చకిత మభిధత్తే శ్రుతి రపి
స కస్య స్తోతవ్యః కతివిధగుణః కస్య విషయః

పదే త్వర్వాచీనే పతతి న మనః కస్య న వచః”

అను శ్లోకములోని మాటలును, సనత్కుమార సంహితాంతర్గత [11]శివతత్వసుధానిధియందలి శివనామస్మరణాధ్యాయమందున్న

“హరశంభో మహాదేవ విశ్వేశామరవల్లభ
శివ శంకర సర్వాత్మ న్నీలకంఠ నమోస్తు తే”

యను శ్లోకమును గూడ శ్రీనాథుడు (V-21) సంస్కృతరగడలో వాడుకొన్నాడు.

భట్టబాణుని కాదంబరి నుండి శ్రీనాథుడు గ్రహించిన వర్ణనము లనేకము శ్రీ కట్టి సాంబమూర్తిశాస్త్రిగా రుదాహరించి యున్నారు. శివరాత్రి మాహాత్మ్యము II-15, 17, 30, 96, 97, 98, III-21 గద్యపద్యములకు మూలములు కాదంబరిలో గలవు. పాత్రచిత్రణము, గుణశీలస్వభావముల వర్ణనములు కూడ కాదంబరి నుండి సంగ్రహింపబడినవి. ఇందలి కావ్యత్వము గూర్చి శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు విపులముగా వ్రాసియున్నారు.[12]

పూర్వముద్రణములు:

ఇంతకు పూర్వము శివరాత్రి మాహాత్మ్యము అసమగ్రముగా మూడుసారులు పుస్తకరూపమున కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తువారు ప్రకటించినారు. ద్వితీయముద్రణము 1930లో జరిగినది. ద్వితీయ ముద్రణ పీఠికలో అప్పటి కించుమించు 12 ఏండ్లకు పూర్వము ప్రథమముద్రణము జరిగినట్లున్నది. తృతీయ ముద్రణ మెప్పుడు జరిగినదో తెలియదు. మొదటి రెండు ముద్రణములకును శివరాత్రి మాహాత్మ్యమును తొలిసారిగా పరిష్కరించిన విద్వాన్ శ్రీ కట్టి సాంబమూర్తిశాస్త్రిగారి రెండు పీఠికలున్నవి. మూడవ ముద్రణమున గూడ మరల ఆ రెండు పీఠికలే ముద్రితములైనవి. ఆనాడు వారికి లభించినది నాలుగాశ్వాసముల గ్రంథమే కనుక శ్రీనాథు డంతే రచించియుండునని యూహించి శ్రీ సాంబమూర్తిశాస్త్రిగారు తమ పీఠికలో నటులే వ్రాసినారు. ఒకటి రెండక్షరములు శిథిములైన చోటులు పూరించియు మిక్కిలి శిథిలములైన భాగములు చుక్కల గుర్తులుంచియు గ్రంథమును ముద్రించినారు.

అటు తరువాత శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సంపాదించి పంపగా శివరాత్రి మాహాత్మ్యమునకు మూలమైన ఈశాన సంహితను గూడ శ్రీ సాంబమూర్తిశాస్త్రిగారే ఆంధ్ర సాహిత్య పరిషత్తు 44వ ప్రచురణముగా విపులమైన పీఠికతో ప్రకటించినారు. శివరాత్రి మాహాత్మ్యమును శ్రీనాథుడు నాలుగాశ్వాసములుగనే వ్రాసినట్లు శ్రీ సాంబమూర్తిశాస్త్రిగారును, సంపూర్ణముగా వ్రాసినట్లు శ్రీ బండారు తమ్మయ్యగారును వాదించుకొన్నట్లు వారి పీఠిక మూలమున తెలియుచున్నది. మీదు మిక్కిలి సంస్కృతమున నున్న ఈశాన సంహితయే శ్రీనాథుని శివరాత్రి మాహాత్మ్యమున కనువాదమని శ్రీ సాంబమూర్తిశాస్త్రిగా రభిప్రాయపడినారు. ఇంకను శివరాత్రి మాహాత్మ్యమందలి అవతారికాభాగమును, ఆశ్వాసాంతములును శ్రీనాథ విరచితములు కావనియు కృతిపతియో తదాశ్రితుడో ఈ పని చేసినట్లు వారు తీర్మానించినారు. ఆయా భాగములందలి దోషములను అప్రౌఢకవితాబంధములను ఇందు కుపబలకముగా నుదాహరించినారు. భట్టబాణుని కాదంబరీ వచనముల నే తీరుగా శ్రీనాథుడు శివరాత్రి మాహాత్మ్యమున అనుసరించినాడో నిరూపించినారు. ఇందు కాంధ్రసాహిత్యలోక మెంతయు వారికి ఋణపడియున్నది.

సమగ్ర తాళపత్ర గ్రంథము:

ఇన్నాళ్ళకు శివరాత్రి మాహాత్మ్యము సంపూర్ణప్రతి లభించుట మన యదృష్టము. తెలంగాణమందలి మెదకు మండలము అందోలు తాలూకా దన్నారం గ్రామవాస్తవ్యులైన శ్రీ శంకు శంకరప్పగా రీతాళపత్ర గ్రంథమును నా కిచ్చినారు. శ్రీ సాంబమూర్తిశాస్త్రిగారికి లభించిన ప్రతి కూడ తెలంగాణకు చెందినదే. ఇతరాంధ్రప్రాంతములందువలె తెలంగాణమున తాళపత్రగ్రంథముల సేకరణ జరుగలేదు, ఇప్పటికిని ప్రాచీనగ్రంథములు తెలంగాణమున లభించుననుట కీ శివరాత్రి మాహాత్మ్యమే సాక్ష్యము. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక (సంపుటి 54-సంచిక 3) లో పాల్కురికి సోమనాథుని క్రొత్త రచనము పండితారాధ్యోదాహరణము ప్రకటించితిని. తెలంగాణమున కొన్ని ప్రాచీన వీరశైవమఠము లున్నవి. ఆయా మఠములందు నేలగాబులలో నూర్లకొలది తాళపత్రగ్రంథములు గడ్డ కట్టుకొనిపోవుచున్నవి. వాని నుద్ధరించు నాథుడు లేడు. ఇప్పటికే కడచిన ఇరువది ముప్పదేండ్లలో కొన్ని యమూల్యగ్రంథములు మనకు శాశ్వతముగా దక్కకుండ పోయినవి. మా యింటినుండి శ్రీనాథుని శాలివాహనసప్తశతి పోవుట నే నెరుగుదును. పూర్వసంస్థానాధీశ్వరుల కడను కొందరు వ్యక్తులవద్దను పోయినవి పోగా మిగిలియున్న గ్రంథములనైనను సేకరించి ప్రాచ్యలిఖితపుస్తక భాండాగార మొకటి స్థాపించవలెనని ప్రభుత్వమువారికిని ప్రజాసంస్థలకును ఒక దశాబ్దముగా మొరపెట్టుకొనుచున్నాను. కాని యది యరణ్యరోదనమైనది. ఇక కొన్నాళ్ళకు మిగిలిన గ్రంథములు కూడ పాడైపోయిన తరువాత ఎవ్వరును చేయగలిగిన దేమియు నుండదు.

ప్రస్తుతము లభించిన శివరాత్రి మాహాత్మ్యము తాళపత్రప్రతి వయస్సు ఇన్నూరేండ్లకు పైగా నుండును. వ్రాయసకాని పొరపాటులు కొన్ని యున్నను ఇది మిక్కిలి చక్కని ప్రతి. చక్కనిదే కాదు సమగ్రమైన ప్రతి. దీనిలో నైదాశ్వాసము లుండుటే కాక పూర్వముద్రితములైన నాలుగాశ్వాసములందు లేని కొన్ని క్రొత్త పద్యము లధికముగా నున్నవి. పూర్వముద్రణములందలి శిథిలభాగము లన్నియు దీనిలో భద్రముగా నున్నవి. ఇంకను దీనిలో కొన్ని పాఠభేదములు కూడ ఉన్నవి. పూర్వముద్రణములందు దోషజుష్టము లనుకొన్న భాగములు కొన్ని ఈ క్రొత్త పాఠములవలన గుణయుక్తము లగుచున్నవి. ఐనను ఒండురెండు శైథిల్యములు గ్రంథపాతము లిందును లేకపోలేదు. మరియొక ప్రతి యెన్నడైన లభించినచో అప్పు డీ శివరాత్రి మాహాత్మ్యము సమగ్రతరమగును.

పంచమాశ్వాసము:

పూర్వముద్రణములందు లేని పంచమాశ్వాస మిందు గలదు. చతుర్థాశ్వాసాంతమున మునులు సూతునితో “చిన్నవోయి యముం డేమి చేసెఁ బిదప” అని యడిగిన ప్రశ్నకు సమాధాన మీ పంచమాశ్వాసము. ఇందు 91 గద్యపద్యము లున్నవి. శివదూతలవలన తన భటులకు జరిగిన పరాభవమును విన్న యముడు చిత్రగుప్తుని సంప్రదించి తన యశక్తాధికారమునుగూర్చి పరమశివునకే విన్నవింప నిశ్చయించుకొని కైలాసమునకు పోవుట, కైలాసవర్ణనము, శివస్తుతి, సుకుమారుని పాపకార్యములు చెప్పుట, శివుడు సమాధానముగా శివరాత్రి మాహాత్మ్యమును శివభక్తుల లక్షణములను చెప్పుట, యముడు తన లోకమునకు తిరిగి వచ్చి తన భటులకు శివుడు చెప్పినవన్నియు మరల చెప్పుట యిందలి వృత్తాంతము. ఈశాన సంహితయందలి (1-130 శ్లోకములు) చివరి యధ్యాయమున కిది తెలుగుసేత.

అధిక పద్యములు:

పూర్వముద్రణము నాలుగాశ్వాసములలో లేని కొన్ని పద్యములు దీనిలో అధికముగా నున్నవి. అవి యివి.

ప్రథమాశ్వాసము 7-11, 123
ద్వితీయాశ్వాసము 103-107
తృతీయాశ్వాసము 45, 123లో కొంత, 131
చతుర్థాశ్వాసము 9లో కొంత, 14

పూర్వముద్రణమున నున్న కొన్ని పద్యము లీ తాళపత్రగ్రంథమున లేవు. అవి యివి.

ప్రథమాశ్వాసము 96
ద్వితీయాశ్వాసము 59, 105
తృతీయాశ్వాసము 24, 132

ఈ పద్యములం దవసరమైనవాని గ్రంథభాగమున జేర్చి యనవసరమైనవాని నధోభాగమున జేర్చినాను.

పరిష్కరణము:

పూర్వముద్రణమందలి శిథిలభాగము లీ క్రొత్త తాళపత్రగ్రంథము సాయమున పూరించినవి స్పష్టముగా తెలియుటకై (...) ఇట్టి కుండలీకరణములం దుంచినాను. పంచమాశ్వాసమున నిట్టి కుండలీకరణములు కొలది యాధారములతో నేను పూరించినవాని కుపయోగించినాను. వ్రాయసకాని పొరపాటువలననో మరెందుచేతనో జారిపోయిన భాగము లే యాధారము లేకుండ నేను పూరించినవానిని [...] ఇట్టి గుర్తులం దుంచినాను. పూర్వముద్రణమున నుండియు ఈ తాళపత్రమున లేని భాగములకు *(...) ఇట్టి గుర్తులుంచి యధోజ్ఞాపికలందు పేర్కొన్నాను.

పూర్వముద్రణముతో నీ క్రొత్త గ్రంథమును పోల్చి చూడగా పాఠ భేదము ల నేక ము కనబడినవి. కొన్నిచోట్ల పూర్వముద్రిత పాఠములే సమంజసముగా నున్నవి. మరికొన్నిచోట్ల తాళపత్రప్రతిలోని పాఠములు సమంజసములని తోచినవి. నా బుద్ధికి సమంజసములని తోచినవానిని గ్రంథభాగమున నుంచి తక్కినవాని నధోజ్ఞాపికలందు పేర్కొన్నాను. పూర్వముద్రణ పాఠములకు ము. అనియు కొత్త తాళపత్రపాఠములకు తా. అనియు గుర్తులుంచి యథాసంఖ్యముగా అధోజ్ఞాపికలం దాయా పాఠాంతరములు పేర్కొన్నాను. ఈ రెండు తీరుల పాఠములను సరికావనుకొన్న చోటులందు నా మాటలుంచి రెండువిధముల పాఠములు దిగువన పేర్కొన్నాను. పంచమాశ్వాసము కొత్తదగుటచే దానికి పూర్వముద్రిత పాఠము లీయనక్కరలేకపోయినది. కేవలము తాళపత్రపాఠములు క్రింద సూచించి నా సవరణలతో పూరించినాను. కొన్ని తావులందు వ్రాయసకాని పొరపాటులని స్పష్టముగా తెలియువానిని కూడ క్రింద సూచించినాను. తాళపత్రగ్రంథములోని విషయము లెట్లున్నవో తెలియవలెనను ఉద్దేశముతో నట్లు చేసినాను. ఛందోభంగములు నాకు తెలియని పదబంధము లున్నచోట ప్రశ్నార్థక చిహ్నములుంచి విడిచినాను.

చతుర్థాశ్వాసము పుట 132లోని 88వ తాళవృత్తము లక్షణము తెలియరాదు. దీనిని ప్రస్తరించి చూడగా హరిగతి రగడకు రెట్టింపని తోచినది. నాలుగేసి మాత్రల గణము లెనిమిదింటి కొకపాదముగాను ఐదవగణము ప్రథమాక్షరము యతిగాను ఉన్నట్లు తెలియుచున్నది.

పంచమాశ్వాసము పుటలు 142-143 లోని 21వ సంస్కృతరగడ తాళపత్రగ్రంథమున గజిబిజిగా నున్నది. మొదటి నాల్గుపాదముల చివరన విరుపు

గుర్తులున్నవి. తక్కినదంతయు వచనమువలె గుర్తులు లేక యున్నది. ఈ భాగము కూడ రగడకు చెందినదేయని తెలిసికొనుటకు చాల సమయము పట్టినది. వ్రాత తప్పులు గ్రంథపాతము లిందు పెక్కులున్నవి. పై తాళవృత్తమునకును దీనికిని లక్షణము సామాన్యము. ఈ రగడను ఆర్యావృత్తములుగా విభజింపవచ్చును కూడ.

కృతిభర్త యింటి పేరు పువ్వులపువారని పూర్వముద్రణమున నున్నది. కాని నాకు లభించిన తాళపత్రమున నుప్పలపు వారని యుండుటచే నేనీ పాఠమే సమంజసమని తలంచుచున్నాను. ఉత్పలమను మాట కిది వికృతియై యుండవచ్చును. కృతిభర్త వంశమునకు మూలపురుషుడైన పోలిదేవయ్య "కడిమిమై నిరువత్తుగండనిచే మల్లికార్జును కుత్పలం బర్థిఁ బడసె" (I–22), కావున నిట్టి పేరు కలిగియుండునని ఊహించుచున్నాను.

నా పరిష్కరణము, పాఠాంతరముల నెన్నుకొను విధానము నిర్దుష్టమని ఘంటాపథముగా చెప్పజాలను. నా యల్పబుద్ధికి తోచినంత నేను చేసినాను. పండితులు సహృదయులు సవరణలు సూచించినచో మలిముద్రణమున దిద్దుకొందును. అచ్చుతప్పులు లేకుండ తెలుగు పుస్తకము ప్రకటితమగుట పూర్మజన్మసుకృతము. నే నంతటి పుణ్యమునకు నోచుకొనలేదు. చిట్టచివరన సవరణల నిచ్చియున్నాను. సహృదయు లది గమనింప ప్రార్థన.

కృతజ్ఞతలు:

ఇన్నాళ్ళు అసమగ్రము బహుశిథిలముగా నున్న శివరాత్రి మాహాత్మ్య మీనాటికి సమగ్రముగా వెలువడుటకు కారణము క్రొత్తగా దొరికిన తాళపత్ర గ్రంథము. దయతో దాని నిచ్చిన శ్రీ శంకు శంకరప్పగారి కెంతయు కృతజ్ఞుడను. ఈ గ్రంథమును ప్రకటించి పుణ్యము కట్టుకొన్న హైద్రాబాదు ఆంధ్ర సారస్వత పరిషత్తువారికి, దీని పరిష్కరణసమయమున నాకు కలిగిన సంశయములు తీర్చిన గురుపాదులు శ్రీమదాచార్య రఘునాథచక్రవర్తిగారికిని కృతజ్ఞుడను.

-బి. రామరాజు
1-8-117/ 2 చీకటిపల్లి,
హైదరాబాదు - 20.
శా.శ. 1888 పరాభవ భాద్రపద
శుద్ధ అష్టమి, బుధవారం.
21-9-1966

[1] ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, సంపుటము 54, సంచికలు 1, 2, విశ్వావసు చైత్ర-ఆషాఢములు, కాకినాడ.

[2] వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, శృంగార శ్రీనాథము - 1923.

[3] శ్రీనాథ కవితాసమీక్ష ప్రథమసంపుటము, కాకినాడ - 1960.

[4] ఆంధ్రకవితరంగిణి, ఐదవ సంపుటము, పుటలు 25-31.

[5] శివరాత్రి మాహాత్మ్యము - పూర్వముద్రణ పీఠికలు.

[6] శృంగార శ్రీనాథము, పుట - 276.

[7] రెడ్డి సంచిక, పుట - 301.

[8] ఆంధ్రకవితరంగిణి - ఐదవసంపుటము.

[9] “శ్రీనాథుని రచనలు-పూర్వాపరాలు”, సాహితి, సంపుటము 5, సంచికలు 4, 5. జులై-ఆగస్టు, 1966. (ఏలూరు)

[10] ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రకాశితము-44, కాకినాడ.

[11] అనుముల రామనాథశాస్త్రి పరిష్కృతము, శ్రీ ముదిగొండ బుచ్చిలింగయ్యశాస్త్రిగారి పంచాక్షరీ ముద్రాక్షరశాలలో ముద్రితము, హైదరాబాదు-1932.

[12] ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక, సంపుటము 40. సంచికలు 500, కాకినాడ.

# ద్వితీయముద్రణ (1968) పీఠిక

ప్రథమముద్రణమును చూచి కొన్ని సవరణలు సూచించిన పూజ్యులు శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారికి, బ్రహ్మశ్రీ విద్వాన్ కట్టి సాంబమూర్తిశాస్త్రిగారికిని కృతజ్ఞతలు. సహృదయులు ఇంకేమైన సవరణలు సూచించినచో తరువాత ముద్రణమున దిద్దుకొందును.

-బి. రామరాజు
15-3-68

# ప్రథమాశ్వాసము



## ఇష్టదేవతా ప్రార్థనాదికము



(గౌరీస్తనగంధసారఘుసృణశ్రీ)[1]వాసితోరస్స్థలీ-
నాగాధీశవిశిష్టసంస్తవలసన్నాళీకపాదద్వయ-
ప్రాగల్భ్యుండగు శంకరుండు మనుచుం బ్రత్యక్షమై యెప్పుడున్
యోగీంద్రాఖ్యుని ముమ్మడీంద్రసుతునిన్ నుద్యుక్తశాంతాత్మునిన్. ||1||

శా. శ్రీరామారమణుం డశేషజగతీక్షేమంకరప్రక్రియా-
భారాయత్తమనస్కుఁ డార్యజన[2]సంభావ్యుండు భవ్యాత్ముఁడై
గారామారఁగ నుమ్మమాంబికసుతున్ గౌరీశభక్తాగ్రణిన్
ధీరున్ ముమ్మయశాంతునిన్ మనుచు సందీర్ఘాయురర్థాఢ్యుఁగన్. ||2||

ఉ. నాలుగు మోములం దనర నాలుగు వేదము లభ్యసించుచున్
నాలుగు నైదు రూపముల నవ్యసుఖ(స్థితి సృష్టి)[3]చేయుచు
న్నాలిని బుక్కిటం దిడి విహాయసవీథిని నంచ నెక్కి తాఁ
జాలఁ జరించు బ్రహ్మ ఘనశాంతుఁడు శాంతనఁ బ్రోచుఁ గావుతన్. ||3||

చ. హరిహరపద్మజాదులగు నాద్యులు సంతతభక్తియుక్తులై
చిరమగు నిష్టసంపదలఁ జేకొని లోకములన్ సృజింపఁగా
నరుదుగఁ బ్రేమఁ బ్రోవ లయమందఁగఁ జేయఁగఁ గర్తలైరి నీ
[4]పరమహనీయతత్త్వ మనివార్యము సద్గుణశీల పార్వతీ. ||4||

గీ. మదనుఁ గన్నతల్లి మాధవునిల్లాలు
బ్రతుకులెల్లఁ దానె పట్టిచూడ
ముఖ్యమైన లక్ష్మి ముమ్మయశాంతాత్ము
మందిరంబునందు మసలుచుండు. ||5||

చ. కవికవితాబ్ధిలోన ముఖగహ్వర మోడయు జిహ్వ త్రెడ్డు హృ-
త్పవనుఁడు పీలికాఁడు మృదుభాషలు రత్నము(లై చెలంగఁగా
కవి పర)మాత్మ వర్తకుని కైవడి నీకు విశేషసత్కృతుల్
గవయఁగ [5]వచ్చె నీవలనఁ గావ్య[6]సుఖాత్ముఁడ [పోలె] భారతీ. ||6||

క. యుక్తాయుక్తనిరీక్షణ
శక్తుఁడు గాఁ డీతఁ డన కజస్రము కరుణా-
సక్తమతి మమ్ముఁ బ్రోవుము

భక్తపరాధీన వీరభద్రస్వామీ. ॥7॥

సీ. ప్ర[కట] గర్జారౌద్రభాసితచంచలో- | ద్దామనీలాంబుదశ్యామదేహు
దనుజదర్పధ్వాంతదారుణసప్తార్చిఁ | బన్నగకేయూరుఁ బ్రకటమూర్తి
దారితశ్రీస్థిరాదర [వరహ]స్తుని | దక్షాధ్వరాటవీదావదహను
శమనజిహ్వాభీలసంకాశఘోరాసి | దక్షిణదోర్దండధారు వీర-
ఆ.వె. భద్రు భక్తచిత్తపరిపూర్ణు వాసవ- | వం[దితాం]ఘ్రియుగ్ము వారణాసు-
రారిమూర్తియైన యభినవరూపుని | సన్నుతింతు నేను సరస మెసఁగ. ॥8॥

సీ. దక్షాధ్వరధ్వాంతద[శనభ]ద్రోద్రేక- | సప్తాశ్వుఁ డే దేవు చండహేతి
భుగ్నస్ఫుటాభీలభువనసంక్షోభైక- | గరళ మే దేవు నాక్రమ్యభుక్తి
నిఖిలావనీభారనిర్మలనిర్మాణ- | కరణంబు లే [దేవు కం]కణంబు-
లంధకాసురభీమహంకారపాథోధి- | బాడబం బే దేవు భయదశూల-
ఆ.వె. మమరవరకిరీట విమలకోటీరట- | న్నిబిడమణిమయూఖని[వ]హరుచిర
పాదపద్ముఁడైన పలివెల కొప్పయ్య | నర్థితోడఁ గొల్తు నహరహంబు. ॥9॥

చ. పృథివిని భూధరావలి గభీరము సాగరసప్తకంబు త-
త్పృథితనిబంధనంబు వియదంతరమెల్ల కటిప్రదేశ మా
పృథుతరలోకసంఘములు భీమపిచండ మజాండమాలికా-
గ్రథనము నీదు మస్తమని కాంతురు సిద్ధివినాయకాధిపా. ॥10॥

క. భావమునఁ దలఁతు మద్గురు
భావితలోకుని మదీశుఁ బరమేశసమున్
శైవమతగర్వనిర్వహ-
ణావిష్కృతకీర్తిఁ బండితారాధ్యవరున్. ॥11॥

సీ. బాణు నద్భుతశాస్త్రబహుకలాపారీణుఁ | బ్రకటవరకవితా[భ్యాసు వ్యాసు]
బంధురగాంభీర్య[7]బంధు సుబంధు వి- | స్ఫురితమహోన్నతిస్తోము సోముఁ
జిరతరమతిభద్రుఁ జెన్నారు శివభద్రు | నతులగుణస్ఫారు నమ్మయూరు
వరనీతిచాతురీవాగ్భూతి భవభూతి - | (ముఖ్యసజ్జనదయా)మోఘు మాఘు
గీ. ఘనవినూత్నవికాసు శ్రీకాళిదాసు | దండికావ్యానులాపవాగ్దండి దండిఁ
జిత్రవాగ్జృంభణప్రఖ్యుఁ జిత్తపాఖ్యుఁ | దగిలి మలహణు బిలహణుఁ (దలఁతు నెపుడు). ॥12॥

ఉ. ఉన్నతమైన [8]యంధ్రకవితోక్తుల నెంతయుఁ బ్రోడలైన యా
నన్నయభట్టు తిక్కకవినాయకుఁ [9]దత్సము శంభుదాసు(నిన్
బన్నగుఁ బోలు నా కమలనాభునిఁ జేరి భజింతు నెంతయున్
సన్నుతశబ్ద)శాస్త్రముల సంఘట(నంబు ఘటించు వేడు)కన్. ॥13॥

క. కృతిపతులగు కవిముఖ్యుల
సతతముఁ గొనియాడి వారి సన్నుత(కరుణా-
మతికిన్ బాత్రుఁడ నేనే
వితతంబగు కవితచెప్ప వెరవని మతితోన్). ॥14॥

క. (ఉజ్జ్వెన సుకవి)కోటుల
తెఱఁ [10]గిది యని తప్పులెల్లఁ దీర్తురు వశులై

యెఱుఁగరు సుకవులఁ గుకవులు
కఱకులు [11]వలుకుటయ నేర్పు గర్వప్రౌఢిన్. ॥15॥

ఉ. పద్యగణాక్షరప్రకరభావరసారగుణ(ప్రపూర్ణమై
హృద్యవిలాస)శబ్దపదహేతుకళారససత్క్రియాఢ్యమై
యాద్యులు చన్న మార్గమున నా వళి ప్రాస విడంబబంధమై
చోద్యముగాఁగఁ జెప్పు కృతి శ్రోత్రసుఖావహ మెల్లచోటులన్. ॥16॥

శా. (జాతాజాత చరాచరప్రతతికిన్) [12]సంభూతకస్థానమై
ఖ్యాతంబై బుధహృద్యమంగళకవీంద్రాచార్యసంసేవ్యమై
యాతారార్కసుధాంశువై కమలజాతాకల్పమై యెప్పుడున్
జ్యోతిశ్చక్రముఁ బోలెఁ గ్రాలవలదా సోం(పారి కావ్యం బిలన్). ॥17॥

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును, గురుప్రశంసయుఁ, గవీశ్వరప్రస్తుతియుఁ, గుకవినిరాకరణంబునుం జేసి యొక్క కవితావిధానంబు శైవంబుగా సుకుమారచరిత్రంబు (చెప్పంబూనిన యవసరంబున) స్వస్తి శ్రీపర్వతస్వయంభూ శ్రీలింగచక్రవర్తి శ్రీమన్మల్లికార్జునమహాదేవుని ముఖమండపంబున సుఖాసీనులయి యంచుగండ(దేవ) పృథ్వీమహా(మహత్తును, నానాదేశాగతానేక బ్రాహ్మణ)భక్తప్రకరంబులును, విజయసదృక్షులగు శుద్ధక్షత్రియులును, ధనపతిసమానసంపద్భాసితులగు వైశ్యులును, నిర్వక్రపరాక్రములగు వీరభటులును, [13](శంకరపురాధ్యక్షులును), స్థానా(ధికారులును, బాహత్తరి)నియోగంబును, గుండలి దండ లాసక [14]ప్రేరణి ప్రేంఖణంబులైన చతుర్విధనృత్తగీతవాద్యాభిజ్ఞులును, గళావిలాస[15]కరణాసనబంధురబంధభేదంబులం [16]గంధర్వసంగరప్రవీణలయిన (కురంగలోచనలును బలసి)యుండ, శ్రీశాంతభిక్షావృత్తియతీశ్వరుండు శివకథావిధానంబులఁ [17]బ్రొద్దులు పుచ్చుచుఁ దన మూలభృత్యుండగు [18]నుప్పలపు ముమ్మడిదేవయ్య శాంతునిం గనుంగొని నీ పేర (నంకితంబుగా నంధ్రభాషా) కవిత్వంబున నీ కథ యుపన్యసింపుమనిన మహాప్రసాదంబని సత్కవిసార్వభౌముండగు శ్రీనాథకవివరేణ్యుని గృపావిశేషంబునం గాంచి శ్రీమన్మల్లికార్జున మహాదేవ(దేవు పాదపద్మారాధకులగు) అంచుగండముఖ్య [19]రేవణసిద్ధ యేకోరామేశ్వర పండితారాధ్యాది చాతుర్వర్ణ్యంబులం గలిగిన మ(తంబుల) యందు (పండితారాధ్యహస్తసంభూత వంశంబులయందు నుద్భవం)బందిన మల్లినాథగురుండు. ॥18॥

సీ. లింగార్చనక్రియాలీల నే ప్రొద్దును | గరికాల[20]చోడని కరణివాఁడు
జంగమారాధనాసక్తి మై(నేపార | బల్లాణభూనాథు పాడివాఁడు
పరమశైవాచారపాండిత్యవిస్ఫూర్తి | సంగన బసువయ్య) సరణివాఁడు
వరధర్మచాతురీవైభవఖ్యాతిచే | [21]చెన్నమరాయని చెలువువాఁడు
గీ. ననఁగ నిద్ధాత్రి నింపారు నఖిలకళల | సకలనిర్మాణవిద్యాప్రశస్తుఁ డనఁగ
మానితైశ్వర్యసంప్రాప్త(మహితయశుఁడు) | మల్లికార్జునయోగిసమాజ[22]వరుఁడు. ॥19॥

క. ఆతని వంశంబునఁ బ్ర-
[23]ఖ్యాతచరిత్రప్రతాపకలనాధర్ముం
డాతతవిక్రమశీలుఁడు

భూతలమునఁ గొమ్మవిభుఁడు పొలుపై వెలసెన్. ॥20॥

వ. తదనుసంభవుండు. ॥21॥

సీ. [24]చేఁపూరి భీమేశుఁ జెలువార గుండెలఁ | బూజ గావించిన పుణ్యమూర్తి
కడిమిమై నిరువత్తుగండనిచే మల్లి- | కార్జును కుత్పలం బర్థిఁ బడసె
గొలని రామారెడ్డివలన (శ్రీగిరినాథు | కర్పించె భరణాలు గరి)మతోడ
భక్తిరాజాఖ్యుచేఁ బర్వతేశ్వరునకు | నర్పించెఁ [25]జెరువాలు నాతుకూరు
గీ. ధరణిఁ ద్రిపురాంతకున కాముదాలపల్లి | రాయవేశ్యా[26]భుజంగువల్లావ యిచ్చె
నిట్టి పౌరుష (సంపన్నుఁ డిద్ధయశుఁడు) | పోలిదేవయ్య చెన్నారుఁ బుణ్యమూర్తి. ॥22॥

వ. ఆ గురుస్వామి నిజవంశాచారంబునకు దగిన తలోదరిం బరిణయంబయ్యె నంత. ॥23॥

సీ. గౌరీతలోదరి గాఁబోలు నీ భా(మ | కారుణ్యవిస్ఫూర్తి గలిగి)యుండు
శ్రీలక్ష్మి గాఁబోలుఁ జెలువ సౌభాగ్యంబు | దిక్కులనెల్లను బిక్కటిల్లు
వాగ్దేవి గాఁబోలు [27]వామాక్షి బహుశాస్త్ర- | పాండిత్యవిస్ఫూర్తిఁ బరిఢవించు
నింద్రాణి గాఁబోలు నిందునిభాస్య (తాఁ | బావన)ఖ్యాతిమై బరఁగుచుండు
గీ. ననఁగ నే ప్రొద్దు గుణముల నతిశయిల్లి | [28]పరఁగు శ్రీశైలనాథుని పట్టణమునఁ
బోలిదేవయ్య కులసతి పుణ్యచరిత | ముదిత [29]సజ్జననికురుంబ ముమ్మమాంబ. ॥24॥

ఉ. *పోలయ ముమ్మమాంబికలు పుణ్యచరిత్రుల భక్తియుక్తులం
బోలఁగఁ గాంచి రేడ్వురను బుణ్యబుషీశ్వరసప్తతుల్యులం
బోలిన పుత్రసప్తకము భూతహితార్థగుణప్రవృత్తికై
లాలితవిక్రమోన్నతుల లక్షణదివ్యవిచక్షణాత్ములన్. ॥25॥

సీ. రామామనోహరరతిరాజ[30]నిభుఁడు శ్రీ- | మల్లినాథాఖ్యుండు మహిమ వెలయు
(ధర్మార్థ సం)చారనిర్మలస్వాంతుండు | శ్రీగిరినాథయ్య చెలువుమీఱఁ
బరమశైవాచారపాండిత్యగరిమల | [31]సెట్టిదేవాఖ్యుండు చెన్నుమీఱు
వైభవప్రఖ్యాతవరహరిశ్చంద్రుండు | భీమేశ్వరస్వా(మి పెంపుమీఱు)
గీ. వెలయు ముమ్మడిదేవయ్య వినుతకీర్తి- | ఘనుఁడు కొమరగిరీంద్రుండు గలిగియుండు
(భూతిఁ) బోతలింగాఖ్యుఁడు పొలుపుమీఱు | సప్తబుషులకు నే ప్రొద్దు సము(లనంగ). ॥26॥

క. (వారలలోపల సెట్టియ
ధారుణి శ్రీపర్వతేశు దండాధీశుం
డారయ ననఁగా వెలసెను)
కారణజన్ముండు (నవ్యకావ్యాసక్తిన్). ॥27॥

సీ. (శివరాత్రి నిత్యంబుఁ జెల్లించు విఖ్యాతి | బసువయ్య దండాధి పాటివాఁడు)
లింగార్చనక్రియా(లీలల నే ప్రొద్దు | సురియ చౌడాధీశు సొబగువాఁడు)
పరమలింగధ్యానపారీణసద్బుద్ధి | నల్లమప్రభు లీల నలరువాఁడు
[32]రుచ్యర్పణక్రియారూఢి నిద్ధారణి | మాదరచెన్నయ్య మహిమవాఁడు

గీ. చెలఁగె గురులింగజంగమసేవకుండు | మల్లికార్జునశివునకు మంత్రి యనఁగఁ
దూర్పునాఁడెల్లఁ బాలించు నేర్పరతఁడు | శ్రీసమేతుండు పోలయసెట్టివిభుఁడు. ||28||

వ. అమ్మహాత్ముండు దన [33]వర్ణంబునకుం దగిన వర్ణనీయయగు సాధ్వి వివాహంబయ్యె నంత. ||29||

సీ. పార్వతీమూర్తియు భారతీదేవియు | నిందిరారూపంబు నింద్రుసతియు
రోహిణీదేవియు రుక్మిణీ[34]దేవియు | స్వాహాస్వధాతులశక్తిచయము
గంధర్వసతులును గందర్పుభామయుఁ | గశ్యపుసాధ్వులుఁ గ్రతువు[35]సతియు
వరవసిష్ఠునిరాణి ధరఁ గుంభసంభవు- | రామయు నాదిత్యురమణిఁ గూడి
గీ. ధరణి నొక్కటఁ బుట్టించె ధాత[36]యనఁగ | మగువ సెట్టిదేవాఖ్యుని మారమాంబ
సకలసద్గుణవిఖ్యాత[37]సౌమనస్య | మహితపంచాక్షరీమంత్ర [38]మంజులాత్మ. ||30||

క. సెట్టియ[39]మారమ గాంచెను
దట్టుల భీమయ్యఁ బ్రోలధరణీధవునిన్
[40]దుట్టురగండని ముమ్మయ-
[41]సెట్టన విలసిల్లు వీరశేఖరు [42]నర్థిన్. ||31||

క. పారావారగభీరుఁడు
నారీజనమన్మథుండు వరసుతుఁ డనఁగా
ధారణి సెట్టియభీముఁడు
వారక వర్ధిల్లునెపుడు వైభవ మలరన్. ||32||

క. లాలితవైభవశీలుఁడు
లోలాక్షీమన్మథుండు లోకఖ్యాతుం
డాలోలచరిత్రుఁడు ధరఁ
బ్రోలామాత్యుండు వెలసెఁ బుణ్యోదయుఁడై. ||33||

సీ. పంచాక్షరీమంత్ర పారిజాతోద్భూత | ఫలము లే గురువు సంభాషణములు
వీరశైవాచారవిమలమార్గానూన- | శాశ్వతం బే గురుస్వామి మహిమ
నిఖిల[43]దేశాధీశనివహ[44]ప్రణామైక- | పాత్ర మే గురుమూర్తి పాదయుగళి
శంకరపూజాప్రశస్తదీక్షాజనా- | హ్లాద మే గురువు హస్తాంబుజాత-
గీ. మనఁగఁ బండిత చెనమల్లికార్జునునకుఁ | బౌత్రరత్నంబు సెట్టియ ప్రభుసుతుండు
మారమాంబాతనూజుండు మహితయశుఁడు | వెలయు ముమ్మడి దేవయ్య వినుతకీర్తి. ||34||

ఉ. శ్రీగిరి తూర్పుదేశమునఁ జెన్నగు భక్తిమహత్త్వ (మర్థిఁ దా
నా)గమవేదశాస్త్రముల నంచితధర్మకథాప్రసంగతిన్
(యాగ)విశేషసూత్రముల నాయతశక్తి సుభక్తియు(క్తుఁడై)
(శ్రీగురుఁడైన ప్రోలగురు సెట్టియ ముమ్మయ) చెప్ప నొప్పెడున్. ||35||

క. వారక (సెట్టియ వీరన)
సారార్థము లయిన [45]కృతుల సభలోపలఁ దా
గారామారఁగఁ బలికిన
శారద యా [46]రూపనంగ జగతిఁ జరించున్. ||36||

ఆ.వె. (వారిలోన వెలసె వరజయగండండు
బిజ్జ)లాఖ్య మానభీకరుండు
బసవశంకరుండు పరవాదిమండూక-
భయదపన్నగుండు [47]భక్తిఘనుఁడు. ॥37॥

క. [48]శ్వేతాంబరుఁ బొలియించిన
ఖ్యాతచరిత్రుండు జైనకాకోదరతా-
ర్క్ష్యాతతబిరుదాంకుఁడు సం-
జాతప్రవిలీన బిరుద[49]సమ్మతుఁ డెలమిన్. ॥38॥

చ. పరిణయమయ్యెఁ గాంతఁ గులభామిని రుద్రయపుత్రి శాంకరిన్
[50]సరసకలాభిరామ కులసంస్తుత పుణ్యచరిత్రయుక్తయై
యరయఁగఁ బుట్టినట్టి త్రిపురాంబికకూఁతురు భాగ్యదేవతన్
బరమపతివ్రతానిలయ భాసురనిర్మలగాత్రి నర్థమై. ॥39॥

సీ. పరమపాతివ్రత్యభావంబు తలఁపంగ | గౌరి గాఁబోలు నీ కాంత తలఁప
సకలసంపత్స్ఫూర్తి చాతుర్యమహిమల | నిందిర గాఁబోలు నిందువదన
సకలవిద్యాప్రౌఢి సడిసన్న గరిమల | భారతి [51]గాఁబోలు భామ యెపుడు
సర్వలక్షణగుణసంపన్నతోన్నతి | నింద్రాణి గాఁబోలు నిగురుఁబోణి
గీ. యనఁగ నిద్ధాత్రి నే ప్రొద్దు నతిశయిల్లెఁ | బరఁగ ముమ్మడి దేవయ్య భామ జగతిఁ
[52]గామితార్థైకసంధానకల్పవల్లి | యుజ్జ్వలద్గుణనికురుంబ యొమ్మమాంబ. ॥40॥

ఉ. ముమ్మడిదేవచంద్రునకు ముఖ్యతలోదరి యొమ్మ[53]మాంబకున్
(సమ్మద శైవశాస్త్రపరిసంచిత నిర్మల)శుద్ధ[54]యుక్తికిన్
ఇమ్మహి నెల్లవారలకు నీప్సితవస్తువిధాయియై ధరన్
సమ్మతి నుద్భవిల్లె [55]వరశాంతుఁడు శాంతన [56]యగ్రగణ్యుఁడై. ॥41॥

సీ. పరవాదిమత్తేభపంచాననాఖ్యుఁడు | పరవాదిమండూకపన్నగుండు
పరవాదినవమేఘపవమానధీరుండు | పరవాదిసాగరబాడబుండు
పరవాది[57]కుత్కీలభాసురదంభోళి | పరవాదికేంధనపావకుండు
పరవాదిచయతమఃపటలోగ్రభానుండు | పరవాదిభోగిసుపర్ణుఁడనఁగఁ
గీ. జటులజైనకోలాహలసమర బిరుద- | ఘనుఁడు సంగ్రామపార్థుండు వినుతయశుఁడు
శుభుఁడు ముమ్మడిదేవయ్య సుతుఁ డనంగ | వెలసె శాంతయ్య విక్రమవీరవరుఁడు. ॥42॥

గీ. వేడ్కఁ గవిసార్వభౌముని విమలచరిత
స్కాందపౌరాణికంబైన కథలలోన
ఘనత శివరాత్రిచరితంబుఁ దెనుఁగుగాఁగఁ
గరుణఁ జేయుము శ్రీనాథకవివరేణ్య. ॥43॥

వ. అనవుడు నమ్మహీసురాగ్రగణ్యుండు కమలనాభామాత్యపౌత్రుండును మారయామాత్యపుత్రుండును నగు శ్రీనాథకవివరేణ్యుండును [58]సంతుష్టమానసుండై శాంతస్వామి యొసంగిన కర్పూరతాంబూల జాంబూనదాభరణంబులు స్వీకరించి [59]స్కాందంబున నీశానసంహితయందుం జెప్పంబడిన యురులింగోద్భవంబును,

శివరాత్రిమాహాత్మ్యంబును, (సుకుమారోత్పత్తియు, యమ-శంకర సంవాదంబును, యమ-శివదూత సంబోధనంబును నను పంచమాశ్వాసానుకీర్ణంబై యొప్పు) [60]కథానిధానంబున కధీశ్వరుఁగా (శాంతదేశికేశ్వరుం బరిగ్రహించి). ॥44॥

## షష్ఠ్యంతములు

క. (సత్యహరిశ్చంద్రునకును,
నిత్యాప్రతిమాన) దాననిర్మలమతికిం
గృత్యాకృత్యవివేకికిఁ
బ్రత్యర్థిద్విరదదళనపంచాస్యునకున్. ॥45॥

క. రామామన్మథమూర్తికి
రామత్రయ[61]లీనమతికి రమ్యాత్మునకున్
[62]సోమవ్రతవరకాంతికి
భీమజయోత్కటవిశేషభీకరమతికిన్. ॥46॥

క. శైవాగమశాస్త్రాది
ప్రావీణ్యాగణ్యపుణ్యభరితాత్మునకున్
భావాభావవివేకికి
భావితవంశావతారపరమాత్మునకున్. ॥47॥

క. జంభాంతకవైభవునకు
సంభృతశాస్త్ర[63]ప్రతాపశైలోన్నతికిన్
శుంభత్ప్రాభవరతికిన్
దంభోళిస్ఫురితతీవ్రతరఖడ్గునకున్. ॥48॥

క. [64]వరముమ్మయశాంతునకుం
బరమ[65]పరిజ్ఞాననిధికిఁ బావనమతికిన్
నిరుపమవిక్రమయశునకుఁ
గరుణారసపూరితాత్మకలితాంగునకున్. ॥49॥

వ. అభ్యుదయపరంపరాభివృద్ధియు, నభిమతార్థసిద్ధియు, సత్యధర్మక్రియావృద్ధియు నగున ట్లష్టాదశవర్ణనాగర్భంబుగా నత్యాశ్చర్యకరంబై యుండ నా రచియింపబూనిన కథానిధానంబు సకలపాపనిర్ముక్తంబై [66]సర్వవస్తుసంధానంబై, సర్వలక్షణసంపన్నంబై, సర్వాగమానూనసంభావితసంస్తుత్యంబై, పరమధర్మోత్కృష్టంబై, పరమేశ్వరప్రియంబై, పార్వతీమనోహరంబై, శ్రీనాథసేవితంబై, *(బ్రహ్మరుద్రాది దేవతాసంస్తూయమానంబై), (యథావిధి) శోభిల్లు నిప్పుణ్యాచారిత్రంబు *(దశదోషవివర్జితంబై) నా నేర్చిన విధంబున రచియించెద నది యెట్టిదనినఁ బూర్వోక్తమార్గంబునఁ బరిపూర్ణంబై యథావిధి శోభిల్లు *(నిప్పుణ్యాచారిత్రంబుఁ బోలి)నట్టి ధర్మక్షేత్రంబును మహాతీర్థంబును నగు గంగాకాలిందీసంగమంబున [67]సంశ్రితాత్ములు సత్యవ్రతపరాయణులు నగు శౌనకాది మహామునులు దీర్ఘసత్రంబునందుఁ గూడియుండ (నవ్వేళ) వేదవ్యాసప్రియశిష్యుండు రోమహర్షణతనయుండు పౌరాణికుండు సూత్యాహిసంభవుండు సూతుం డేతెంచిన సంప్రహృష్టమానసు లయి యమ్మహామును లాసనార్ఘ్యపాద్యాదులం బూజించి యతని కిట్లనిరి. ॥50॥

సీ. సర్వజ్ఞ రోమహర్షణతనూభవ సూత | యఖిలపురాణవిద్యాప్రగల్భ
పంచావయవయుక్త భవ్యకావ్యవిదగ్ధ | యాశ్చర్యహేతువులైన కథలు
[68]రత్నాకరమునందు రత్నంబులునుబోలెఁ | గలవు నీయందుఁ బొగడ్త గాదు
నీ వెఱుగని విద్య లీ విశ్వమున లేవు | తర్కించి యెన్నివిధములఁ జూడ
గీ. నుత్తరోత్తర [69]సత్కృత్య మొప్పు నీకుఁ | గాలనిర్ణయకలన నీ కరతలంబు
పూర్వమున మేము సేసిన పుణ్యమెల్ల | ఫలితముగ [70]నేఁగుదెంచితే ప్రార్థనంబు. ‖ 51 ‖

వ. వేదంబులు నాలు గంగంబు లాఱు మీమాంసాన్యాయ విస్తరపురాణ ధర్మశాస్త్రంబు లాయుర్వేద ధనుర్వేదంబు లర్థశాస్త్రంబు లను నష్టాదశవిద్యానిధానంబులకు నాదికర్త సదాశివుం డా శూలపాణి యమ్మహాస్థానంబులు బ్రహ్మ కుపదేశించె. అనంతరంబ శంకరాజ్ఞాప్రచోదితుండై కృష్ణద్వైపాయనాభిధానంబున ననాదినిధనుండు పుండరీకాక్షుండును, నరణియందు వైశ్వానరుండునుం బోలె ద్వాపరాంతంబున సత్యవతియం దావిర్భవించె. వేదార్థోప[71]బృంహణార్థంబు సర్గ ప్రతిసర్గ వంశ మన్వంతర వంశానుచరితంబు లను పంచలక్షణంబులం గలిగి [72]బ్రాహ్మంబు వైష్ణవంబు శైవంబు భాగవతంబు భవిష్యంబు నారదీయంబు మార్కండేయం బాగ్నేయంబు పాద్మంబు బ్రహ్మకైవర్తంబు లైంగంబు వారాహంబు స్కాందంబు వామనంబు కౌర్మంబు మాత్స్యంబు గారుడంబు బ్రహ్మాండంబు నను మహాపురాణంబులు పదునెనిమిది గల్పించె నవియు. ‖52‖

గీ. గ్రంథసంఖ్యఁ బురాణసంఘంబు గూడి
[73]నాల్గు లక్షలౌ నీ పురాణములలోన
నూఱువేల్గ్రంథములలోన నుతి వహించి
శ్రీమహాస్కాందసంహిత శివునిఁ జెప్పు. ‖53‖

వ. అందు శివరాత్రిమాహాత్మ్యంబు చెప్పంబడి యుండు; నమ్మహావ్రతం బెట్టి దెవ్వ రాచరించి రే ఫలంబు నొసంగు మాకుం బరిపాటి తేటపడ వివరింపుమనిన నక్కథకుండు శౌనకాది మహామునుల కిట్లనియె. ‖54‖

ఉ. తాపససార్వభౌములు సదాశివరాత్రిమహావ్రతంబు [74]దో-
షాపహృతిక్షమంబు వినుఁ డాదరణంబున నేను సద్గురు
శ్రీపదపద్మముల్ దలఁచి చెప్పెద శంకరసంహితాకథా-
దీపితభవ్య[75]మార్గమున దేటపడన్ మొదలింటినుండియున్. ‖55‖

గీ. ప్రళయకాలంబు [76]తుదఁ గాళరాత్రి చనిన
[77]నపరమగు సర్గమునకు బీజాంకురంబు
శీతమును నుష్ణమును [78]గాక చిలుపచిలుప
గంధవాహంబు [79]వీచె నిర్గంధమగుచు. ‖56‖

సీ. మూలముట్టుగ[80]ను నున్మూలనంబును బొంది | మహిధరంబులు రూపుమాలి యుండఁ
ద్రిభువనంబులుఁ జలత్తృణరాశియునుఁ బోలె | సప్తార్చిచేత భస్మంబు గాఁగఁ
బుష్కలావర్తకాంభోధరంబులు వృష్టి | విశ్వప్రపంచంబు వెల్లిగొనఁగ
భూర్భువస్స్వర్లోకములు మహర్లోకంబు | జనలోక మెక్కి విశ్రాంతి మెఱయ
గీ. నఖిలదిక్కులు ముంచి బ్రహ్మాండగోళ | మప్పళింపుచు సప్తార్ణ(వాంబువులును)

నిండికొనియుండఁగా రిత్తనింగితోడఁ | గొంతకాలంబు శూన్యమై గొడ్డుపోయె. ॥57॥

వ. అప్పుడు బ్రహ్మ నారాయణుండై శివయోగముద్రాముద్రితలోచనుం డగుచు సముద్రంబు నడుమం బవ్వళించిన. ॥58॥

క. జనలోక మెక్కి సిద్ధులు
వినుతించిరి జలధిసలిలవీచీ[81]రింఖ-
ద్ఘనజాతయోగనిద్రా-
వినిమీలితదీర్ఘనయను విషధరశయనున్. ॥59॥

గీ. దేవతలు సంస్తుతించంగఁ దెల్లవాఱెఁ
గల్పసంహారకాలంబు కాళరాత్రి
యంత మేల్కని కూర్చుండె నాదిపురుషుఁ
డాదిమబ్రహ్మ జగము సేయంగఁ దలఁచి. ॥60॥

గీ. అభినవోన్మేషజిహ్మ మైనట్టి దృష్టి
దిశలు వీక్షించెఁ ద్రిభువనాధీశ్వరుండు
[82]చింతనొందె లోకంబు [83]సృజించు వెఱవు
హృదయమున (నిట్టిదని నిశ్చయింపలేక). ॥61॥

ఉ. (ఎక్కడఁ బోయెనో ధరణి యిందునిభాకరు) లెందణంగిరో
చుక్కలసుద్ది యెద్ది[84]యొకొ చూడఁగఁ గందుమె పర్వతంబులన్
దిక్కుల చాయ లెవ్వి యని ధీరత నల్విటు చింత[85]నొందె నే
(సక్కటి చూచినం దిమిరసం)హతి విశ్వము ముంచియుండఁగన్. ॥62॥

క. అంతఃకరణంబున నటు
చింతిలి యుండుచుఁ బ్రపంచసృష్టికినిఁ [86]గ్రియో-
దంతమ్ము లేక దుర్వ్యథ
సంతన కట్టఁగ విధాత చాలండయ్యెన్. ॥63॥

వ. వెండియు బహువిధంబుల నూహాపోహ లొనర్చియుఁ బుండరీకసంభవుండు భువననిర్మాణక్రియారంభంబునకు నుపాయంబుఁ గానక చీకాకుపడి కాకోదరగ్రామణీగ్రైవేయు భగవంతుం గృతాంతఘస్మరు సంస్మరించి తత్ప్రసాదంబున వసుంధరాగోళంబు మహాంధకారమగ్నం బగుట యెఱింగి యజ్జగద్ధాత్రుల నుద్ధరింపం దలంచి. ॥64॥

శా. క్రోడాకారము దాల్చి కంఠభవఘుర్ఘుర్ ధ్వానవిస్ఫూర్తిఁ బా-
తాళక్రోడమహా[87]కటాహమున సందారింపఁ దత్కంధరా-
గోళస్థాయినియైన భూమి పృథువక్షోజప్రదేశంబునన్
లీలాసత్ఫలకాంకురంబు లెగయన్ వెన్నుండు మున్నీటిలోన్. ॥65॥

గీ. లోఁతుమున్నీటిలోపల నీఁతలాడెఁ
గూట[88]కోలావతారుఁడై కైటభారి
చటులవాల కశాఘాతసంప్రభూత-
[89]నీరమడ్డుస్వనంబున నింగి యదుర. ॥66॥

సీ. కాఁడిపాఱిన మేనిగరులు బ్రహ్మాండంబు | [90]కడపపూబంతి కక్కజము దోప
ఖురపుటంబునఁ గీలుకొని మేరుకుధరంబు | మువ్వలోపలి [91]జాతిమురువు [92]వడయ
దీర్ఘకంఠకఠోరఘుర్ఘురస్వనమునఁ | బాతాళగోళంబు బాతలింప
నీలాంబుదశ్యామనిబిడదేహచ్ఛాయఁ | [93]బ్రళయాంధకారంబు దొలకరింప
గీ. సప్తపాతాళముల క్రిందఁ జాఁగిపడిన | యవని నెత్తె నిశాతదంష్ట్రాంకురమున
నభినవస్తబ్ధరోమదివ్యావతారుఁ | డంబురుహలోచనుండు కల్పాదియందు. ॥67॥

వ. ఇవ్విధంబున మహాపర్వతసన్నిభంబును *(నీలమేఘప్రతీకాశంబును దంష్ట్రాదండదారుణంబును విపులవృత్తఘనస్కంధంబును సమున్నతకటితటంబును హ్రస్వవృత్తోరుజంఘాగ్రంబును దీక్ష్ణఖురమండలంబును బద్మరాగసదృశేక్షణంబును దృఢదీర్ఘమహాప్రోథంబును సముదీర్ణోచ్ఛ్వాసనిశ్వాసవిఘూర్ణిత ప్రళయార్ణవంబును) విద్యుచ్ఛటాపాటల *(సటా)చ్ఛన్న కపోలస్కంధబంధురంబును[94]నయిన వరాహరూపం బావహించి రసాతలంబున సలిలమగ్నయగు పృథివి నుద్ధరించిన. ॥ 68॥

గీ. దానవారాతిదంష్ట్ర నెత్తంగఁబడిన
[95]యుర్వి సూపట్టు జలధి నీ రోడి(గిలఁగ
పసిఁడికామ హత్తించిన పంబుతోడి
క్రొత్త) వెలిపట్టు జగజంపు గొడుగువోలె. ॥69॥

సీ. జయజయధ్వనులతో సనకాది మునికోటి | వేదాక్షరంబుల వినుతి సేయ
బహుళసౌరభ(పరంపర) లుప్పతిల్లంగ | విద్యాధ(రులు పుష్పవృష్టి) గురియ
దివ్యదుందుభిసముత్థితనినాదంబుల | (భువననిష్కం)భంబు బోరు కలఁగ
జోకయై యప్సరస్సుదతీకదంబంబు | నింగిమీఁదఁ బ్రమోదనృత్త మాడ
గీ. జద్దువడి యుండె నొక కొంత ప్రొద్దు వేడ్క | నవయవంబులు గరుదాల్ప నచ్యుతుండు
ప్రళయజలనిధి క్రింద (లోబ)డినయట్టి | యుర్వి దంష్ట్రాంకురంబున నుద్ధరించి. ॥ 70॥

గీ. సురలు తనమీఁదఁ బువ్వులసోన గురియఁ
జూడ నొప్పా[96]రె హరి [97]శరక్రోడమూర్తి
కందరంబుల ఖద్యోతగణము మెఱయఁ
జాల నొప్పారు నంజనాచలము వోలె. ॥71॥

వ. ఇవ్విధంబునఁ బ్రళయసలిలోపద్రవం బు[98]డిపి ధాత్రిఁ [99]బూర్వస్థానంబున సంస్థాపించి సర్వసర్వంసహాభార*(వహనం)బునం బ్రభవించిన ప్రయాసఖేదం బుజ్జగించుట[100]కయి పాఁపసెజ్జపై మున్నీటి నట్టనడుమం బవ్వళించి నారాయణుడు నిజాంతర్గతంబున. ॥72॥

శా. దుర్వారోద్యమభంగి దంష్ట్రికతుదిన్ దూరంబుగా [101]నెత్తి యేఁ
బూర్వస్థానమునందుఁ బెట్టితి యథాపూర్వంబుగా నిప్పుడీ
యుర్వీమండలి నెట్టివాఁడనొకొ యోహోయంచుఁ జిత్తంబునన్
గర్వించెన్ మధుకైటభాంతకుఁ డు[102]దన్వద్వారిమధ్యంబునన్. ॥73॥

గీ. అంత నిటఁ దానతానగు నబ్జభవుఁడు
దంభ[103]కోలావతారుఁడు ధాత్రి [104]యెత్తఁ
జాగెఁ బ్రారబ్ధమార్గానుసారమునను
మొదలుకొని యెల్ల విష్టపములు [105]సృజింప. ॥74॥

వ. [106]మహత్సర్గంబు *(భూతసర్గంబు వైకారికసర్గంబును నను) బుద్ధిపూర్వకంబులగు మూఁడును బ్రాకృతసర్గంబులు; ముఖ్యసర్గంబు, తిర్యక్సర్గంబు, దేవసర్గంబు, మానుషసర్గంబు, గ్రహసర్గంబును నా [107]నైదును బుద్ధిపూర్వకంబులు వైకృతసర్గంబులు; కౌమారసర్గంబు ప్రాకృతసర్గంబు. ఈ తొమ్మిదియు నసాధకంబులు సాధకత్వంబును నైహికాముష్మికహితాహిత తదుపాయ తత్ప్రతికారవిరహితంబునం జేసి [108]యప్రయోజనంబులగుట నీ తొమ్మిది సర్గంబులవలనను బ్రయోజనంబు గానక కనకగర్భుండు మహేశ్వరునిం బ్రస్తుతించి తత్ప్రసాదంబునం బురాణప్రజాపతుల *(కశ్యప)మరీచిభృగ్వాంగిరస పులస్త్యపులహక్రతుదక్షవసిష్ఠుల మానసంబునం దొమ్మండ్రను ధర్మాధర్మసంకల్పంబుల మూఁటినిఁ గూడఁ బన్నిద్దఱు పుత్రులఁ గాంచె. ఆ పన్నిద్దఱవలననుం బండ్రెండు దివ్యవంశంబులు ప్రజావంతంబులుఁ గ్రియావంతంబులునై ప్రవర్తిల్లె; నందు *(దేవ)దైత్యదానవముని యక్షగరుడగంధర్వ కిన్నరకింపురుష సిద్ధవిద్యాధర కర్మదేవతాప్సరఃకామినీ రక్షోభూతపిశాచ మనుష్య పశుపక్షిమృగోరగకీటక గిరిగ్రావ వృక్షలతాగుల్మాదులును, గాయత్రీ త్రిష్టుప్సామరథంతరంబులును, అగ్నిష్టోమహయమేధ వాజపేయాతిరాత్ర పౌండరీకాదులు లోనుగా గలుగు చరాచరంబులు ప్రాజాపత్యాంగోపాంగప్రత్యంగంబుల జన్మించె; నివ్విధంబున నఖిలప్రపంచంబు నిర్మించి విరించి నిజాంతర్గతంబున. ॥75॥

ఉ. ఏ నధికుండ నాకుఁ బ్రతి యెవ్వరు నిర్జరకోటిలోన నేఁ
[109]గాని జగత్ప్రపంచపరికల్పన సేయఁగలేఁడు తక్కొరుం
డే నఖిలేశ్వరుండనని యెవ్వరునుం బ్రతికోటిలేమిఁ దాఁ
దాన యహంకరించెను విధాత సదా[110]శివు మాయపెంపునన్. ॥76॥

వ. ఇవ్విధంబున నవష్టంభంబు గైకొని యంభోరుహసంభవుండు తాను సృజియించిన భువన(భవనం)బులు వీక్షింపందలంచి రాయంచ[111]తే రెక్కి దిక్కులఁ జరించువాడు ముందట. ॥77॥

మహాస్రగ్ధర. అటఁ గాంచెం [112]బద్మగర్భుం డహిమకరఝులీహస్తినక్రాది యాదః-
పటలీధాటీవిహారప్రచలిత మహిభృత్పక్షవిక్షేపలీలా-
[113]చటులోర్మివ్యాప్తఘోషా సముపచితదిశాసౌధవీథీవిటంకా-
వటుసంఘాటాప్రతిశ్రు[114]ద్భయకలితజగద్వ్యా ప్తి లబ్ధిన్ సుధాబ్ధిన్. ॥78॥

లయగ్రాహి. తోయజభవుండు మదిఁ బాయని యహంకరణ-మాయ[115]ను
జగంబు[116]ల కపాయము ఘటింపం
జేయ సమకట్టి ఫణిశాయి నిరుపాధి శుభ-దాయకు సురాసురనికాయమకుటా[117]గ్ర-
స్థాయి కురువిందసముదాయఘృణి[118]కోటివిశ-దాయతపదద్వయుఁ గళాయుతుని శ్రీనా-
రాయణు రమారమణు డాయఁ జని నిద్దురకు రాయిడిగ నెవ్వఁడవురా! యనుచుఁ
బల్కెన్. ॥79॥

క. లేలెమ్మెక్కడివాఁడవు

పాలసముద్రమున భోగిపర్యంకమునం
దేలెద వొక్కండవు [119]నను\ఁ
ద్రైలోక్యాధీశు [120]నెఱుఁగుదా పరమేష్ఠిన్. ||80||

సీ. పాతాళభువనసప్తకము నిర్మించితి | వానితి విశ్వవిశ్వంభరయును
దిక్చక్రవాళ మెత్తితిఁ జక్కఁజేయఁగాఁ | [121]బాఁతుకొల్పితి గోత్రపర్వతముల
వరుసఁ దీర్చితి నేడు శరనిధానములకు | నారు వోసితి నరణ్యములు పెక్కు
గ్రహతారనక్షత్రగతు లేఱుపఱిచితి | సరణు లేర్చితి నభస్వంతమునకుఁ
గీ. గదియఁ గూర్చితి బ్రహ్మాండకర్పరంబు | పరిధిగా [122]వాలిచితి మహావరణజలము
నిట్టి నేఁ జేరవచ్చిన నెదురుకొనవు | పొన్పు డిగ్గవు దురవలేపమున నీవు. ||81||

గీ. ఎవ్వఁడవు చెప్పుమనిన లేనవ్వు నవ్వి
యిందిరావల్లభుఁడు బ్రహ్మ కిట్లు లనియె
నే జగత్కర్తనై యుండ నెట్లు నీవు
కర్తనని పల్కెదవు సిగ్గుగాదె చెపుమ. ||82||

గీ. విని యెఱుంగవె కల్పాంతవేళ నేను
దంభ[123]కోలావతార ముద్ధతి వహించి
సర్వసర్వ(ంసహాతలచక్ర)[124]భరము
దాల్చినాఁడను దంష్ట్రికాదండకోటి. ||83||

శా. ఏలా వచ్చెదు డాయ నెవ్వఁడవు నీ వెచ్చోటికిం బోయె [125]ది-
ట్లేలా మ్రొక్కవు నాకు గర్వమిఁక నెంతే నోర్వ[126]కుందుం జుమీ
త్రైలోక్యాధి[127]పుఁడన్ సురాసురశిరోరత్నప్రభామండలీ-
వ్యాలీఢాంఘ్రిసరోరుహుండ విడు గర్వారంభసంరంభమున్. ||84||

గీ. అని వసుంధర నుద్ధరించిన బలంబు
భువనసర్గం బొనర్చిన పూనికయును
గారణంబులుగాఁగ నాగ్రహము పూని
యచ్యుతుండు నజుండు గర్వాంధులగుచు. ||85||

వ. [128]ఒండొరుల నెఱింగియు నయ్యిద్దఱు మహేశ్వరు *(మాయా) ప్రభావంబున. || 86||

గీ. నన్ను గెల్చికదా నీవు నలిననాభ
యఖిలలోకేశ్వరుఁడ వౌట యనియె బ్రహ్మ
నన్ను గెల్చికదా నీవు నలినగర్భ
యఖిలలోకేశ్వరుఁడ వౌట యనియె శౌరి. ||87||

వ. *(అని యవష్టంభవిజృంభణమున). ||88||

గీ. ఇందిరానాయకుఁడు శార్ఙ్గ మెక్కువెట్టె
గాండివము సజ్యముగఁ జేసెఁ గమలభవుఁడు
శరములిద్దఱుఁ గాలాగ్నిసన్నిభంబు
లేసి రొండొరుపై శౌర్య మెసక మెసఁగ. ||89||

మ. జవ మేపా[129]ర మురారిపద్మజ భుజాచక్రీభవచ్ఛార్ఙ్గ గాం-
డివకోదండవినిర్గత[130]ప్రబలసందీప్తాస్త్రసంఘాతముల్
భువనక్రోడము నిండి భానుకిరణంబుల్ దూఱనీకుండుటం
బవలుం బర్వె మహాంధకారములు పైపై సూచినిర్భేద్యముల్. ‖90‖

గీ. గాండివము తేరిపైఁ బెట్టి కమలభవుఁడు
శార్ఙ్గమున నచ్యుతుం డేయు సాయకములఁ
గర్కశంబైన కుశపూలకమున [131]వ్రేసి
ఖండ[132]ఖండంబులుగఁ జేసెఁ గదనవీథి. ‖91‖

క. వాలిక మెఱుంగుఁ దూపులు
నాళీకాసనుఁడు [133]కినుక నారాయణుపైఁ
గీలుకొనఁజేసి యార్చెను
నాలుగు మోములను [134]ద్రిభువనములు వడంకన్. ‖92‖

వ. ఇవ్విధంబున విధాత [135]యార్చిపేర్చినఁ గోపాటోపంబునం గటకటం బడి కైటభాంతకుండు లలాటవీథీవిటంకంబున భ్రుకుటి నటింపఁ గల్పాంతవేళాసముజ్జ్వలజ్వలనజ్వాలాజాల లీలాక్రీడావహమహాప్రభామండలమధ్యవర్తియు, విబుధరిపువధూవైధవ్యదానదీక్షాధురంధరప్రభా పరాక్రమక్రీడానిర్వక్రపరాక్రమంబగు చక్రం బతని మీఁదఁ బ్రయోగించిన. ‖93‖

మ. దిశలున్ నింగియు నేలయు బహులదీప్తి వ్యాప్తి నంతర్భవిం-
ప శతానందునిమీఁద సాగుటయు నప్పద్మాసనుండేసె బ్ర-
హ్మశిరోనామకమైన యస్త్ర(ము సమస్తాస్త్రా)ధిదైవంబు న-
వ్విశిఖం బుద్ధతి మ్రింగె నద్భుతగతిన్ వేవేగ నాచక్రమున్. ‖94‖

గీ. హరి విధాత[136]పైఁ బాశుపతాస్త్ర మేసె
నజుఁడు హరిమీఁదఁ బాశుపతాస్త్ర మేసె
నమ్మహాస్త్రంబు (లొండొంటి నాక్రమించఁ
జనియెఁ బరిపాటి దివ్యవర్షములు నూరు). ‖95‖

చ. పటుతరవిక్రమస్ఫురణఁ బాశుపతంబులు రెండుఁ బోరఁగాఁ
జిటిలిన విస్ఫులింగములఁ జిల్లులు వోయె నభఃస్థలంబు ది-
క్తటము(లు మండె నంబుధులు గ్రాఁగె రసాతల)గర్భగోళసం-
పుటములు వొక్కె నుమ్మదము పుట్టెఁ జెమర్చెఁ బురాణకూర్మమున్. ‖96‖

ఉ. పాశుపతాస్త్రరాజము లభంగధృతిం దమలోనఁ బోర ఘో-
రాశనిఖండసన్నిభములైన తదీయకృపీటసంభవో-
ల్కాశతముల్ పరస్పరవిఘట్టనఁ జిచ్చఱకోలలై వెసం
గేశవుమేన బ్రహ్మమెయిఁ గేలి యొనర్చె నపారవేదనన్. ‖97‖

ఉ. కాంచనగర్భుఁడున్ నరకఘస్మరుఁడున్ బహుకాల మీ క్రియం
గాంచిరి నొచ్చి పాశుపతకాండయుగప్రభవాగ్నికీలలన్
జంచలచిత్తవృత్తి బహుసంపద పెంపున [137]మూరిఁబోయి ద-
ర్పించినయట్టివారి కివి పెద్దలె యచ్చెరువంద [138]నేటికిన్. ‖98‖

గీ. పాశుపతములు రెండు [139]నీభంగిఁ బోర
నజుఁడు హరియును వారింప నలవిగాక
విస్ఫులింగచ్ఛటావళివేష్టనమున
స్రుక్కుచుండిరి యంగముల్ [140]పొక్కిపడఁగ. ॥99॥

గీ. త్రిభువనంబును భయమందె దేవదైత్య-
ఖచరసిద్ధగంధర్వులు కలఁగఁబడిరి
అస్త్రరాజద్వయంబు సంహారకాల-
దహనుభంగి నేకాంగయుద్ధంబు సేయ. ॥100॥

గీ. అస్త్రయుద్ధము మాన్ప హర్యజులఁ గావఁ-
దలఁచి యర్ధేందుమౌళి యత్యంతకరుణ
నస్త్రములు రెంటినడును నయ్యవసరమున
సంభవించె [141]మహానలస్తంభమూర్తి. ॥101॥

స్రగ్ధర. *స్తంభం బావిర్భవించెన్ జ్వలదనలశిఖాజాలముల్ దిక్కులందున్
జృంభించెన్ భూర్భువస్స్వస్థిరతరజఠరక్షేత్రముల్ చంచదుల్కా-
సంభారోద్యత్స్ఫులింగస్థగితములుగ నాశంక విశ్వంభరుండున్
శంభుండున్ సంభ్రమింపం జటులకరతటిత్సన్నిభస్ఫూర్తిమూర్తిన్. ॥102॥

సీ. సప్తపాతాళ విష్టపము[142]లు భేదించి | ధరణిచక్రంబు బిందం బొనర్చి
భూర్భువస్స్వర్లోకములు సమాస్ఫోటించి | ధ్రువమండలంబుఁ దుత్తుమురు చేసి
పరమేష్ఠిపదవి కుద్భ్రాంతి యాపాదించి | హరిపదంబున కార్తి యావహించి
బ్రహ్మాండకుహరకర్పరము వ్రక్కలు వాపి | యావరణంబు లందంద చించి
గీ. [143]పరగఁ బుష్కరమార్గంబు పాయఁబట్టి | యెగసి యెచ్చోట కేఁగెనో యెఱుఁగరాదు
శాతకుంభాద్రికూటాగ్రసన్నిభంబు | శాంభవంబైన పావకస్తంభ మపుడు. ॥103॥

గీ. పొలుగల [144]యగ్గికంబంబు ప్రభవ[145]మంది
యుష్ణమును శీతమును గాకయుండెఁ గాని
యహహ పెట్లు జగం బుష్ణ మయ్యెనేని
శిశిర మగునేని వణఁకును సీతువట్టి. ॥104॥

సీ. అద్భుతం బందిరి హరియుఁ బద్మభవుండుఁ | దమలోని తీవ్రరోషములు మాని
పుష్కలావర్తకాంభోధరవ్రాతంబు | గురిసెఁ గల్పకలతాకుసుమవృష్టి
జయజయధ్వనులతో సనకాది యోగీంద్రు- | లభినుతించిరి ప్రస్ఫుటాక్షరముల
నమరదుందుభినినాదములు దిక్కుల నిండె | గంభీరతరమహాఘనరవముల
గీ. నడఁగె నస్త్రద్వయంబు నభ్యంతరమున | [146]నగ్గికంబంబులోఁ గాన[147]నయ్యె శివుఁడు
వలిపె తెరలోననున్న భావంబు దోఁప | మాఘకృష్ణచతుర్దశీమధ్యరజని. ॥105॥

గీ. హంసరూపంబు దాల్చెఁ బద్మాసనుండు
దంష్ట్రిరూపంబు గైకొనె దనుజరిపుఁడు
పోయి రంబరమున కధోభువనమునకు
నూర్ధ్వమును గ్రిందుఁ గానంగ నుత్సహించి. ॥106॥

క. బహువర్షసహస్రంబులు
ద్రుహిణుండును హరియు [148]నధ్యధోభువనములన్
బహులక్రియ శోధించిరి
దహనస్తంభంబు తుదయుఁ దన్మూలంబున్. ॥107॥

వ. శోధించి యాద్యంతంబులు పొడగానక హరివిరించు లేతెంచి వామదక్షిణభాగంబుల నిలిచి జగత్కారణంబయిన యమ్మహాదేవు నిట్లని స్తుతియించిరి. ॥108॥

సీ. [149]శర్వ లోకాధీశ చంద్రార్ధశేఖర | పురుష పురాణ శంకర మహేశ
యభవ యంతర్యామివై [150]ప్రేరకత్వము | చేపట్టి జనుల శాసింతు [151]వీవు
భవదీయమాయాప్రభావంబు కతమున | నెఱుఁగలేమైతిమి యేము నిన్ను
మాకుఁ గర్తవు నీవు మాకు భర్తవు నీవు | మాకు హర్తవు నీవు మాటలేల
గీ. నీ మహత్త్వంబు వర్ణింపనేర మేము | నిన్నుఁ దెలియంగనేరము నిజముగాఁగ
నభవ యాద్యుండ [152]వాద్యుండ వగుదుగాన | నట్టి నీ కాచరింతు ముపాస్తి యెపుడు. ॥109॥

గీ. పశువులము [153]మేము హర పశుపతివి నీవు
పశువులకు నెక్కడిది బుద్ధి ఫాలనయన
రాజ శేఖర నేర్పు నేరములు చూడ-
కరసి రక్షింపు మమ్ము నత్యంతకరుణ. ॥110॥

గీ. విష్ణుమూర్తులు [154]కడచన్న వేళలందు
నజునిమూర్తులు [155]కడచన్న యవసరమున
[156]జిష్ణుమూర్తులు పర్యవసించినపుడు
[157]కలదె నీకు నపాయంబు కాలకంఠ. ॥111॥

గీ. అమరవంద్య దివాభీత మనెడి పులుఁగు
హేళిమండల మీక్షింప నెట్లు నేర్చు
నేము [158]నిన్ను బరీక్షింప నెంతవార-
మిమ్మహాపరాధము క్షమియింపవలయు. ॥112॥

వ. అని స్తుతియించినం బ్రసన్నుండై విరూపాక్షుం డాక్షణంబ లింగమధ్యంబున వెడలి యర్ధనారీశ్వరుండును ద్రినేత్రుండును నీలలోహితుండును వరదాభయ[159]మృగధరుండును సర్వాభరణభూషితుండును బ్రమథగణసమన్వితుండును గోటిసూర్య[160]ప్రకాశుండును బాలచంద్రావతంసుండునునై సన్నిధియగుటయుఁ బెన్నిధిఁగన్న పేదల *(విధంబుం) బోలి విరించినారాయణు లిట్లనిరి. ॥113॥

సీ. ఇభచర్మపరిధాన యే భక్తి చేసిన | సంతసంబందు నీ యంతరంగ-
ముడురాజమౌళి యే యుపచారములు నీకుఁ | బ్రియములై యుండు నెంతయును గరిమ
నగరాజకన్యకాప్రాణేశ నీకు నే | కెలనఁ బో సర్వాంగకృప జనించుఁ
గ్రతువైరి నీకు నే వ్రతముఖ్య మొనరింపఁ | గౌతుకోన్మేషంబు గలిగియుండు
గీ. నంధకాసురదమన నీ కభిమతంబు | లే యనుష్ఠానములు శర్వ యే మఖంబు
లాచరించిన [161]నీ వారమగుదు మట్టు- | లభవ దాక్షిణ్యపరత మా కానతిమ్ము. ॥

114||

వ. అనినఁ [162]బ్రీతచేతస్కుండై *(శివుండు) విశ్వంభరాంభోరుహసంభవుల కిట్లనియె. ||115||

మ. అవధానంబున నాకు [163]సత్ప్రియము సేయన్ సర్వదా మీకు [164]స-
ద్వ్యవసాయం బొడఁగూడెనేని వినుఁడా యంభోజదృగ్భారతీ-
ధవులారా విని యాచరింపుఁడు మదిం దాత్పర్య మొప్పంగ శ్రీ-
శివరాత్రివ్రత మస్మదీయ మది దాక్షిణ్యంబునం జెప్పితిన్. ||116||

వ. బ్రాహ్మముహూర్తంబునందు మేల్కని శౌచక్రియలు నడపి గురున కభివాదనంబు సేసి సంకల్పంబు నడపి పూజోపకరణద్రవ్యంబులు సమకూర్చుకొని [165]నదీస్నానం బొనర్చి నిత్యనైమిత్తకాద్యనుష్ఠానంబులు దీర్చి [166]యలంకృతుఁడయి [167]యజనస్థానంబును సమ్మార్జనలేపనాదుల శోధించి వితానధ్వజంబు లెత్తించి [168]పతాకావలులు *(గట్టి) తోరణంబులు [169]సంఘటించి (కదలీఫల పూగఫల పనసఫల నారికేళంబులు తోరణంబులుగాఁ గట్టి) దేవాలయంబు ప్రవేశించి మౌనియై భసితత్రిపుండ్రంబును భస్మోద్ధూళనంబును గావించి రుద్రాక్షమాలికలు ధరియించి శివభక్తుల రావించి గురూపదేశమార్గంబున [170]నాసనంబుఁ బాద్యం బర్ఘ్యంబు [171]మధుపర్కంబు నిచ్చి [172]పంచవదనంబులుఁ బంచామృతంబుల నభిషేకించి ఫలోదక పుష్పోదక గంధోదక కుంకుమోదక రత్నోదక కర్పూరోదకంబుల నభిషేకించి వస్త్రం బుపవీతం బాచమనంబు గంధంబు భూషణంబు పుష్పంబు ఫలాహారంబు నీరాజనంబు ధూపంబు వ్యజనంబు వాదిత్రంబు దర్పణంబు స్తోత్రంబు మొదలుగాఁ గల [173]షోడశోపచారంబుల నుపచరించి నాలుగుజాములును జాగరంబు సేయునది. (ఇది శివరాత్రి) వ్రతచర్యప్రకారంబు. ||117||

గీ. బ్రహ్మహత్యాయుతము సురాపానశతము
వీరహత్య గోహత్యలు వేనవేలు
శిశువధంబు [174]జనంగమ [175]స్త్రీనిషేవ-
మాదియగు పాపములఁ [176]దోలు నభవురాత్రి. ||118||

వ. తొల్లి యొక్క బ్రాహ్మణుండు మహా[177]పాపంబులు సేసి (సర్వజనంబులచేత నిందితుడై యొక్క) శివరాత్రి[178]వ్రతదర్శనంబున శివపురంబునకుం జనియె ననిన శౌనకాదు లక్కథకున కిట్లనిరి. ||119||

గీ. అద్భుతం [179]బయ్యెడిని మాకు నగ్రజన్ముఁ
డెట్టు పాతకములు సేయు టెట్టు [180]లట్టి
పాపి శివరాత్రివ్రత మెట్టు పరఁగఁ జూచె
నంతయును విస్తరింపుమా [181]యనినఁ బ్రీతి. ||120||

శా. జీమూతాన్వయరాజధైర్య సుమహాక్షీరాబ్ధిగాంభీర్య [182]సు-
త్రామప్రోద్భవగాఢశౌర్య సుమనోధన్వాతిసౌందర్య పౌ-
లోమీనాయకతుల్యభోగయుత [183]సుశ్లోకద్రుజిత్త్యాగ భా-
షామాధుర్య మతిప్రకాశధిషణా సత్యార్థసంభాషణా. ||121||

క. నిత్యయశశ్శ్రీసుందర-
మత్యమరాచార్యవర్య మాన్యచరిత్రా

భృత్యజనావనతత్పర
సత్యహరిశ్చంద్ర సరససాహిత్యనిధీ. ॥122॥

మాలిని. అమితహితసుభాషా స్వాంతవిద్యావిశేషా
సమరముఖదిలీపా చంద్రకందర్పరూపా
కమలనయ[న]వీర్యా కాంచనాహార్యధైర్యా
విమలరుచిరకీర్తీ విశ్రుతానందమూర్తీ. ॥123॥

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర సకలవిద్యాసనాథ శ్రీనాథనామధేయ ప్రణీతంబయిన శివరాత్రి మాహాత్మ్యంబునందుఁ బ్రథమాశ్వాసము.



[1] ము. వాశ్రి.
[2] తా. సంస్తవ్యుండు.
[3] ము. చేసియున్.
[4] తా. వర.
[5] ము. నిచ్చె.
[6] ము. సుఖస్థితి యిచ్చుఁ గావుతన్.
[7] ము. బంధానుబంధ వి.
[8] ము. యాంధ్ర.
[9] ము. డెట్టిన.
[10] ము. గిదె.
[11] తా. గలుగుటయె.
[12] తా. సంఘాతక.
[13] తాళపత్రమున లేదు.
[14] తా. ప్రేరణ ప్రేక్ష్యకంబులైన.
[15] ము. కరుణాబంధుర.
[16] ము. గంధర్వసంగర.
[17] తా. బ్రొద్దుపుచ్చుచు.
[18] ము. పువ్వలపు.
[19] ము. వరుణా... ... ... లోష్ఠ.
[20] తా. భూనాథు.
[21] ము. సేనమ.
[22] ము. పరుఁడు.
[23] ము. ఖ్యాతిగఁ జరితప్రతాప.
[24] ము. చేవూరి.

[25] ము. జెరువాడు.
[26] తా. భుజంగమర్లావ.
[27] ము. వర్ణిత.
[28] ము. పరగ.
[29] తా. పరిణజనకదంబ.
[30] తా. నిభుఁడనా.
[31] తా. చిట్టి.
[32] తా. రిచ్యయనక్రియాలీలల నిద్ధాత్రి.
[33] తా. వర్ణనంబునకు.
[34] తా. నాతియు.
[35] ము. సతులు.
[36] తా. నాఁగ.
[37] ము. సారసాఖ్య.
[38] ము. మానసాత్మ.
[39] తా. యమరం.
[40] ము. మట్టుర.
[41] తా. సెట్టియ.
[42] తా. డర్థిన్.
[43] తా. దేవాధీశ.
[44] ము. ప్రమేయక.
[45] తా. శ్రుతుల.
[46] తా. రూపునందు.
[47] తా. భక్త.
[48] ము. పీతాంబరు.
[49] తా. సమ్మదు.
[50] తా. సరళకులాభిరామ.
[51] తా. యననొప్పు.
[52] ము. కామితార్థక.
[53] తా. సానికిన్.
[54] తా. మూర్తి.
[55] ము. ఁబర.
[56] ము. వా.
[57] తా. కుత్క్యూట.
[58] తా. నగు సంతోష.
[59] తా. యందంబుగ.
[60] ము. కథావిధానంబున.
[61] ము. లీల.
[62] తా. సోమావృత.

[63] తా. వ్రతాశశైవో.
[64] తా. ధర.
[65] ము. వర.
[66] తా. సర్వాగమానిర్ముక్తంబై.
[67] తా. సంస్థితాత్ములు.
[68] తా. రత్నాకరంబందు.
[69] సత్కృత.
[70] ము. నేగుదెంచితి.
[71] తా. బృహద్వర్ణనార్థంబు.
[72] తాళపత్రమున నీ పురాణముల పేరులు ముందువెనుకలుగా నున్నవి.
[73] ము. నాల్గు లక్షల.
[74] ము. దోషాపహృతిక్రమంబు.
[75] ము. మార్గమును.
[76] తా. తుదిం.
[77] తా. పరమమగు స్వర్గమునకు.
[78] ము. గాఁగఁ.
[79] ము. వీఁచు.
[80] తా. సమున్మూలాంజనము బొంది.
[81] తా. రింఖో.
[82] ము. చింతనొంది.
[83] ము. సృజింప.
[84] తా. యకొ.
[85] ము. నొందఁగా.
[86] తా. క్రియావంతవ్యని కంతర్వ్యథ.
[87] ము. కటాహము సముద్ఘాటింప. తా. కటాహమున సంధానింప.
[88] ము. క్రోడావతారుఁడై.
[89] తా. నీరవండుస్వరంబున.
[90] ము. కనుప.
[91] తా. రాయి.
[92] తా. నెరయ.
[93] ము. ప్రళయాంతకాలంబు.
[94] తా. నై.
[95] ము. తా. సుట్టును.
[96] తా. రు.
[97] తా. శ్వేత.
[98] ము. ఁదీర్చి.
[99] తా. నుద్ధరించి.
[100] తా. నై.

[101] ము. నైతి.
[102] తా. హృద్యద్వారి.
[103] ము. క్రోడావతారుఁడై. తా. కోలావతారుఁడై.
[104] ము. యెత్తి, సాగె.
[105] తా. సృజించె.
[106] తా. మహత్సర్గంబు నాను.
[107] ము. నేడును.
[108] తా. నిప్పు.
[109] తా. గాన.
[110] తా. శివ.
[111] తా. నెక్కి.
[112] తా. కంజ.
[113] తా. చటులోర్మివ్యాపి.
[114] తా. ద్వ్యతికలిత.
[115] తా. తి.
[116] తా. న.
[117] తా. గ్రా.
[118] తా. జాలనికటాయిత.
[119] తా. నన్.
[120] ము. నెఱుఁగురా.
[121] ము. పాదుకొల్పితి.
[122] ము. వాల్చితిని.
[123] ము. క్రోడా.
[124] ము. సరణి.
[125] ము. దీవేలా.
[126] తా. కుండం జుమీ.
[127] తా. పతిన్.
[128] ము. ఒండొరు నెఱింగిన యయ్యిద్దరు.
[129] ము. రి.
[130] ప్రభల.
[131] తా. నేసి.
[132] ము. ఖండములుగ.
[133] తా. గిన్క.
[134] ము. త్రిభువనము వణఁకాడన్.
[135] తా. యార్చినం బేర్చిన.
[136] తా. మై.
[137] ము. మూరివోయి.
[138] తా. వారికిన్.

[139] తా. నిబ్బంగి.
[140] ము. సొక్కి.
[141] ము. మహాస్తంభ శంభుమూర్తి.
[142] తా. లుద్భేదించి.
[143] తా. పరమ పుష్కరమార్గంబు పాయఁదట్టి.
[144] తా. యట్టి.
[145] తా. మందె.
[146] తా. నగ్నికంభంబు.
[147] తా. బడియె.
[148] తా. దివియధో.
[149] తా. సర్వ.
[150] తా. ప్రేరకత్వంబు.
[151] తా. వీవ.
[152] తా. వైతివీ.
[153] తా. నేము.
[154] తా. గడసన్న.
[155] తా. గడసన్న.
[156] ము. విశ్వమూర్తులు విబుధులు వెడలునపుడు.
[157] ము. కలదు నీ కనపాయంబు.
[158] ము. నిను వినుతింపఁగ.
[159] ము. మృగాంకధరుండును.
[160] తా. ప్రతీకాశుండును.
[161] ము. నీ వారమగుట యట్లు.
[162] తా. బ్రచేతస్కుండై.
[163] ము. సంశ్రయము.
[164] ము. నధ్యవసాయం.
[165] ము. నదీస్నానంబు వొనర్చి.
[166] తా. యలంకృతులై.
[167] తా. అజనస్నానంబున.
[168] తా. ఫలావలులు.
[169] తా. గాఁగట్టి.
[170] తా. నాసనార్ఘ్యపాద్యంబుల.
[171] తా. మధుపర్కంబిచ్చి.
[172] తా. పంచవదను.
[173] తా. యశేషోపచారంబుల.
[174] తా. ను జంగము.
[175] ము. శ్రీవినాశ. తా. స్త్రీనిషేధ.
[176] తా. బొల్చు.

[177] తా. పాతకంబులు.
[178] తా. వ్రతం బాచరించి.
[179] తా. బది నీవు మాకు.
[180] తా. లిట్టిపాటి.
[181] తా. కనిన.
[182] తా. సు-త్రామాత్మోద్భవ.
[183] తా. సుశ్లోకచ్ఛటాభూష. ము. సుశ్లోకారిజిత్త్యాగ.

# ద్వితీయాశ్వాసము



హిమవద్గిరిపుత్త్రీమ-
నోహరపదభక్తిజాతనూతనసరస-
వ్యాహారకావ్యనాయక
మోహనతనుజితజయంత ముమ్మయశాంతా. ||1||

వ. అక్కథకుండు శౌనకాది మహామునుల కిట్లని చెప్పందొణంగె. ||2||

సీ. కాంచనాచలముతో గర్వించి యే కొండ | [1]పెరిఁగె బ్రహ్మాండకర్పరము మోవ
నే కొండచఱులపై హిమశైలకన్యక | చెంచులేమలఁ గూడి సంచరించు
వజ్రాల కమరు లేవ విడంబనము సేయు | నే కొండమొలచుట్టు నిందుతనయ
యల్లోనేరెడుదీవి యవనీధ్రములలోన | నే కొండ కైశ్వర్య మెక్కుడయ్యె
గీ. నట్టి వింధ్యనగేంద్రపర్యంతభూమి | దండకారణ్యవిపినమధ్యంబునందు
రత్నపురమనఁ గల దొక రాజధాని | కిన్నరాధీశు నగరకిఁ గీస వెలితి. ||3||

గీ. స్ఫటికమాణిక్యపాషాణఘటితమైన
యప్పురముకోట యాకాశ మంటి యొప్పు
వేడ్కఁ బాతాళభువనంబు వెడలివచ్చి
[2]చుట్టుముట్టినయట్టి వాసుకియుఁ బోలె. ||4||

గీ. [3]పట్టణంబున దేవతాభవనకోటి
తుహినగిరికూటములతోడఁ దులలుతూఁగు
నమరగంగాపయఃప్రవాహములఁ బోలుఁ
దచ్ఛిరస్థాపితోన్నతధ్వజపటములు. ||5||

సీ. [4]ప్రణతదేవకిరీటమణిమయూఖచ్ఛటా- | పటలకిమ్మీరాంఘ్రిపంకజుండు
వికటపాటలజటామకుటకోటిఘటిత- | కోమల[5]తారకాకాముకుండు
గంధదంతావళక్రవ్యాదరాట్కృత్తి- | కంధాధురంధరకంధరుండు
కుంభినీధరసుతాకుచకుంభమృగమద- | స్థాసకస్థగితవక్షస్థలుండు
గీ. శంభుఁ డోంకారనాథుండు శాశ్వతుండు | పాయకయ యుండు నవ్వీటి పరిసరమున
నర్మదా సింధుతీర కాంతారభూమి | మఱ్ఱి యను పేరి కల్పద్రుమంబు [6]నీడ. ||6||

వ. అప్పట్టణంబునకుం జుట్టును జనపదంబు [7]లైరావతీశతద్రూ విపాశాసింధునదీమాతృకంబులును,
విశ్వవిశ్వంభరాభ్రూలతానుకారిసేతురేఖాలంకారంబులును,

దటాకతరుకుసుమకేసరక్షర దమందమకరందధారాధోరణీసహస్ర[8]సంవర్ధితకుల్యా సలిలకల్లోలమాలికా[9]స్ఫుటస్ఫాయత్కాయమాన నానావిధోద్యానవాటికాసంఘటితాకాలకాలాంధకారంబులును, నారామచూతపోతనికరసుకుమార కిసలయాస్వాదకషాయకంఠ కలకంఠకామినీ కోమలకుహూకార కోలాహలాంకురిత పంచమరాగరాజంబులును, రాజాన్నకలమషాష్టిక పతంగ[10]ప్రియ నానావ్రీహిసస్య[11]ప్రశస్తంబులును, బ్రవర్ధమానవనంబులును, [12]నిబిడిత సారసికంబులును, గుళుత్థాభ్యుత్థానంబులును, సముద్గతముద్గసామగ్రీసంగ్రహంబులును, [13]అణుకచణకచణంబులును, సిద్ధార్థ [14]శ్యామాక గోధూమ [15]గర్ముత్తిలజర్తిలంబులును, అదూషిత [16]మాషకోరదూషితకోన్మేషంబులును, [17]కుసుంభకుసుమగుచ్ఛచ్ఛాయాచ్ఛటా[18]భ్యంగణ శోణభంగోమాణుశృంగారిత జాంగలక్షేత్రంబులునునై దాశరథి[19]చరిత్రంబునుం బోలె సీతావృత్తి[20]సరళంబును, జంద్రోదయంబునుం బోలెఁ గరసహస్రసంవర్ధిత[21]రత్నాలయంబును, యదువంశంబునుం బోలెఁ గులక్రమాగత శూరపురుషోత్తమ బలాభిపాలితంబునునై యుండు వెండియు. ||7||

మ. పరలోకస్థు [22]బతిన్ ఝుషాంకు బ్రతికింపంగోరి యోంకారశం-
కరు మ్రోలన్ రతి [23]ముక్తకంఠముగ నాక్రందించునా [24]నొప్పు న-
ప్పురబాహ్యోపవనాంతదీర్ఘికల (రేపున్ మాపు వీతెంచు) పు-
ష్కరకింజల్కభుజిక్రియాసుఖితహంసక్రేంక్రియారావముల్. ||8||

మ. ధరణీచక్రమువోలె నప్పురము విస్తారంబు నాయామముం
బరికింపంగ నశక్యమైన గరిమం బాథోధిగంభీరతం
బరిఖామండల మంబురాశి నుపమింపం బాత్రమై యొప్పు నం-
బరకల్లోలలుఠత్తిమింగిలఝులీమత్స్యాహినక్రోద్ధతిన్. ||9||

గీ. భద్రజాతి యేనుంగు లప్పట్టణమునఁ
బ్రకటితస్ఫూర్తి నొప్పు సిబ్బములతోడ
విమలవారాశిఫేనఖండములతోడి
కవ్వపుంగొండబందులో కాక యనఁగ. ||10||

ఉ. లక్షలసంఖ్య లప్పురి కెలంకులయందుఁ గొలంకు లొప్పు వాః-
పక్షిగరుచ్ఛటాపవనపాతవికంపితపంకజంబులై
[25]వీక్షణకౌతుకంబు ప్రభవింపుచునుండును లీలమై సహ-
స్రాక్షుఁడు విశ్వరూపమహిమాద్భుతముం బ్రకటించెనో యనన్. ||11||

శా. ఆ వింధ్యాచలదుర్గ [26]మేలు శబరాధ్యక్షుండు హేమాంగదుం
డా వార్ధిద్వితయద్వయావధిగఁ జక్రాధీశ్వరుల్ గొల్వ నా-
శావేదండఘటాకపోలతలమూర్ఛద్దానధారాజల-
ప్లావప్రక్రమసంవిశుద్ధబహులప్రస్ఫూర్తిమత్కీర్తియై. ||12||

సీ. శివుని కైవడి [27]మహాసేనానుయాతుండు | బలభేది పగిది [28]నపవ్యపాయుఁ
డరవిందహితు లీల [29]నధిగతాభ్యుదయుండు | [30]బుధుని క్రియ నజహత్పుష్కరుండు
గంగాప్రవాహంబు కరణిఁ బావనమూర్తి | భుజగాధిపుని భంగి భోగశాలి

యేనుంగు చందాన దానధారాశోభి | శౌరి లాగున శంఖచక్రపాణి
గీ. కర్త యాశ్చర్యములకు నాకరము నీతి- | కఖిలవిద్యాగమములకు నాస్పదంబు
పగఱ కుత్పాతకేతువు బంధుకోటి- | కమరలోకద్రుమంబు హేమాంగదుండు. ||13||

గీ. ఆ నృపాలుండు నీతివిద్యానిరూఢిఁ
జారదృష్టియౌఁ గాని విచారదృష్టి
సమధికైశ్వర్యవైభవోజ్జ్వలత నాతఁ
డష్టమూర్తియౌఁ గాని యనష్టమూర్తి. ||14||

## యజ్ఞదత్త చరిత్రము

వ. ఆ రాజునకు నఖిలశాస్త్రవిద్యాకళా[31]పావనగంభీరబుద్ధి యజ్ఞదత్తుండను బ్రాహ్మణుండు దేవేంద్రునకు బృహస్పతియును వృషపర్వునకు శుక్రుండును దశరథునకు వసిష్ఠుండును రామునకు విశ్వామిత్రుండును నజాతశత్రునకు ధౌమ్యుండును [32]నలునకు సుమతియుం బోలెఁ బ్రధానియై రాజ్యభారంబు భరియించియుండు నమ్మంత్రి భార్య వినయవతియు వివేకవతియు విభ్రమవతియు విలాసవతియు సౌభాగ్యవతియు లక్షణవతియు నౌదార్యవతియు గాంభీర్యవతియు లజ్జావతియునై సర్వగుణసంపూర్ణ సుశీలాభిధానయగు [33]భామారత్నం బతనికిఁ [34]బ్రేమాస్పదంబై యుండు. ||15||

గీ. అన్ని భాగ్యంబు [35]లున్న నా యజ్ఞముఖికి
శ్రీమహాలక్ష్మి గలుగఁగ నేమి సెలవు
పుత్రవచనావలోకనోద్భూతమైన
యొక్క సౌఖ్యంబు బ్రాఁతియై యుండుఁ గాన. ||16||

గీ. [36]తనయసంతానలబ్ధి దౌదవ్వుగాఁగ
విభవసంపత్తి గల్గియు విన్నఁబోయి
వనిత నిష్ఫలపుష్పదర్శనముఁ [37]దాల్చె
శరలతాకాననము వోలె జవ్వనంబు. ||17||

సీ. కాంత పుష్పాది బోగంబు [38]లింపనివను | వైరాగ్యవిధికిఁ దా వాల్చుఁ జిత్త-
మన్వయంబునకుఁ దా నాలంబమయ్యును | దను నిరాలంబఁగా దలఁచు నింతి
ప్రొద్దునఁ [39]దగినట్టి భోజనం బొల్లక | యుపవాస [40]నియమంబు నువిద దలఁచు
సంపత్పరంపర సంభవిల్లిననైన | సంతోష మొదవదు చామ [41]మదికిఁ
గీ. గోమలాంగుళదళహస్తతామరసము | కర్ణపూరత్వలీలకై కాలుసాఁప
గండతలదర్పణంబునఁ గదియఁ జేర్చి | [42]తరుణి చింతించు [43]సుతులబ్ధి తడయుటకును. ||18||

ఉ. సంతతి లేని దుఃఖమున సామజరాజఘటాంతవైభవం-
బెంతయుఁ గల్గియున్ సరసిజేక్షణ [44]విన్నఁగఁబోయియుండు సీ-
మంతిని బోటికత్తెలకు మానసవృత్తి యెఱుంగఁ జెప్ప కై-
[45]కాంతికకేళిశయ్యపయిఁ గాంత గుణించు మనోరథార్థముల్. ||19||

ఉ. [46]ఆ చపలాయతాక్షి కనకాంబురుహంబులఁ [47]బూజ సేయు విం-
ధ్యాచలకందరానిలయు నద్రిసుతాప్రియనాథు నర్మదా-

వీచిపరంపరాసలిలవిప్రుషదాశ్రయశీతగంధవా-
హాచమనప్రవృద్ధభుజగాధిపకంకణు నోంకృతీశ్వరున్. ||20||

సీ. అభిషేక మొనరించు నలినీలకుంతల | శంభు సోమోద్భ[48]వాసలిలధార
నెలఁత యభ్యర్చించు నీలోత్పలంబులఁ | దరుణనిర్మలసుధాధామమౌళి
గరళకూటగ్రాసకల్మాషకంధరు | మేన గంధ మలందు మీన[048]నేత్ర
యర్పించు దివ్యోపహారంబు లెలనాఁగ | కుటిల[49]కుండలిరాజకుండలునకు
గీ. నతివ దిరుగుఁ బ్రదక్షిణం బభవు [50]గుడికి | గుచభరంబున నరగౌను [51]గూనుగిలఁగ
[52]రవలిమట్టెల మ్రోతతో రాయిడింపఁ | జరణనూపురఝుళఝుళంఝుళరవంబు. ||21||

వ. ఒక్కనాఁ డోంకారనాథునకుఁ బ్రదక్షిణం బాచరిం[53]చుచు నప్పద్మాక్షి ప్రాకారపురఃప్రఘాణంబున నొక్క పౌరాణికుండు శ్రీమహాభారతంబు వక్కాణించు వాఁ[54]డపుత్రకులకుఁ బుణ్యలోకంబు లేదని కథానుకథనప్రసంగంబునం బలికిన నయ్యింతి సంతానవిరహవేదనాదూయమానమానసయై మందిరంబున కేతెంచి యేకాంతభవనంబున [55]విహారశయ్యపై మేనువైచి చింతాక్రాంతయై యుండె నంత యజ్ఞదత్తుం డమ్మత్తకాశిని నన్వేషించి. ||22||

ఉ. కాంత సరోజనాళలతికాతనుపాండుశరీరయష్టి నే-
కాంతగృహాంతరస్థితఁ బ్రియాంగనఁ జేరఁగవచ్చె మంత్రి క-
ల్పాంతమునన్ రసాతలగుహాకుహరంబున [56]డాఁగియున్న భూ-
కాంత వరాహమూర్తి హరి గ్రచ్చుఱ డాయఁగవచ్చు కైవడిన్. ||23||

వ. డాయవచ్చినఁ గృతప్రత్యుత్థానయగు నప్పంకజాక్షియుఁ దానునుం పర్యంకంబునఁ గూర్చుండి యవిరళాశ్రుపాతార్ద్రీకృతదుకూలయు ననలంకృతయునైన సుశీలం జూచి యజ్ఞదత్తుం డిట్లనియె. ||24||

గీ. ఏల యేడ్చెదు చెప్పవే యిందువదన
విపులశోకభరంబున వెక్కివెక్కి
త్రాట గ్రుచ్చిన [57]క్రొత్తముత్యాలవోలెఁ
[58]జన్నుఁగవ నున్న వీ బాష్పజలకణములు. ||25||

సీ. కుదురునిండిన మంచి గుబ్బచన్నుల మీఁద | ధరియింపవేల ముత్యాలపేరు
ఫాలేందురేఖపైఁ బచరింప విది యేల | కుంకుమంబున బొట్టు గోరఁ దీర్చి
[59]యానబంధోద్ధురంబగు నితంబంబున | నవరింపవేల వజ్రాల [60]కమరు
పాయవట్టములతోఁ బసిఁడి నూపురములు | హత్తింపవేల పాదాంబుజములఁ
గీ. [61]బంచవన్నియరాచిల్కఁ బంజరమున | నేల నదివింప [62]వనురాగ మెసకమెసఁగ
నేల చింతించెదవు [63]చెప్పు మిందువదన | గండపాళికఁ గెంగేలు గదియఁజేర్చి. ||26||

గీ. నెలఁత నులివేఁడియైన నీ నిడుదయూర్పు
మాటిమాటికి నిపుడు నా మానసంబు
గంపమొందించుచున్నది కల్లగాదు

ప్రబల భవదీయ వక్షో[64]భవంబుఁ బోలె. ||27||

క. అపరాధము సేయఁ గదా
చపలాయత[65]నేత్ర! [66]యేను జనవున[67]నేనిన్
నిపుణతతోఁ జింతించిన
నెప మేమియుఁ గానరాదు నీ నెగులునకున్. ||28||

క. భవదాయత్తము విభవము
భవదాయత్తంబు సువ్వె ప్రాణము నాకున్
భవదాయత్తము సర్వము
ధవళాంబుజపత్ర[68]నేత్ర తథ్యం బరయన్. ||29||

వ. ఈ దుఃఖంబునకుం గారణం [69]బేమి చెప్పుమని [70]యడుగుటయుం బ్రత్యుత్తరం బీక యూరకున్న దాని తాంబూలకరండవాహిని మంత్రితో నిట్లను దేవ దైవంబు కరుణలేమి జేసి, పెద్దకాలం బిమ్మహాదేవి సంతానలాభంబు దూరంబగుట కారణంబుగా శయనాసన[71]పానభోజనవిభూషణపరిధానాది సముచితవ్యాపారంబులు పరిజనప్రయత్నంబున *(బ్రతిదినంబు) నెట్టకేల[72]కు నిర్వర్తించుచు దేవరకు హృదయ[73]వేదన గావింపనో[74]క యనవరతంబుఁ దోఁపకుండఁ
జరియించుచున్నయది [75]నిన్నటి రేపు తపనమండలంబు కుపిత *(కపికపోల) క్రోడతామ్రంబై యుదయగిరికవాటవిటంకంబు [76]నలంకరింప వింధ్యాచలనితంబబింబంబునకు మణిమేఖలాకలాపంబునుం బోలిన నర్మదాప్రవాహంబునం గ్రుంకి యోంకారేశ్వరు శశాంకరేఖాలంకారు హేమపంకజంబులం బూజించి గుడికి బ్రదక్షిణంబు నేయునది దేవభవనప్రాకారగోపుర ప్రఘాణంబునం బౌరాణికుండు మహాభారతంబు వక్కాణింపుచుం [77]గథానుకథనప్రసంగంబున నపుత్రకులకుఁ బుణ్యలోకంబులు లేవని పలికిన నప్పలుకులు నెమ్మనంబునం గీలుకొని వాలంప [78]ములుకులుం బోలె వేదన యుత్పాదింప భవనంబునకు వచ్చి [79]యేకాంతంబ యిచ్చోట నవిరళబాష్పధారాదుర్దినాంధ[80]కారితముఖియై యీ దుర్దశం బొందియున్నయది *(యనుటయు). ||30||

ఆ.వె. మంత్రి యొక ముహూర్త మాత్రంబు చింతించి
యుష్ణదీర్ఘమైన యూర్పు నిగుడ
[81]నెంత చింత దీనికిది మహాబలవంత
మేమి సేయవచ్చు నిందువదన. ||31||

ఉ. ఊరక [82]కుందనేమిటికి నోంకృతినాథుఁడు నర్మదానదీ-
తీరనివాసి భక్తజనదివ్యమహీరుహ [83]మున్నవాఁడు నీ-
రేరుహనేత్ర తత్పదపరీష్టి యభీష్టశుభాభివృద్ధికిం
గారణమౌ టెఱుంగవె వికారము దక్కు భజింపు శంకరున్. ||32||

గీ. ఈశ్వరుం డద్రిజానాథుఁ డిందుమౌళి
కరుణ [84]లేకున్న మనకెట్లు కలుగనేర్చుఁ
జంద్రచందనచంద్రికాశైత్యమైన
పుత్రపరిరంభసౌఖ్యంబు పువ్వుఁబోణి. ||33||

గీ. గురుజనంబుల [85]సేవింపు కువలయాక్షి
[86]కమలలోచన ముక్కంటి కరుణఁ జేసి
[87]మున్ను గురు నుపదేశంబు మొనయఁ గాంచి-
రభిమతార్థంబు లెందఱే [88]ననుదినంబు. ॥34॥

వ. సర్వజగత్ప్రసిద్ధంబుగదా యితిహాసంబు తొల్లి చండకౌశికు వరప్రసాదంబున మగధాధిపతియగు [89]బృహద్రథుండు జనార్దను గెలువం దగినట్టి శౌర్యనిధి జరాసంధుం గాంచె; దశరథుండు విభాండక తనయుం(డగు ఋశ్యశృంగు) నారాధించి దిగ్గజంబులం బోలిన కుమారుల *(సకలలోకహితంబుగా) నలుగురం [90]బడసె సమారాధిత గురుదేవతాప్రసాద*(వశ)ంబున. ॥35॥

గీ. వెలఁది పుత్రోదయారంభవేళయందు
నిన్ను నెన్నఁడు చూతునో కన్నులార
విమలచంద్రోదయారంభవేళయందుఁ
బూర్ణిమా[91]యామినినిఁ బోలెఁ బుణ్యగరిమ. ॥36॥

వ. దేవీ శోకంబు విడువుము ధైర్యం బవలంబింపుము ధర్మంబు నడువుము దానంబు సేయుము [92]వ్రతంబులు సలుపుము సత్యంబు పలుకుము; మన పాలి దేవతలు మన కభీష్టలాభంబుఁ బొందింపఁగలవారు; భవ్యసంతాన లాభంబున సంతోషంబు వహింపం గలవవి [93]దుఃఖాపనోదననిపుణంబులు ధర్మోపదేశ[94]గర్భంబులు [95]చాటుమధురంబులు నగు మాటల
నూరార్చి, కాంచనకలశోదకంబులు కరపల్లవంబున ధరియించి [96]నయనంబులు దుడిచి యగ్గజయానకు ముఖప్రక్షాళనం బాచరించి, మందీభూతదుఖయగుట యెఱింగి మంత్రి యంతఃపురంబు వెడలి సముచితవ్యాపారంబులం బ్రవర్తిల్లె నది యాదిగ [97]నాగమోక్తప్రకారంబున సభక్తివినయతాత్పర్యంబున. ॥37॥

ఉ. ఆ ధవళాయతాక్షి వసుధామరకోటి భజించు దేవతా-
రాధన మాచరించు మునిరాజి కుపాస్తి యొకర్చు [98]మంత్ర వి-
ద్యాధరులన్ నుతించుఁ గొనియాడును యోగిజనంబు వర్ధమా-
నాధికభక్తిభావమున నాత్మజసంతతిలబ్ధికామనన్. ॥38॥

గీ. ఎఱుఁగునే నీడకన్నును నెండకన్నుఁ
[99]జెలఁగి పూఁచునే కర్మవంచిన లతాంగి
యెట్టి క్లేశంబులకునైన [100]నీడఁబోదు
తన మనంబున [101]నిగ్రుచు సంతానకాంక్ష. ॥39॥

సీ. భక్తితో మాతృకాభవనంబుఁకు నేఁగుఁ | గావించు [102]నతి దిశాదేవతలకు
వాయసంబులకు నిర్వర్తించు దధిబలిఁ | గొలుచు జ్యేష్ఠాదేవి నలఘుమహిమఁ
జదివించుకొనుఁ బుణ్యసంహితావ్రాతంబు | మూలికామాణిక్యములు ధరించుఁ
[103]దాంబూలగంధాక్షతలు చిరంటుల కిడు | [104]విప్రశ్నికల గారవించుఁ దఱచుఁ
గీ. గుమ్మరావంబు కడవలు కొల్లవిడుచు | బాలురకుఁ దియ్యపండులు పంచి యిచ్చుఁ
జెలులుఁ దానునుఁ [105]రేలు పోఁచిళ్ళువోవుఁ | దామరస[106]నేత్ర పుత్రసంతానకాంక్ష. ॥40॥

వ. ఇవ్విధంబునఁ [107]బుణ్యోపవాసవ్రతదానధర్మదేవతారాధనంబు[108]లఁ

బ్రతిబంధదోషంబులుం బాసిన [109]నా సుశీలాదేవియందుం బ్రతిమాచంద్రబింబంబు సరసియందునుం బోలె గర్భం బావిర్భవించిన. ॥41॥

సీ. అభ్యంతరస్థాగ్నియగు శమీలత వోలె | నిధిగర్భయగు నబ్ధి[110]నేమి వోలె
[111]నంతస్స్థదిగ్దంతియగు వియన్నది వోలె | శశికుక్షియగు నస్తసంధ్య వోలె
నాలీనహర్యక్షయగు నద్రిగుహ వోలె | వినయధారిణి యగు [112]విద్య వోలె
[113]జలదాంతరితయగు నళినాప్తరుచి వోలె | సూనృతాభిధయగు సూక్తి వోలె
గీ. నాదిమబ్రహ్మసంభరితోదరయగు | కైటభారాతినాభ్యబ్జ[114]కళిక వోలె
నధిగతాగస్త్యయగు దక్షిణాశ వోలెఁ | బ్రథమగర్భంబు ధరియించెఁ బల్లవోష్ఠి. ॥42॥

గీ. [115]పలుచఁ బాఱెను గండదర్పణయుగంబు
నవమధూకప్రసూనంబు [116]నవమధుకర
[117]మానుగతిఁ జూచుకంబులు నసితమయ్యె
సవతి పూఁబోండ్ల యాననాబ్జములతోడ. ॥43॥

చ. మనమున కుత్సవం బొసఁగె మంత్రికిఁ [118]బట్టపుదేవి గర్భశో-
భనమునఁ [119]జేసి వెల్వెలఁగబారిన ముద్దుల నెమ్మొగంబుతో
ఘనసమయంబునందుఁ బొడకట్టిన చల్లని తూర్పుగాలిచే
ననిచిన కన్నెగేదఁగికి నచ్చిన కూరిమిచుట్టమో యనన్. ॥44॥

గీ. గర్భభారాలసాంగియై కంబుకంఠి
చెవి శిరీషప్రసూనంబు [120]చేర్పనోప-
దెట్లు ధరియింపఁగానోపు హేమరత్న-
కంఠికాహారకేయూర[121]కటకములను. ॥45॥

క. ఎలదోఁట తీఁగెయుయ్యెల
కలకంఠికిఁ [122]బిన్ననాఁటి కతలై తోఁచెం
జెలువకుఁ బాదాంబుజములు
[123]గిలిగింతలు వోవుఁ గేలిగిరివార్తలకు. ॥46॥

శా. ఆ సారంగవిలోలలోచనను గాఢాలింగనక్రీడలన్
వాసాగారము కేలితల్పముపయిన్ మన్నించి మంత్రీశుఁ డ-
త్యా[124]సక్తిం జవిచూచు నెట్టుకొని మృత్స్నాస్వాదనప్రక్రియా
వ్యాసంగంబు[125]నఁ గమ్మనైన యదసీయంబైన బింబోష్ఠమున్. ॥47॥

క. జలరుహనాభుని వక్షః-
స్థలికౌస్తుభమునను [126]మృడుని జడముడి నుదురా-
ట్కలికాలంకృతి వోలెం
బొలఁతుక ప్రత్యగ్రగర్భమున నొప్పారెన్. ॥48॥

వ. ప్రతిదివసోప[127]చీయమానగర్భనిర్భర[128]యగు నయ్యాదిగర్భేశ్వరి కౌముదీ[129]మహోత్సవంబునఁ బ్రియసఖీవిలోచనచకోర[130]కలం గోరికలు [131]నిండించి వెండియు. ॥49॥

చ. బహుదినముల్ మహాసచివు [132]పట్టపుదేవికి వృద్ధిఁ బొందె దు-
స్సహనవగర్భ[133]సంగ్రహము [జాడ] సఖుల్ ప్రియమందఁగా ముహు-

ర్మహురనుబద్ధజృంభితసముద్గతవిహ్వల[134]లోలనేత్రముల్
జహదజహత్సమగ్రపురుషాయితకేలివిజృంభణంబు[135]లై. ‖50‖

గీ. [136]అల్లనల్లన మెలఁగుఁ బద్మాయతాక్షి
సముదితంబైన గర్భభారము కతమున
సమ్యగాపీతజలరాశిసలిల[137]మైన
ప్రావృడారంభనవమేఘపంక్తి వోలె. ‖51‖

శా. [138]సీమంతోన్నయనంబుఁ బుంసవనముం జేయించె శ్రీయజ్ఞద-
త్తామాత్యాగ్రణి[139]చే నృపాలకుఁడు వింధ్యాధీశ్వరుం డర్మిలిన్
సామంతక్షితిపాలమంత్రు లసమానంబైన ప్రేమంబునన్
భామా[140]హేమతురంగరత్నములు పైపైఁ బావడల్ దేరఁగన్. ‖52‖

సీ. కమ్మగొజ్జఁగి నీటఁ గలయంపి చల్లిరి | [141]మేఁగి మెత్తిరి క్రొత్త మృగమదమున
రంగవల్లులు కప్పురపు [142]ధూళిఁ దీర్చిరి | [143]కిరించి రొగి మాల్యతోరణములు
తరుణరంభాతరుస్తంభంబు లెత్తిరి | కట్టి రెల్లెడఁ బట్టు కలువడములు
కమలచందనమాలికలు [144]వినిర్మించి రు- | త్తంభించి రున్నతధ్వజపతాక-
గీ. [145]లాలిఖించిరి గేహకుడ్యములయందు | సర్వతోభద్రమకరికాస్వస్తికములు
పరిజనంబులు రాజాజ్ఞఁ బట్టణమున | యజ్ఞదత్తుని ప్రథమకళ్యాణవేళ. ‖53‖

గీ. [146]వేడ్క నృత్యంబు లాడిరి వీథులందుఁ
బాడి [147]రెత్తిలి పికకుహూపంచమమున
[148]బంజళంబున ధవళప్రబంధగీతి
[149]కనుమ యవ్వలి కర్ణాటకమలముఖులు. ‖54‖

మ. *అదనన్ వచ్చిరి సంభ్రమంబునను బంచారామలీలావతుల్
పదునాల్జాతుల యప్సరోంగనలునుం బాలిండ్లపై హారముల్
గదలం బెన్నెఱి సేసకొప్పులపయిం గహ్లారగుచ్ఛంబులొ-
ప్పఁ దదీయత్వరగండభాగములఁ గంపంబొందఁ దాటంకముల్. ‖55‖

సీ. [150]పూజెకుండలు నిల్పెఁ బువ్వుఁబోఁడి యొకర్తు | శుభవితర్దిక చతుష్కోణములను
[151]జాజాలపాలికల్ సర్వౌషధుల నించి | ప్రోక్షించె జలము పద్మాక్షి యొకతె
కాంత యొక్కతె సన్నెకలుఁ బొత్తరంబును | [152]దొరించె వటశాఖతోడఁ గూడఁ
బీఠికంబులు [153]వెట్టి బింబోష్ఠి యొక్కతె | మడుఁగుఁ బుట్టము [154]గప్పె నడుగు
మునుఁగ
గీ. రమణి యొక్కతె వింజామరంబు దాల్చెఁ | దరుణి యొక్కతె తాళవృంతంబు పూనె
లలన యొక్కతె పసిఁడి సంబెల ధరించె | నాలవట్టంబు [155]వహియించె నతివ
యోర్తు. ‖56‖

గీ. మంత్రి [156]వేల్పించె గృహ్యోక్తమార్గ మొప్ప
బ్రహ్మపదమునఁ గూర్చుండి బ్రాహ్మణుండు
హోమములు రెండు బుగ్యజుస్సామవేద-
మంత్ర[157]మాది జయాదిహోమంబు తుదగ. ‖57‖

మ. [158]చెవికిం గేలివతంసకోత్పలదళశ్రీలై కపోలంబులన్
నవకాలాగరు[159]పత్రరేఖలయి మేనం గమ్మకస్తూరియై

ధవళాంభోరుహ[160]నేత్రపైఁ గురిసె నుద్యల్లీల సీమంతపుం-
సవనాజ్యాహుతిహోమసంప్రభవచంచద్వహ్నిధూమచ్ఛటల్. ||58||

మ. చెలికత్తెల్ చిఱునవ్వు చెక్కులపయిం [161]జెల్వార వీక్షింప నొ-
జ్జలు [162]మంత్రంబులు సెప్పఁ బ్రెగ్గడ శరత్సంపూర్ణచంద్రాస్యకున్
వలిచన్నుంగవమీఁద ముత్పులకము [163]ల్వర్ధిల్లఁ గేల్వంచుచున్
శలలీకంటక మెత్తి యొౌదలపయిన్ సంధించె సీమంతమున్. ||59||

క. కుటిలాలక [164]కుడి నాసా-
పుటరంధ్రము[165]నందు మూఁడుబొట్టులు [166]మిడిచెన్
వటఫలదళరస మధిపతి
కటకఝణత్కార మెసఁగ గరపద్మము[167]లన్. ||60||

గీ. మృదులగోధూమసరులతో మేలవించి
వన్నెకుచ్చుల పేరుతో [168]వక్కరించి
పుష్పడుండుభకంబుతోఁ బొత్తు [169]వడసి
బడఁతి పాలిండ్లపై [170]నొప్పె పసిఁడిపేరు. ||61||

గీ. తగవులిచ్చిరి [171]పుట్టింటితల్లి ప్రజలు
వీళ్ళొసంగిరి చుట్టాలు వేనవేలు
[172]కట్టనిచ్చె నృపాలుండు కన్నుదనియఁ
బరమహీపాలురిచ్చిరి పావడములు. ||62||

సీ. క్ష్మామండలము తురంగమధట్టమయమయ్యెఁ | గరిమయంబయ్యె దిక్చక్రవాళ-
మంబరం బాతపత్రావళిమయమయ్యె | సౌరభమయమయ్యె మారుతంబు
పరివారమయమయ్యె బ్రహ్మప్రపంచంబు | జయశబ్దమయమయ్యె సకల[173]జగము-
లాత[174]పంబు విభూషణాలోకచయమయ్యె | సంతోషమయమయ్యె జనులమనము
గీ. వింధ్యపర్వత మేలు పృథ్వీవరుండు | దానుఁ బట్టంపుదేవియుఁ దగవుగలిగి
సచివునింటికి [175]నేతెంచి సమ్మదమున | నొద్దనుండి యా శోభన మొనరుచుటయు. ||63||

గీ. [176]జవిలె నరఁబూలు ముడిచిన సాధ్వి యొకతె
[177]యొలగందంపుఁ బసపున నూన్చెఁ గదిసి
పసిఁడి యుత్తర[178]జందెముల్ [179]పాయఁబట్టి
రాచప్రెగ్గడ బ్రహ్మసూత్రమున నగుచు. ||64||

గీ. దశరథుని వాజపేయంబు ధర్మసూను
రాజసూయంబు నుపమింపఁ [180]బ్రాఁతియె యని
[181]పట్టణంబును దేశంబుఁ బరిఢవింప
బెట్టె దొడ్డుగ [182]నామెత ప్రెగడగారు. ||65||

వ. *అంత. ||66||

## సుకుమారుని జననము

క. నవమాసంబులు నిండిన
ధవళేక్షణ గాంచె సుతు సుధాకరతారా-
[183]రవిబుధధిషణవిధుంతుద
[184]కవు లుచ్చగముగను నమృతఘటికలు నడువన్. ‖67‖

వ. ఇవ్విధంబున సుశీలాదేవి నందనుం గాంచిన వార్త [185]యంతఃపురపరిచారిణి యొకర్తె విన్నవించిన నమృతరపధారామయంబయిన యమ్మాటకు సద్యఃప్రరూఢరోమాంకురనికరకంటకితగాత్రుండును దరస్మిత *(వికసిత)కపోలమండలుండునునై మంత్ర్యాఖండలుండు. ‖68‖

ఆ.వె. తాను గట్టినట్టి చీనాంబరంబులుఁ
దాను బెట్టినట్టి మేనితొడవుఁ
బ్రమదమొప్ప నిచ్చెఁ బారితోషికముగ
మంత్రి యంతిపురము మానవతికి. ‖69‖

సీ. [186]తలయంపి ధవళముద్రాకుంభ మిడువారు | రక్షాభసితరేఖ వ్రాయువారు
గౌరసర్షపరాజి కలయఁ జల్లెడువారు | బలివిధానంబులఁ బరఁగువారు
లవణంబు నింబపల్లవముఁ ద్రిప్పెడువారుఁ | [187]బ్రేము మంచంబుతోఁ బెనఁచువారు
[188]గవలధూపంబు సంఘటియించువారును | [189]మంచిము ట్టిడఁద యోజించువారు
గీ. గదిసి దీవించువారును [190]గంధతైల | [191]మలదుకొనువారుఁ గాయంబు లందువారుఁ
బాడువారును బరిహాసమాడువారు- | నైరి శుద్ధాంతసతు లరిష్టాలయమున. ‖70‖

సీ. కర్పూరసమ్మిశ్రగంధసారంబునఁ | జఱచెఁ [192]జప్పట భిత్తిఁ జామ యొకతె
[193]వెలికిలం బెట్టె నుత్పలగంధి యొక్కర్తు | గప్ప గర్భగృహోపకంఠభూమి
జ్యేష్ఠాధిదేవత సేవించె నొకయింతి | పసపుఁబుట్టము గట్టి భక్తిగరిమఁ
బటముపై లిఖియించెఁ బాటలాధర యోర్తు | క్రొత్తలత్తుక [194]శశాంకుని ఖరాంశు
గీ. [195]జరఠమేంతంబు కంఠదేశమునఁ జుట్టెఁ | బుష్పదుండుభముల నొక్క పువ్వుఁబోఁడి
యంబుజానన యొకతె నెయ్యభిఘరించె | భుజగనిర్మోక మొకతె నిప్పులఁ గమర్చె. 71[196]
ఉ. మంగళరత్నదీపముల మధ్యమునం బురుటింటి పాన్పుపై
నంగజసన్నిభుండు సచివాగ్రణినందనుఁ డొప్పె నెంతయున్
నింగిఁ బ్రదోషవేళ నతినిర్మలతారక[197]చక్రవాళముల్
సంగతిఁ జుట్టునుం గొలువఁ జాలఁగ నొప్పు శశాంకు కైవడిన్. ‖72‖

గీ. బాలకుఁడు చంద్రచంద్రికాపాండు [198]వయిన
[199]పాన్పుపై నొప్పెఁ బొత్తులపై శయించి
యమృతవారాశిలోన శేషాహి మీఁదఁ
బవ్వళించిన కౌస్తుభాభరణుఁ బోలి. ‖73‖

గీ. దానధర్మంబు లొనరించి త్యాగ మిచ్చి

బ్రసవగేహంబు సొచ్చి భూపాలమంత్రి
[200]యంబుపావకసంస్పర్శ మాచరించి
ప్రథమతనయు ముఖేందుబింబంబు సూచె. ||74||

గీ. పురుడు చెల్లంగఁ బుణ్యాహమును నొనర్చి
నిలయదైవతములఁ గొల్చి నిజసుతునకు
మారసన్నిభునకు సుకుమారుఁ డనెడి
పేరువెట్టెఁ బ్రధానబృందారకుండు. ||75||

గీ. పసపుఁబుట్టంబు ధరియించి పద్మనయన
సుతుని నుత్సంగమునఁ దాల్చి చూడనొప్పె
దరణిబింబహారిద్రవార్ధరముతోడ
లలితరుచి నొప్పు నాకాశలక్ష్మివోలె. ||76||

గీ. పల్లవాధర మడుఁగైన యొల్లెఁ గట్టెఁ
గొంగు మణిహేమకంతికాకోటిఁ జెరివి
సొబగుఁ గాటుకబొట్టుతోఁ జూడనొప్పె
వింతచెలువునఁ బచ్చిబాలెంత[201]రాలు. ||77||

ఉ. [202]రక్షకుఁ బుండరీకనఖరంబు సువర్ణలతానిబద్ధమున్
వక్షమునన్ ధరించి సచివప్రియసూనుఁడు చూడనొప్పె ను-
గ్రతతిసంభ్ర మోద్ధతిగ [203]గాఁడి విడంబితమైన [మర్త్య]హ-
ర్యక్షుని గోరు పేరురమునందు ధరించిన దైత్యు కైవడిన్. ||78||

గీ. రత్నవేదికపై మంత్రిరాజసుతుఁడు
తల్లిహృదయంబు [204]దృష్టియు తన్నుఁ గొలువ
[205]ఫాలతలమున రావ్రేక పరిణటింప
జానుచంక్రమణక్రీడ సంచరించె. ||79||

మ. వలిచన్నుల్ వడఁకాడ వేనలులు గైవ్రాలంగ గారాపు దా-
దులు తన్నేమఱ [206]కంతనంత దిరుగన్ ధూర్తుండు తా నుద్ధతిన్
గలకాంచీమణికింకిణీకలకలా[207]త్కారంబు తోరంబు గాఁ
గలహంసంబులఁ బట్టఁ [208]బాఱుసు వడిం [209]గక్ష్యావిభాగంబులన్. ||80||

వ. అంత [210]నా సుకుమారుడు నత్యంతసంతోషవంతులగు తలిదండ్రుల మనోరథంబు ఫలియింప ననుదినప్రవర్ధమానుండై వర్ధమానసంపదనురూపంబు[211]లగు నైశ్వర్యానుభవంబులు గలిగి క్రమంబునఁ గృతచౌలోపనీతుండై యాచార్యగృహంబున కరిగి. ||81||

సీ. చదివె వేద మెఱింగెఁ బదము [212]వాక్యంబుఁ బ్ర- | మాణంబు దివ్యాగమములు చూచెఁ
దరచె నాదిపురాణధర్మశాస్త్రంబులు | నేర్చె వీణావేణునృత్యకళలు
వాదనశ్యాంజన[213]వదనికాదులును జూ- | దంబును గణితశాస్త్రంబు దెలిసె
సరహస్యముగ నింద్ర[214]జాలమంత్రక్రియా | తంత్రమంత్రములఁ జిత్తరువు గఱచె
గీ. గ్రోల్చె యోగంబు సాధించె రుద్రభూమి | [215]సకలశస్త్రాస్త్రసంచయసమితి నేర్చె
[216]నాకళించెను విపులవైద్యక్రమంబు | సంగ్రహించెఁ గవిత్వంబు సచివసుతుఁడు.

||82||

వ. ఇవ్విధంబున సర్వవిద్యాపరిశ్రమంబునఁ [217]బ్రాగల్భ్యంబు వహించిన సుకుమారునకు శైశవంబు సరిగడచుటయుఁ బ్రదోషంబునకుఁ జంద్రోదయంబును, [218]జలధరంబునకు శక్రచాపంబును, [219]బుష్పంబునకు వాసనాప్రకారంబును, గమలవనంబునకు సూర్యోదయంబును, గంధగజంబునకు దానంబును, విజ్ఞానంబునకు మౌనంబును, [220]నవధ్యునకు గేయంబును, రాజ్యబలంబునకు నాజ్ఞాబలంబునుం బోలె భువనసమ్మోహనంబైన సౌందర్యంబున [221]కనురూపంబై జవ్వనం బావిర్భవించిన. ||83||

గీ. బాల్యమునయందుఁ గలుగు సౌభాగ్యరేఖ
నినుమడించిన సౌందర్య మెసకమెసఁగ
సచివతనయుండు [222]తారుణ్యసంక్రమమునఁ
[223]బద్మముఖులకుఁ గన్నులపండువయ్యె. ||84||

శా. పంచారామవిలాసినీధవళదృక్ప్రాతీనజాలాయమా-
నాంచ[224]త్కోమలనిర్నిబంధనమనోజ్ఞాకారరేఖా(కళా)-
పంచాస్త్రుండగు నా కుమారుఁ [225]డురుదర్పస్ఫూర్తి నవ్వీటిలో
సంచారం బొనరించెఁ గాంచనమహాసౌధాగ్రభాగంబులన్. ||85||

గీ. ఆదిగర్భేశ్వరత్వంబు యౌవనంబుఁ
జక్కఁదనమును నతిసాహసంబుఁ జనవు
నొక్కఁడొక్కం[226]డు చాలు దోషోత్కరమున
కన్నియును [227]గూడియున్నవి యతనియందు. ||86||

సీ. ఒకకొంతప్రొద్దు కందుకకేళి యొనరించుఁ | గంకణంబుల ఝణత్కార మెసఁగ
నొకకొంతప్రొద్దు వల్లకి నఖాగ్రంబుల | బహురాగముల నేర్పుఁ [228]బ్రస్తరించు
నొకకొంతప్రొద్దు [229]కొండికజవంబు లొనర్చు | పరిహాసగోష్ఠికిఁ బల్లవించు
నొకకొంతప్రొద్దు లోకకథాప్రహేళికా- | బిందుమత్యాదులఁ బిచ్చలించుఁ
గీ. గొంతప్రొద్దు వినోదించుఁ [230]గొఱతలయిన | తోడివేడుకకాండ్రతో మేడమీఁద
విమలచంద్రోదయారంభవేళయందు | [231]బిల్లదీవాటలను
మల్లు[232]పెనఁగుటలను. ||87||

వ. ఇవ్విధంబునఁ దృష్ణావిషవల్లి [233]కాలవాలంబును, నింద్రియగుణంబులకు శరణంబును, మోహ[234]నిద్రకు విభ్రమశయనంబును, శాస్త్రదృష్టికి దిమిరోద్గమంబును, దోషాశీవిషంబులకు [235]నావాసవల్మీకంబును, *(సుగుణకలహంసంబులకుఁ బ్రావృట్కాలంబును,) గపటనాటకంబునకుఁ [236]బ్రస్తావనయు, ధర్మేందుమండలంబునకు రాహువక్త్రంబునునైన యౌవనారంభంబున. ||88||

సీ. ఆజానుదీర్ఘబాహార్గళస్తంభుండు | కోమలాళినీలకుంతలుండు
కర్ణాంతవిశ్రాంతకమలాయతాక్షుండు | పరిఫుల్లచంపక [237]ప్రసవనసుఁడు
బహుళాష్టమీశశిప్రతిమఫాలతలుండు | కంబుసన్నిభచారుకంధరుండు
పరిపక్వబింబికా[238]ఫలపాటలోష్ఠుండు | గంధవారణకుంభ[239]కఠినభుజుఁడు
గీ. సచివతనయుండు కుపితధూర్జటిలలాట- | చక్షురనలార్చి రుద్గమసంప్రభూత

విస్ఫులింగచ్ఛటా[240]ఘటావేష్టనమునఁ | బసిమి దప్పని వలరాజు పగిది నొప్పె. ||89||

సీ. [241]చరిగొన్న వెలిపట్టు జన్నిదంబులతోడ | [242]రత్నాలతారహారము ధరించి
వలిపనీర్కావిదోవతిపైఁ బదార్వన్నె | [243]కళయైన పసిఁడిమేఖల [244]ఘటించి
గంగమట్టియమీఁదఁ గస్తూరిరసమునఁ | బుండ్రకంబు లలాటమున నమర్చి
[245]విమలసన్మణికుండలముల పార్శ్వములందు | లలితంబులగు [246]నొంటు లలవరించి
గీ. యాత్మవంశపరంపరాయాతమైన | వైదికాచారమార్గంబు వక్కణించి
[247]యారజము రాచటికమును నలవరించి | నగరవీథులఁ జరియించుఁ బ్రెగడసుతుఁడు. ||90||

గీ. సచివనందను కర్ణపాశముల వ్రేలు
కుండలంబుల ముత్యాలగుళిక లొప్పు
నన్యలోకస్థుఁడగు శంబరారి కేడ్చు
రతిమహాదేవి యశ్రుపూరములు వోలె. ||91||

క. కుసుమాయుధనిభుఁడగు నా
రసికునిపై వ్రాలు సానురాగముతోడన్
బిసరుహనయనల చూపులు
భసలంబులు పూపుఁదోటపయి వ్రాలు గతిన్. ||92||

గీ. భావ మభిరామరూపైక[248]పక్షపాతి
యౌవనము దోషముల కెల్ల నాస్పదంబు
మన్మథుఁడు [249]కోపి యెటు నియమంబు నిలుచు
సుదతులకు వానిఁ గడకంట జూచినపుడు. ||93||

సీ. హృదయ ముప్పొంగిల్లూర నేకాంతమున నుండి | వానిఁ [250]జింతింపని వనజముఖియు
నొకమాఱు అతనిఁ జూచి యొండొక్కమాటి చూడ | [251]నభిలషింపని విద్రుమాధరయును
గలలోన వానిఁ జిక్కఁగఁ గౌఁగిటను జేర్చి | ముకుళితేక్షణగాని ముద్దియయును
నతని రూపంబుఁ గుడ్యములందు లిఖియించి | [252]యందంబుఁ జూడని యంగనయును
గీ. [253]జెలులచేతను బ్రోది రాచిలుకచేత | వాని గుణములు విని కుచద్వంద్వసీమఁ
[254]జాదుకొనఁ బులకింపని పైదలియును | బన్నిదము వ్రేసినను లేదు పట్టణమున. ||94||

సీ. ద్యూతకేలియ వినోదోపాయ[255]మయ్యెను | బరదారగమనంబు ప్రౌఢియయ్యె
నాత్మభార్యాపరిత్యాగంబు ధృతియయ్యె | [256]నాఖేటలీల విహారమయ్యె
గురుతిరస్కా[257]రంబ గరిమ[258]యయ్యెను నట- | విటకీర్తనంబు[259]లే పటిమయయ్యెఁ
బానంబె యధ్యాత్మపరత[260]యై విలసిల్లె | తరలతాగతియ యుత్సాహమయ్యె
గీ. గుణము [261]దోషంబు దోషంబు గుణమునయ్యె | నపుడు సుకుమారునకుఁ దద్వయస్యులకును

నాదిగర్భేశ్వరత్వంబు యౌవనంబు | [262]సవురు ధనమును జనవు హేతువులు గాఁగ. ॥95॥

గీ. [263]త మ్మమానుషకాలోచితంబులైన
కీర్తనంబుల [264]మై పులకించుకొండ్రు
తా రమర్త్యులుగా మదిఁ దలఁతు రహహ
విత్తమదమత్తచిత్తులై వెఱ్ఱిజనులు. ॥96॥

సీ. అయ్య నీవు చతుర్భుజావతారుఁడ వన్నఁ | దమ భుజాదండపార్శ్వములఁ జూతు-
రయ్య నీవు త్రిలోచనావతారుఁడ వన్న | ఫాల మంటుదురు దోఃపల్లవమున-
నయ్య నీవు గజాననావతారుఁడ వన్నఁ | గుంభపీఠము లంటికొనఁ దలంతు-
రయ్య నీవు [265]చతుర్ముఖావతారుఁడ వన్న | [266]నద్దంబుఁ జూడంగ నభిలషింతు-
గీ. రవసరం బిచ్చుట యనుగ్రహంబు గాఁగ | మోముఁ జూచుట యుపకారముగను బలుకు
మైత్రిగా నప్పు డధిక[267]సమ్మానముగఁ ద- | లంతు రైశ్వర్య[268]వైభవవంతు లుబ్బి. ॥97॥

ఉ. సంపద పేరి కట్టిఁడిపిశాచము సోఁకిన మానవుండు పూ-
జింపఁ డభీష్టదేవత భజింపఁడు సజ్జనులైనవారి మ-
న్నింపఁడు మిత్రబంధుల గణింపఁడు ధర్మరహస్యముల్ విచా-
రింపడు (నేమముం దగ భజిం)పఁ డహంకరణంబు పెంపునన్. ॥98॥

గీ. ఉద్ధతుం [269]డయి సుకుమారుఁ డుండలేక
[270]వీటఁ జక్కని జవరాలి వెదకివెదకి
వలపు పుట్టించి సంకేతములకుఁ దార్చి
[271]చలుపు రతికేలి బహుళపక్షంబు రేలు. ॥99॥

గీ. పద్మనాభుండు మదనగోపాలమూర్తి
ఘోషమున [272]నెట్లు వలపించె గొల్లసతుల
నెట్టుకొని [273]యట్లు వింధ్యాద్రిపట్టణమునఁ
బరపురంధ్రుల [274]వలపించె బ్రాహ్మణుండు. ॥100॥

సీ. యమునానదీసైకతమున జాలరికన్య | చనుదోయి నంటఁ డే శక్తిసుతుఁడు
నందవ్రజంబులో నలిననాభుం డెట్లు | విహరించెఁ బదియాఱువేలసతుల
దేవదారువనంబులో విరూపాక్షుండు | మునిభామినుల నెట్లు మోసపుచ్చెఁ
గొక్కొరొకోయని కోడియై యెలుఁగించి | యమరనాయకుఁ డె ట్లహల్యఁ గలసె
గీ. మొలకచన్నులపాయంపు ముద్దుఁగూఁతుఁ | బట్టుకొనె నెట్లు పైకొని పద్మభవుఁడు
చందురుం డెట్లు వొందె నాచార్యులేమ | ననుచు విప్రుండు [275]రమియించె నన్యసతుల. ॥101॥

సీ. [276]సంధ్యాభివందనశ్రద్ధ యుద్వాసించె | గాయత్రి దవ్వులఁ గట్టిపెట్టె
నగ్నిహోత్రముమీఁది యాస నుత్పాటించె | నఘమర్షణస్నాన మరసి [277]మానె
[278]నిహపరసామగ్రి నీయఁజాలెడునట్టి | విధిదేవతార్చన వీటఁబుచ్చె
[279]వేదపాఠము మానె వివిధసత్కర్మాది | సత్కలాపంబులు జాఱవిడిచెఁ

గీ. [280]సిగ్గుఁ బోకార్చెఁ గుక్కలఁ జేతఁబట్టె | [281]నిలిచియుండియు మూత్రించెఁ గలిసె లజ్జఁ
[282]గాలపరిపాటి ప్రారబ్ధకర్మవశతఁ | బయిసికొట్టనం బడియె నా బ్రాహ్మణుండు. 102[283]

వ. ఇవ్విధంబునం దృగున్మీలనంబునం బోలె మార్గంబు దప్పి, జిహ్వోచ్ఛేదనంబునం బోలె మూఁగై, ఇంద్రజాలపింఛికాప్రచారంబునం బోలె తత్త్వం బెఱుంగక, ఊహజ్వరంబునం బోలె [284]నసంబద్ధంబు లాడుచు, లోకాయతవిద్యాభ్యాసంబుననుం బోలె నధర్మంబు మరగి, పైశాచగ్రహణంబునం బోలె గళవళింపుచు, మదనా వేశంబునం గావరంబెత్తి వర్తింపుచున్న సుకుమారు రావించి యజ్ఞదత్తుండు సుశీలాదేవి [285]సమక్షంబున వాని కిట్లనియె. ॥103॥

గీ. అన్న సుకుమార! యేలయ్య యనుదినంబు
గొఱకుఁదనమున ధూర్తులఁ గూడి తిరిగె
దకట మీ యమ్మ గాంచె నిన్నధికనియతిఁ
గోరి వీరవ్రతంబున గొడ్డు వీఁగి. ॥104॥

సీ. ఓరి నీకాచార్యుఁ డుపదేశ మిచ్చెనో | దర్శించితెట్లు శాస్త్రములలోన
ధర్మం బుపార్జింపఁ దగిన మార్గమె యిది | తపము వర్ధిల్లునే తనరఁ దీనఁ
గైవల్యపదవి యెక్కఁగవచ్చునే దీనఁ | గంటె నాకమునకుఁ గారణముగఁ
గాదేని [286]నియమంబు క్రమమే యిది దలంప | భవదుఃఖములు దీనఁ బాయుటెట్లు
గీ. మూర్ఖుఁడైనను శిశువైన మూఢుఁడైన | దన కరిష్టంబుఁ దలఁచునే మనమునందు
నంతరహితుల యార్గురయందు ఘనుఁడు | మన్మథుఁడు దద్వికారంబు మాను మిపుడు. ॥105॥

సీ. రత్నాంశుదీపాంకురములచేఁ బాయదు | యౌవనోద్భూతమైనట్టి తమము
శిశిరోపచారంబుచేత సాధ్యముగాదు | ప్రత్యగ్రమైన దర్పజ్వరంబు
మంత్రమూలములచే మణులచేఁ దేరదు | విషయవిషాస్వాదవిషమమూర్ఛ
సలిలాభిషేక శౌచములచేఁ బోవదు | ఘనభోగమను పూతిగంధకళిక
గీ. యామవతిఁ దెల్లవారిన నణఁగిపోవ- | దుదరసుఖసన్నిపాతనిద్రోదయంబుఁ
బ్రతిదినంబును లక్ష్మీసురామదంబు | విరియనేరదు పరిణామవేళయందు. ॥106॥

క. [287]ఏమగునొకొ బాంధవమున
నామలకశలాటురసము యౌవనలక్ష్మీ-
సామగ్రికినా యొగరు గ-
దా మధురత యొసఁగు విషయమను జలమునకున్. ॥107॥

గీ. [288]జవ్వనముననను సదుపదేశములు గావు
తి(ట్టిఁబోసిన సలి)లంబు తెఱుఁగు దోప
శంబరారాతిపుష్పాస్త్రసంప్రహార-
జర్ఝరీభూతమగు మనస్సంపుటమున. ॥108॥

వ. తండ్రి! గురూపదేశం బఖిలమలప్రక్షాళనక్షమంబైన తీర్థస్నానంబు, జరామరణవైకల్యంబు లేని వార్ధకంబు, మేదోభారంబు లేని గౌరవంబు, సువర్ణరచన లేని కర్ణాభరణంబు, నుద్వేగంబు లేని ప్రజాగరంబు; [289]ఇది యభవ్యులకు

సలిలంబునుం బోలెఁ గర్ణస్థితంబై యుపద్రవంబు నాపాదించు. నీ విటవట్టి నెట్టుకొని పెద్దలమాట వినుము, వింటేని ధూర్తులు నిన్నుఁ [290]బ్రశాసింపలేరు, *(కుటిలులు నిన్ నలమరింపలేరు), వంచకులు నిన్ను వంచింపలేరు, పల్లవులు నిన్ను వలపింపలేరు, మదంబు నిన్నుఁ గదల్పలేదు, [291]విషయంబులు నిన్ను నాశ్లేషింపలేవు, విను మనూచానాచారంబును, నాముష్యాయణంబును, [292]నామేధితామ్నాయంబును, నధీతాశేషశాస్త్రంబును, [293]నలింగవృత్తియు, [294]ననవకీర్ణంబు, ననభ్యుదితంబును, ననభిష్ఠుతంబునునైన [295]యాయావరవంశంబునం బ్రభవించినాఁడవు మూఢుఁడవై యనుష్ఠానబంధంబులగు విషయోపభోగంబులయందు సుఖబుద్ధి యారోపించెదవు. నీయట్టి [296]దుర్బుద్ధిశీలురుగదా నిస్త్రింశంబుఁ జూచి కువలయమాల యనియును, గృష్ణసర్పంబు వీక్షించి కాలాగురుధూమరేఖ యనియును, నంగారంబు [297]దర్శించి బంగారం బనియును భ్రాంతిఁ బొందుదురు. దుందుమార[298]కరంధమ మాంధాతృనహుష నాభాగసన్నిభుండు వింధ్యాచలపతి, హేమాంగదుండు మనల గురుస్థానంబుగా మన్నింపుచున్నవాఁడు. మన వంశంబునకు నీవొక్కండవ సంతానబీజంబ వింతయు నెఱింగి బుద్ధిమంతుడవై మమ్ము నుద్ధరింపవలదా యని*(పలికి) మంత్రి కన్నీరు దొరఁగ ముహూర్తమాత్రం బూరకుండె సుశీలాదేవియు. ‖109‖

సీ. రవలయుంగరముల రత్నాంకురము లొత్తఁ | గేల్దమ్మి చెక్కులఁ గీలుకొల్పి
మొకరితుమ్మెద మూతిముట్ట నోడెడి వేఁడి- | నిశ్వాసపవనంబు నివ్వటిలఁగ
నాకర్ణదీర్ఘంబులగు క్రాలుఁగన్నులం | బరిపాటలచ్ఛాయ పల్లవింప
గంఠగోళంబు గద్గదికాను[299]బద్ధమై | బాష్పభారంబు నిబ్బరము గాఁగఁ
గీ. బక్ష్మములు జాఱి గండదర్పణము లొరసి | వ్రాలి పాలిండ్లపై నశ్రువాఃకణములు
హారలతలకు నాతిథ్య మాచరింప | గుబ్బతిల నేడ్చె [300]నొత్తిలి కువలయాక్షి. ‖ 110‖

వ. ఇవ్విధంబునఁ దల్లియుఁ దండ్రియుఁ [301]దనకు హితోపదేశంబు చేసి తన సౌమనస్యసౌముఖ్యంబులతోఁ దగిన ప్రత్యుత్తరం [302]బీయమి నిర్వేదించుట యెఱింగి. ‖111‖

సీ. ధర్మశాస్త్రాభ్యాసతాత్పర్యముననైన | సంస్కార [303]మె ట్లొరుసొరు పడియె
నిరుపాధినిస్సీమనిర్నిబంధన[304]శక్తి | గల మహాప్రతిభ యే కాటఁ గలసె
బంచేంద్రియ[305]విజయోపాయభూతములైన | వినయంబు లే ప్రయోజనముఁ దీర్చె
నవయౌవనాంకు[306]రోన్నతవంశదవమైన | [307]శ్రుతివైభవం బేమి హితవు చేసె
గీ. జిన్ని వయసున [308]గురులు శిక్షించినట్టి | పుణ్యవాసన నేల గోల్పోయె మనసు
కటకటా! నందనుండ [309]వొక్కఁడవ కల్గి | గురుల నేడ్పించుచున్నావు [310]కోరగమున. ‖112‖

వ. అనినఁ దల్లిదండ్రులకుం బ్రణామంబు చేసి యింతనుండి మీ యాజ్ఞ [311]శిరంబున ధరియించి బుద్ధిమంతుండనై యుండెద మీరు [312]వగవకుండుండని పలికి సముచితప్రకారంబున వీడుకొనియె ననిన నటమీఁది వృత్తాంతం [313]బెట్టిదని యడిగిన. ‖113‖

మ. వరశైవైకవిధాన [314]దానకథనవ్యాపార పారంగతా-
స్థిరలక్ష్మీనవశారదోదయ దయాధీనాయతాలోక లో-

కరమాపాదన పాదపద్మవినతక్ష్మాపాలసంశీల శీ-
లరతిప్రస్ఫుటశాంత శాంతనవకల్పద్వీర వీరాగ్రణీ. ॥114॥

క. ధీమత్కవితావిస్తర-
ధామాయిత నిరుపమానదానాంబుద హృ-
ద్భీమ జయోత్కలసీమా-
రామామన్మథవిశేష రాజితమూర్తీ! ॥115॥

మందారదామ. లింగార్చనా[315]రూఢలీలావిశాలా
గంగాంబు[316]సుస్వచ్ఛకావ్యైకజాలా
*సంగీతసాహిత్యసాహిత్యలోలా
శృంగారసద్భక్తసేవాను[317]పాలా. ॥116॥

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర సకలవిద్యాసనాథ శ్రీనాథనామధేయ ప్రణీతంబయిన శివరాత్రి మాహాత్మ్యంబునందు ద్వితీయాశ్వాసము.



[1] తా. పెరిగి.
[2] ము. చుట్టుముట్టినయట్టి.
[3] తా. పట్టనంబున.
[4] ము. తా. మకుట.
[5] తా. తోరణకోవిదుండు.
[6] ము. మొదల.
[7] ము. తా. లీలావతీ శతద్రు విపాట్సింధు.
[8] తా. సువర్ధిత.
[9] తా. స్ఫాల.
[10] తా. ప్రాయ
[11] తా. ప్రస్థంబులును.
[12] తా. నిపీడితకాసారసేకంబులును.
[13] తా. సనకోచణకచణకంబులును.
[14] తా. శ్యామ.
[15] ము. శర్మరాతిల.
[16] ము. మహాకోర.
[17] ము. కుస్తుంబురు.
[18] ము. భృంగ.
[19] తా. చరిత్రంబులనుం బోలె.
[20] తా. సరళంబులును.

[21] తా. రత్నాలయంబులును.
[22] తా. మదిన్.
[23] తా. కంఠముక్తముగ.
[24] తా. నప్పురీ-పురబాహ్యోపవన.
[25] తా. వీక్షకు గౌతుకంబు.
[26] తా. మేలె.
[27] ము. మహాసేనాని యాత్మ్మండు. తా. మహాసేనాని యాతండు.
[28] తా. నపవ్యసాయు.
[29] తా. నధికరాభ్యుదయుండు.
[30] ?. బుద్ధుని క్రియ జయత్పుష్పశరుఁడు.
[31] పావగాహబుద్ధి.
[32] తా. హరిశ్చంద్రునకు సత్యకీర్తియును ము. నలునకు దమనుండునుం బోలె.
[33] ము. బాలా.
[34] ము. బరమప్రియాస్పదంబై.
[35] తా. లుంగల.
[36] తా. తనయు.
[37] తా. దాల్చి.
[38] ము. లింపెసఁగిన. తా. లింపనినను.
[39] తా. ఁదగునట్టి.
[40] ము. నంబుండ.
[41] ము. మతికి.
[42] ము. పడతి.
[43] ము. సుతలబ్ధి వడయుటకును.
[44] ము. చిన్నగ.
[45] ము. కాంతమ.
[46] తా. ఆ చపలాక్షి దాను.
[47] తా. బూని.
[48] తా. వ.
[49] తా. నేత్రి.
[50] తా. కుంతలి.
[51] తా. నకును.
[52] తా. గూనిగిలఁగ.
[53] తా. రవణి.
[54] తా. పుచు.
[55] తా. అపుత్రులైనవారలకు.
[56] ము. విరహశయ్యపై.
[57] తా. డస్సియున్న.
[58] ము. ముత్యాలదండ వోలె.

[59] తా. చన్నులని నున్నయవి బాష్పజరకణములు.
[60] ము. యానచక్రోద్ధురంబగు నితంబముమీద.
[61] తా. కమలు.
[62] తా. పచ్చ.
[63] తా. కనురాగ.
[64] తా. చెప్పె యిందువదన.
[65] తా. భరంబు.
[66] తా. నేత్రి.
[67] తా. నేను జను నొరునేనిన్.
[68] తా. నేత్రి.
[69] తా. బు.
[70] తా. యడిగినం.
[71] తా. స్నాన.
[72] తా. కునికి వర్తించుచు.
[73] తా. పీడ.
[74] తా. కనారతంబు నే కారణంబు.
[75] తా. నిన్న రేపు.
[76] తా. ల.
[77] తా. కథాకథన.
[78] ము. ములికియుం బోలె.
[79] తా. యేకాంతంబున నిచ్చోట.
[80] తా. కారముఖి.
[81] తా. దీని కెటులైన దేవుండు బలవంత.
[82] తా. యేడ్వ.
[83] ము. మున్ సదాశివున్ సారసనేత్ర.
[84] ము. లేకను సుతుఁడెట్లు.
[85] తా. సేవించు.
[86] తా. నలినముఖి నిష్ఠమీర సంతత మనీష.
[87] తా. మునిజనంబుల భజియించి మున్ను గాంచి.
[88] ము. నబ్జవదన.
[89] ము. రాజు దైతేయకులవిమర్దను.
[90] తా. గాంచె.
[91] తా. యామినియు.
[92] తా. నేమంబున నోములు నోముము.
[93] ము. దుఃఖోపశమనభాషణంబులు.
[94] తా. నిపుణంబులు.
[95] ము. చారు.
[96] తాన యమ్మానినీరత్నంబునకు.

[97] తా. సుశీల పరమభక్తితాత్పర్యంబు.
[98] ము. మంత్రవిద్యాధృతబుద్ధిఁ గాంచు.
[99] ము. చొలవకూచిన కడవంచునే లతాంగి.
[100] తా. నీడజోడు.
[101] తా. నిగుర్చు.
[102] ము. నతిథిసత్కారములను.
[103] ము. దన్వంగి.
[104] తా. విప్రకన్యల.
[105] ము. వ్రతములు సలుపుచుండు.
[106] తా. నేత్రి.
[107] తా. పుణ్యవ్రతోపవాస.
[108] తా. లు.
[109] ము. నా సుదతీలలామంబు మెఱసి.
[110] ము. నిలయ.
[111] తా. నసమగ్న.
[112] ము. వినత.
[113] ము. నస్తాంతరితయగు.
[114] ము. కమును బోలె.
[115] తా. పలచ.
[116] తా. నవమతించె.
[117] తా. నాతి కుచచూచుకంబులు.
[118] తా. బట్టముదేవి.
[119] ము. బల్చనై చెలువు పైకొను.
[120] తా. ఁజతచనోప.
[121] తా. కంకణములు.
[122] ము. చిన్ననాఁటి.
[123] ము. గిలిగింతలు గొలుపుఁ గేలిగిరిగుహలందున్.
[124] ము. సంగంబొనరించె ముద్దుగొనె.
[125] తా. ను.
[126] ము. దీప్తిఁ దనరెడు మణిరా.
[127] నీయమాన.
[128] ము. యగుచు నయ్యాది.
[129] ము. విలసనంబునుం బోలెఁ.
[130] ము. కలకుఁ.
[131] ము. నిండించె.
[132] తా. పట్టముదేవికి.
[133] ము. చిహ్నములు చూచి.
[134] ము. నేత్రపద్మముల్.

[135] ము. లున్.
[136] ము. అట్లు ధవునొద్ద.
[137] తా. య్యైన.
[138] ము. సీమంతోన్నతసంభ్రమంబు వెలయం.
[139] ము. కన్నృపాలకుడు. తా. కిన్.
[140] ము. సింధు.
[141] తా. మ్రొకువెట్టిరి.
[142] ము. మ్రుగ్గు వెట్టిరి.
[143] తా. దోరించి రొగిఁ దల్యతోరణములు.
[144] ము. ను నిర్మించిరి, స్తంభించి రుత్తమదర్పణములు.
[145] తా. అభిలిఖించిరి.
[146] తా. వెలఁదివెన్నలఁ బ్రాసాదవీథులందు.
[147] తా. రొత్తిలి.
[148] తా. పంజరంబున.
[149] ము. కముల నవ్వేళ.
[150] తా. పూజగుండలు నిల్పెఁ బూఁబోణి యొక్కతె.
[151] ము. జాజాలపాలెల సర్వౌషధులు.
[152] తా. దోలించె.
[153] తా. వెట్టె.
[154] తా. లిచ్చెగడలు మునుఁగ.
[155] ము. ధరియించె.
[156] తా. గల్పించె గుహ్యోక్త.
[157] తా. వేద.
[158] తా. చెవులం గేతిని
[159] తా. చిత్ర.
[160] తా. నేత్రిఫైఁ బొలసె.
[161] తా. జిర్వార.
[162] తా. చెప్పనష్టు.
[163] తా. వర్ధిల్లెఁ గేల్సాచుచున్.
[164] ము. కును.
[165] ము. లందు.
[166] ము. పిడిచె.
[167] తా. నన్.
[168] తా. వక్కడించి.
[169] ము. వచ్చు.
[170] ము. నొప్పు.
[171] తా. పుట్టింటి.
[172] ము. కట్నమిచ్చె.

[173] తా. జనము.
[174] ము. పత్ర.
[175] తా. నేతెంచు.
[176] తా. జరఢి నరమూల ముడిచిన.
[177] ము. యుల్లగందంబు.
[178] తా. జంధ్యాలు.
[179] తా. వాయఁబెట్టి.
[180] తా. ప్రాప్తమైన.
[181] తా. పట్టణంబున దేశంబు పరిణమింప.
[182] తా. నామిత.
[183] ము. రవిసుత.
[184] ము. కవులు భికములుగ నవమ ఘటికలు.
[185] తా. యంతఃపురచారిణి యొక్క చకోరనేత్రి విన్నవించిన నవ్వాక్యంబు.
[186] తా. తలయంటి ధవళనిద్రాకుంభ.
[187] తా. ప్రేమ, మువ్వంబుతో.
[188] తా. గమల.
[189] తా. మంచిము ట్టెదుర.
[190] ము. గండతైల.
[191] ము. మందుకొనువారు.
[192] తా. నప్పటి.
[193] తా. వెలకెలం. ము. వెలకిల్లఁ.
[194] తా. శశాంకశేఖరాంశు.
[195] తా. జరఢమేఢ్రంబు.
[196] తాళపత్రమున నిచట రెండు మూడు పద్యములకు వలసిన చోటూరకే విడిచి యున్నది.
[197] తా. చక్రవాకముల్.
[198] తా. వైన.
[199] ము. పొన్పుఁ బొత్తులపై నొప్పెఁ బవ్వళించి.
[200] ము. యప్డు.
[201] ము. యపుడు.
[202] ము. అక్షయవర్ణితాఖ్యుఁడు గరంబు(?) సువర్ణ.
[203] ము. ని గాండివధన్వుని తండ్రియౌ సహస్రాక్షునివైరి పేరురమునందు.
[204] ము. దృష్టులు.
[205] ము. సకలజనులును బంధులు సంతసింప.
[206] ము. కంతలంతలను వేడ్కల్ మీఱి చూడంగఁ దాఁ.
[207] తా. రావంబు
[208] తా. జారువడినిం.
[209] తా. కక్ష్యాది భాగంబులన్.

[210] తా. ననంతసంతోషాక్రాంతస్వాంతులగు దంపతుల.

[211] ము. గఁ గుమారత్నంబునకుఁ గ్రమ.

[212] ము. వక్కాణించె మహనీయ.

[213] ము. వదనికాదులు జూదమాడంగ నెఱిఁగెను మదనశాస్త్ర. తా. వదనికాదులును జూదంబు గణితశాస్త్ర ముద్రంబు దెలిసె.

[214] ము. జాలంబు యంత్రక్రియా మంత్రతంత్ర చిత్తరువు గఱచె.

[215] తా. కరభటజ్ఞానవీథికి గాలుసాఁచె.

[216] తా. అభ్యసించెను విపులవైద్యములు నేర్చె.

[217] ము. పారీణు

[218] తా. సజలబలధరంబునకుఁ జక్రవాకంబును.

[219] తా. కల్పపాదపంబునకుఁ గుసుమప్రకారంబును.

[220] తా. దానంబునకు నాత్మశ్లాఘావిపర్యయంబును.

[221] తా. కనురాగంబైన యవ్వనం బావిర్భవించిన.

[222] ము. తానొప్పి చారులీలఁ.

[223] ము. బౌరజనులకు.

[224] ము. త్కారము.

[225] ము. రకుఁడు.

[226] తా. డ బాలుఁ డోష్ఠోష్ఠమదమున.

[227] తా. రూఢి.

[228] తా. ప్రౌఢిచూపు.

[229] ము. భాండక.

[230] తా. ప్రౌఢలైన.

[231] తా. పిల్లదీపాటలను.

[232] తా. వెలుఁగుటలును.

[233] తా. కావలంబంబును.

[234] తా. నిద్రలకు.

[235] తా. నివాస.

[236] తా. ప్రస్థాపనయు.

[237] తా. ప్రసవి.

[238] ము. పరిపాటలోష్ఠుండు.

[239] తా. కరిభుజుండు.

[240] ము. వలీ.

[241] ము. పరి.

[242] తా. ముత్యాలతారహారములు దాల్చి.

[243] తా. కళలైన.

[244] తా. నటింప.

[245] ము. కమలకర్ణిక.

[246] తా. చెంప లలవరింప.

[247] తా. ఆవజముతో చెరికము నలవడంగ.

[248] ము. పాతకంబు.

[249] తా. కోటవెట్టు నేమంబు నిలుచు.

[250] తా. చింతించని.

[251] తా. అభిలషించని.

[252] తా. అద్దంబు సూడని యంగనయును.

[253] తా. చెలువచేతను.

[254] తా. జాదుకొనం బులకించని. ము. బాదుకో.

[255] తా. మై తోఁచె.

[256] ము. ఁజేలవిహారంబు సేమమయ్యె.

[257] ము. రంబు.

[258] ము. మయ్యె.

[259] ము. లు.

[260] ము. యయ్యె సమస్త.

[261] ము. లకు నెల్ల.

[262] తా. సవరదనమునుఁ జనువు.

[263] తా. తమ్ము.

[264] తా. మయి పులకించుకొనుచు.

[265] ము. చరాచరావతారుఁడవన్న.

[266] ము. నందంబు.

[267] ము. తరార్థముగఁ.

[268] ము. మదబల.

[269] తా. డైన.

[270] తా. వింట జిక్కని జవరాలి.

[271] తా. సలుపు.

[272] తా. నెట్టు.

[273] తా. యట్ల.

[274] ము. వలపించు.

[275] ము. రమియించు.

[276] తా. సంధ్యాది వందన.

[277] ము. మాపె.

[278] తా. వైశ్వదేవముమీఁది విశ్వాసము త్యజించె హంతకారము బుద్ధి నపనయించె.

[279] ?. దేవతార్చనము మీఁది ప్రయత్నమును మానె చదువు శాస్త్రము నౌరుసౌరు పరచె.

[280] ము. దనకు మరగిన వారసుందరవనితల.

[281] ము. నిరతసల్లాపసంభోగనిపుణతా సు-.

[282] ము. ఖానురాగనిమగ్నుఁడై నిత్యకర్మమై తనర్చెను

సుకుమారధరణిసురుఁడు(?)
[283] ఈ భాగమున ముద్రిత ప్రతిలో నివియున్నవి.
వ. ఇవ్విధంబునఁ గుమారుండు విహరింపఁజూచి.
క. ప్రేమమునఁ గూర్చు సుతునకు, వేమఱు సద్బుద్ధి చెప్ప వినమికి వగచున్,
సామగ్ర్యదుర్గుణాళి క,దా మధురత యొసఁగు విషమమగు చలమునకున్.
[284] తా. ఆ సంబంధంబు లాడుచు.
[285] తా. సక్షమంబువ
[286] తా. నియమక్రమంబేది.
[287] తా. ఏమఉనొకొ.
[288] తా. జవ్వనములు.
[289] తా. ఇట.
[290] ము. బ్రశంసింప.
[291] ము. విషయంబు.
[292] తా. నామ్రేడితామ్నాయనంబు.
[293] తా. నాలింగ.
[294] తా. ననవకీర్ణియు.
[295] ము. యార్య.
[296] తా. దుర్బుద్ధియు.
[297] తా. ధరియించి.
[298] ము. సముండు.
[299] తా. బంధమై.
[300] ము. నత్తఱి.
[301] తా. తన కుచితోపదేశంబు.
[302] తా. బీక నివేదించుట.
[303] తా. మెడ్డోరుసారు.
[304] ము. వృత్తి.
[305] తా. జయోపాయభూతములైన.
[306] తా. శాహవపదమైన నీ. ము. శోన్నతవంశపదమైన.
[307] ము. శ్రుతివైభవములేమి.
[308] తా. ము. గురుల నీక్షించినట్టి.
[309] ము. ఒక్కఁడవు నీవు.
[310] ము. గోరముగను.
[311] ము. శిరసున.
[312] తా. వగవకుండని.
[313] తా. బెట్లని.
[314] ము. పాత్ర కవితా.
[315] ము. రూఢి లీలావతారా.
[316] తా. మృత్స్వచ్ఛ.

[317] ము. హేలా. *తాళపత్రమున లేదు.

# తృతీయాశ్వాసము



దోరంతర[1]దేవ
ప్రాదితభాషావిశేషభాసురకీర్తి-
శ్రీదార్ఢ్య వివిధపూజా
మోదితగిరిదుహితృకాంత ముమ్మయశాంతా. ‖1‖

వ. అక్కథకుండు శౌనకాది మహామునుల కిట్లనియె. నట్లు తల్లిదండ్రుల నూరార్చి వెడలి సుకుమారుండు నిజాంతర్గతంబున. ‖2‖

గీ. పోయె నుపదేశకాలంబు పూర్వముననె
కడచె ధైర్యంబు [2]జఠరవిక్రాంతమయ్యె
శీలసంపత్తి యిఁక నేమిసేయువాఁడ
భామినీ[3]సక్తి మన్మథుబారిఁ బడితి. ‖3‖

శా. [4]పంతంబోడదు ధర్మముం దగవునుం బాడిం గులంబున్ విచా-
రింతున్ వేదపురాణశాస్త్రమతపారీణుండఁ గా నెట్ల-
ల్పాంతద్వాదశభానుమత్కిరణదాహక్రూరకామవ్యథా-
సంతాపజ్వరవేదనాభరమునం జాకుంట [5]సిద్ధించినన్. ‖4‖

సీ. చాండాలుతోఁ బుల్కశత్వంబు గైకొను | బ్రహ్మహత్య యొనర్చి బ్రాహ్మణుండు
క్రిమియై పతంగమై కీటమై జన్మించు | నాసవం బాని భూమీసురుండు
క్రవ్యాదసత్త్వసర్గమున నుద్భవమందు | విప్రుఁ డాచార్యునివెలఁదిఁ గవిసి
శ్యామచారుండు పిశాచమౌ బాడబుం- | డన్యుని విత్తంబు నపహరించి
గీ. యయిన [6]నేమగు వీనిలో నన్నిటికిని | సుఖము దుఃఖంబుఁ జర్చించి చూచినప్పు-
డెల్లసంసారులకుఁ (బోలె) హెచ్చు(గుందు) | లేకయుండుట గందుమో లేదొ జగతి. ‖5‖

గీ. వామదేవుండు శుకుఁడుఁ [7]గేవలము దక్క
ముక్తులెవ్వరు వింటిమే ముజ్జగమున
జంతువుల కెల్ల [8]సరియ సంసారయాత్ర
విధినిషేధంబులకుఁ జొప్పు వెదకనేల. ‖6‖

శా. ఆతంకంబున కేమికారణము బ్రాహ్మ్యం [9]బింతయుం జూచి యే
తాతల్ గట్టిన చెర్వు లే శ్రుతులు [10]బోధప్రక్రియల్ స్వల్ప మే
చేతోజాతు నుపాశ్రయించె[11]దఁ బరస్త్రీలన్ వినోదించెదన్

మాతంగీపరమేశ్వరిం గొలిచెదన్ మద్యంబు సేవించెదన్. ‖7‖

గీ. [12]అష్టమావతారంబున నాదిపురుషుఁ
[13]డచ్యుతుఁడు విశ్వకర్త యనాదినిధనుఁ
డర్జునుండును దాను నేకాంతగోష్ఠి
విశ్వము నెఱుంగ [14]నొగలపై వినిచెఁ గాదె. ‖8‖

మ. బహువేదాంతమతానుసాధిత [15]మహం బ్రహ్మాస్మియం చాడుదుర్
మహి మోహాంధులు గొందఱేని [16]యది బ్రహ్మం బెట్టు [17]దారెట్టిరో
యహహా బ్రహ్మము [18]దారయే నులుకశయ్యం ద్రెళ్ళి నిద్రింతురో
జహదుత్సర్గముగాఁగఁ జేయుదురొ విష్ఠామూత్రనిర్మోక్షమున్. ‖9‖

సీ. కల్పద్రుమంబుతోఁ గామధేనువుతోడ | నమృతాబ్ధి నవతారమయ్యె నెద్ది
బృందారవనమధ్యమందారతరుల[19]లో | హలపాణి కెద్ది ప్రత్యక్షమయ్యెఁ
ద్రిపురాంతకుని యర్ధదేహంబునకు నెద్ది | [20]మదసముల్లాససంపత్తి యయ్యె
నవసుధారూపమై పవనభుగ్భువనాధి- | పతి కెద్ది ప్రాణంబు ప్రాణమయ్యె-
గీ. నట్టి భవభేషజము నాసవామృతంబుఁ | గన్నుఁ గానక శపియించెఁ గాక యొకఁడు
తత్సమానములగు పదార్థములు గలవె | భూతభావిభవత్కాలముల ధరిత్రి. ‖10‖

వ. *అని. ‖11‖

సీ. కర్పూరరజము[21]లోఁ గలిపి కేతకీధూళి | నఖిలాంగకముల నభ్యంగమాడి
జలజనాళీతంతుసందానితములైన | యజ్ఞోపవీతంబు లఱుతఁ దాల్చి
వారాంగనాస్తన[22]హారవిభూషల | నక్షమాల్యముగఁ జే నలవరించి
కస్తూరికామిశ్రగంధసారంబున | నలికంబునఁ ద్రిపుండ్ర మనువుపఱిచి
గీ. చంద్రికావేళఁ బరిపాండుసౌధవీథి | శక్తిఁ బూజించి దేవీప్రసాదమధువు
పుచ్చుకొను విప్రుఁ డాకంఠపూరితముగ | వెలఁదులును దాను నప్పుడు వినిమయముల. ‖12‖

క. వనితల [23]కంగప్రేంఖో-
ళన మక్షివిఘూర్ణనంబు లజ్జావిగమం-
[24]బనవస్థితి మధుపానం-
బునను సురతముననను సదృశములు వక్త్రంబుల్. ‖13‖

గీ. త్రిసరకాస్వాదభవ మదోద్రేకలహరి
ధరణిదేవుఁ డా యోజ మత్తావహించి
యారణాలు పఠింపంగ నాలకించి
శంబరారాతి రతిచేయి చఱచి నవ్వు. ‖14‖

సీ. ఇంట నున్నాఁడొ వాఁ డెచ్చోట నున్నాఁడొ | యొంటియో యెందఱే నున్నవారొ
మిన్నకున్నాఁడొ [25]యేమేఁ బల్కుచున్నాఁడొ | నిద్రించినాఁడొ కన్దెఱచినాఁడొ
[26]యడలుచున్నాఁడొ (ప్రహర్షింపుచున్నాఁడొ) | చించిలినాఁడొ గర్వించినాఁడొ
(శోకించినాఁడొ) యుత్సేకించినాఁడొ యు- | ల్లాసించినాఁడొ కలంగినాఁడొ
గీ. యుత్సవమొ వైభవమొ లేమియో కలిమియొ | పగలొ రాత్రియొ యెఱుఁగఁ డా బ్రాహ్మణుండు
నవమధూకప్రసూనసంభవపు మధువు | దలము దప్పంగఁ ద్రావి మత్తావహించి. ‖

15 ||

క. సుకుమారుఁ డిట్లు నానా-
[27]ప్రకరంబుల వీటిలోనఁ [28]బడుచై తిరుగన్
సకలజనులు మొఱవెట్టిరి
యొకనాఁ డత్యాగ్రహమున నుర్వీశు సభన్. ||16||

క. దేవర ప్రతినిధిఁగా సం-
సేవింతుము యజ్ఞదత్తు [29]సిద్ధ మతనిఁగా
భావింతుము తత్తనయుని
యౌవనసంప్రాప్తి లేని యటమున్నెల్లన్. ||17||

వ. అవధరింపుము సుకుమార నామధేయుండైన మంత్రినందనుండు సౌందర్యవంతుండును గామశాస్త్రకళా[30]విధిజ్ఞుండునునై జారచోరవిటధూర్తవర్గంబులం గూడి వేడుకకాఁడై పుణ్యస్త్రీల [31]యాలువులు చెఱచుచున్న వాఁ డతని వారింపను నారీజనంబుల శిక్షింపను సమర్థులము గాకయున్నార మద్దురాత్మకుని నన్యాయసదృశంబైన దండంబు *(వలన) దండించునది యని విన్నవించిన (నా) మహీపాలుం డతని రప్పించి వాగ్దండనంబున దండించి పురంబును దేశంబును వెడల నడిపించిన రాజావమానితుండై యప్పాపి కీ[క]టదేశంబునకుం బోయి యందుఁ గొన్నిదివసంబు లుండి హూణమండలంబునకు నేతెంచువాఁడు కాంతారమధ్యంబున నతిక్షుత్పిపాసాపరవశుండై తనలో*(న) నిట్లు వితర్కించుచుండె. ||18||

చ. అరుణగభస్తిబింబ ముదయాద్రిపయిం [32]బొడతేర గిన్నెలోఁ
బెరుఁగును వంటకంబు వడపిందియ[33]లుం గుడువంగఁబెట్టు ని-
ర్భరకరుణాధురీణయగు ప్రాణముప్రాణము తల్లియున్న దే
హరహర యెవ్వరింకఁ గడుపారని పెట్టెద రీప్సితాన్నముల్. ||19||

వ. అని తనలోనం దలపోయుచుం జనిచని ముందట. ||20||

సీ. స్ఫటికరత్నగృహంబు సర్వంసహాకాంత | కభిధాంతరంబు దుగ్ధాంబునిధికి
మణిదర్పణము నభోమణిమార్గలక్ష్మికిఁ | జంద్రాతపమునకు జన్మభూమి
యర్ధేందుమకుటాట్టహాసంబునకు జోడు | పౌలస్త్యగిరికి సబ్రహ్మచారి
ప్రతిబింబ మభ్రముప్రభువారణమునకు | ననుఁగుఁజుట్టము శారదాభ్రములకు
గీ. గమతతిమినక్రవిక్రమక్రమవిహార | చటులతరవీచికాఘటా[34]సమధిరూఢ
హంసకులసన్నినాదసంవ్యాప్తదిగ్వి- | భాగ మీక్షించె నతఁడు తడాగ మెదుర. ||21||

మ. వసుధానిర్జరుఁ [35]డమ్మహాసరసిలో వార్వీచులం దేలెఁ ద్రా-
వె సుధాసన్నిభమైన వారిఁ దటపృథ్వీజావళిచ్ఛాయ[36]లన్
వసియించెన్ లహరీసమీరముల నధ్వశ్రాంతి పోకారిచెన్
బిసకాండంబులు [37]మేసెఁ గూర్చెఁ జలువల్ నిర్మోకసంకాశముల్. ||22||

క. కరశీకరార్ద్రపుష్కర-
కరుఁడై యాతండు గంధకరిరాజు క్రియం
[38]బరిషేకానంతరమునఁ
సరసిరుహాకరము వెడలి చాలఁగ నొప్పెన్. ||23||

సీ. వైదూర్యమణిశిలాస్వచ్ఛోదకము గానఁ | గౌతుకం బొనరించెఁ గన్నుఁగవకు
[39](శిశిరసంస్పర్శవీచీమారుతము గాన | నంగకంబులకు నిం పావహించెఁ
మలకేసరరేణుగంధోల్బణము గాన | ఘ్రాణేంద్రియమునకుఁ బ్రమద మొసఁగె
గలహంసకులకలకలకలకులాయము గాన | శ్రుతిసంపుటములకు సుఖమునిచ్చె)
గీ. (మధుర)సలిలంబు [40]గాన సమ్మదముఁ జేసె | నాలుకకు నప్పు డవనిబృందారకునకు
సైకతారూఢజలమానుషీకదంబ- | కాంక్షితార్కమయూఖంబు కనుల నరసి. ||24||

క. కొలనిదరి వటమునీడన్
శిలతల్పమునందుఁ గొంతసేపు శయించెం
జెలువమగు వలిపెదుప్పటి
తలగడఁగాఁ జేసి సచివతనయుం [41]డంతన్. ||25||

గీ. బహులపక్షక్షపాకదంబములలోనఁ
బ్రభవ మొందిన యంధకారంబువోని
కొలనిదరి కాననంబులోఁ గొంత[42]ప్రొద్దు
నలపు వాయంగ నిద్రించె యాజ్ఞదత్తి. ||26||

గీ. [43]డప్పి దీఱంగ మధురకాండంబు గ్రోలి
కడుపునిండంగఁ [44]దూఁడుఁదీఁగలు భుజించి
యెండ వాలారునందాఁక నిండుకొలని
తీరమున మఱ్ఱినీడ నిద్రించె నతఁడు. ||27||

చ. అపుడు విలంబమానమయి యంబరకోణతటాంతరంబునం
దపనునిమండలంబు బెడిదంబగు వేఁడిమి వే నొయ్య్య వీడ్కొనెం
గపిలములై మయూఖములు కార్తికమాస[45]కళాపచేళిమ
త్రపుసలతాశలాటుసముదాయముచాయఁ దిరస్కరింపఁగన్. ||28||

గీ. అంత[46]లో నిద్ర మేల్కాంచి యవనిసురుఁడు
జిగమిషాబుద్ధి [47]నీక్షించెఁ జిత్రభాను
నభినవోన్మేషకుటిలజిహ్మాప్రకార-
లోలతారకాకేకరాలోకనమున. ||29||

శా. కాంతారాంతరభూమిచెంత శబరగ్రామంబు పద్మాకర-
ప్రాంతక్షోణితలంబునం గలుగ [48]సంభావించె విప్రుం [49]డెదన్
దంతిస్కంధకపోలకుంభపలలాదక్రూరకౌలేయకీ-
[50]సంతానాస్ఫుటకంఠఘర్ఘరతరద్రాఘిష్ఠనాదంబులన్. ||30||

వ. (ఆ సమయంబున). ||31||

సీ. ఆదికాలమున మాయావిలాసినియైన | మురదైత్యదమనుని మూర్తి వోలె
ధరణితలంబునఁ జరియింప నేర్చిన | పురుహూతమణిశిలాపుత్త్రి వోలెఁ
గామినీరూపంబుఁ గైకొన్న శంబరా- | రాతి కాలాయసాస్త్రంబు వోలె
వేడ్కకె మానుషీవిగ్రహంబు ధరించి | విహరించు తొలుకారువేళ వోలె
గీ. నంధతామిస్రమును నవిద్యయును బోలె | భువనమోహనరూపవైభవము [51]లొలయ

లీల నేతెంచె నొక్క చండాలకన్య | కొలనఁ జిఱుబంతిపసపాడఁ జెలియుఁ దాను. ||32||

శా. ఆ చండాలకులప్రసూతయగు కన్యం గన్యకారత్నముం
జూచెన్ దవ్వుల యాజ్ఞదత్తి విపినక్షోణీవిభాగంబునన్
వాచాగోచరసౌకుమార్యనవలావణ్యాన్వితం బుష్పనా-
రాచుం డిక్షుశరాసనంబు ఘన[52]దోర్దర్పంబునం గూర్పఁగన్. ||33||

ఉ. యోగసమాధితత్పరత నున్న విధంబున [53]వ్రాసినట్లు మూ-
ర్ఛాగమ[54]మీలితాత్ముఁడగు చాకృతినిశ్చలదేహయష్టియై
సోగకనుంగొనల్ నుదురు చొక్కుల కిక్కలుగాఁగ నత్తఱిన్
రాగరసాతిరేకమున బ్రాహ్మణుఁ డాదటఁ జూచె మాలెతన్. ||34||

సీ. అప్సరస్త్రీ వోలె [55]నకులీనయైన యీ | పైదలి కన్నులపండువయ్యెఁ
[56]జామ యౌవనరూపసంపన్నయై [57]మోక- | వనరేఖయునుబోలెఁ బెనఁచె వేడ్కఁ
బొలఁతి [58]ప్రావృడ్వేళ వోలె నళివినీల- | ఘనవేణియై యిది [59]కరము మెఱసె
నిభరాజనిభయాన యిది [60]శరత్తునుఁ బోలెఁ | బుండరీకాక్షియై పొలుపు మిగిలె
గీ. ముట్టరానిదియైనట్టి మూర్తి వోలె | జిత్తరువు వోలె దృష్టి కచ్చెరు వొనర్చె
మెలఁత మధుమాసకుసుమసమృద్ధి వోలె | జాతివిరహిత[61]యయ్యు సంప్రీతి నొసఁగె. ||35||

గీ. దీనిఁ గల్పించె నజుఁ డభిధ్యానమునను
నాతి మును ముట్టరాకుండ నంత్యజాతి
ముట్టుటయ కల్గెనేని యిమ్ముదితమేను
గందకుండునె పుష్పంబుకంటె మృదువు. ||36||

వ. అని [62]విస్మృతనిమేషంబు గిలించి ముకుళితపక్ష్మాంచలంబును జిహ్మ [63]తరతరళశాతోదరంబునునగు వీక్షణంబున నవ్వెలివాడ వ్రీడావతి నీక్షించుచు నవ్విప్రుండు మదనశరశలాకాశంకు[64]సంకలితహృదయుండై స్తంభితుని [65]భంగి విలిఖితుని చందంబున నుత్కీర్ణుని పగిది [66]నియతుని లాగున మూర్ఛితుని ప్రకారంబునఁ (నున్మత్తుని తెఱంగున) దన్నుఁ దానెఱుంగక నివ్వెఱపడి నిశ్చలాంగుండై యుండె నమ్మచ్చెకంటియు నలవోక వోలె నతిస్వచ్ఛసౌభాగ్యచ్ఛాయావినిర్భర్త్సిత మత్స్యకేతనుండగు నా బ్రాహ్మణుం గనుంగొని [67]నిజాంతరంగంబున. ||37||

గీ. విప్రవేషంబుఁ దాల్చిన విష్ణుఁడొక్కొ
బ్రాహ్మణుండైన శంబరారాతి యొక్కొ
బాడబాన్వయరూప[68]సంప్రభవుఁడైన
చందురుండొక్కొ యితఁ డతిస్వచ్ఛమూర్తి. ||38||

వ. అని యంతంతం జేరవచ్చి యయ్యంత్యజాతిసీమంతిని యశేషజనపూజనీయులు బ్రాహ్మణులని తమ కులంబు [69]పెద్దలవలన వినుటం జేసియుఁ దా[70]నెందే నొక్కపూర్వజన్మకృతపుణ్యసంస్కారవిశేషంబుననో బాల్యంబు [71]నాఁటనుండియు రూపంబు వినయంబు దాక్షిణ్యంబు మధురాలాపకౌశలంబు నిస్సంగతప్రశాంతమహానుభావంబు శుచిత్వంబు గౌరవంబు సద్భావంబు గుణంబులు నైసర్గకంబులయి యుండుటనో

భర్గఫాలనయనకృశానుజ్వాలాజాలహేలాచుళుకితావయవుండు గాని కుసుమకోదండుండునుం బోలెఁ గన్నులపండువై తప్తకాంచనవర్ణంబును గోరాచనాగౌరంబును జాంపేయకుసుమకేసరరేణుత్రసరేణువిసర[72]పిశంగంబునునగు దేహ[73]ప్రభాప్రవాహంబున గహనషండం బశేషంబును వెలిగించువాని నుద్భిన్ననవశ్మశ్రు [74]నభినవయౌవనోద్భాసితు షోడశవర్షదేశీయు నాదిగర్భేశ్వరు నమాత్యనందను సుకుమారుం గుమారసన్నిభుఁ దప్పక చూచి భయసంభ్రమడోలాయమాన దంతతాటంకవలయం బగునట్లుగా నిబ్బరంపు గుబ్బచన్నుల బిబ్బోకంబు బాహుమూలకూలంకషంబై యీషద్విలోకనీయం[75]బుగఁ గేలుదోయి సేవాంజలిపుటంబు లలాటంబునఁ గీలించి యయ్యగారికి నమస్కారంబని యధరకిసలయంబునకు దశనరత్నాంకురజ్యోత్స్న కుసుమస్తబకంబుగా సహకారపల్లవాస్వాదకషాయకంఠకలకంఠకామినీ కోమలకుహూకారకోలాహలకరంబిత పంచమరాగ ప్రపంచంబునకు మించుఁజూపు కంఠస్వరంబునం బలికిన. ॥39॥

గీ. వెలఁది మాలెత గాన దీవింపకయును
నొప్పెడిది గాన నూరకయుండకయును
ధరణి దేవుండు గైకొనె దాని మ్రొక్కు
గేలుఁదామర తిర్యగాందోళనమున. ॥40॥

ఉ. శంబరవైరిసన్నిభునిఁ జారుతరోజ్జ్వలమూర్తి విప్రర-
త్నంబు మహాప్రధాను ప్రియనందనునిన్ సుకుమారుఁ జూచి ప్రే-
మంబు వహించియుం గొమరుమాలెత గన్నుల నవ్వు దేరఁగా
[76]సంబళిసంబళీ యళుకు సందడికిం దలమంచుఁ బల్కుచున్. ॥41॥

గీ. బ్రాహ్మణుఁడు గాన లజ్జింపఁ బ్రాప్తి లేక
బాల ప్రౌఢయవోలెఁ దప్పకయ చూచి
చాటువడి యుండుమయ్య యీ సరసిలోన
నుదకమాడెదఁ[77]గాక పిన్నదియు నేను. ॥42॥

క. *అని పలుకుచుఁ గొలనికి డిగఁ
జని మాలప్రమద దాను సఖియు నొనర్చెన్
వనకేళితరంగ లురు-
స్తనభారాస్ఫాలనమున జర్జరములుగాన్. ॥43॥

చ. పడఁతి పసిండిడాలు [78]గనుపట్టు [79]హరిద్ర ప్రతిప్రతీకమున్
దొడసి సరోవరాంబువునఁ దోఁగి పయోనిధితీరభూమికిన్
వెడలి ధరాసుపర్వునకు నేత్రమహోత్సవమయ్యె నప్పుడ-
ప్పుడ కలశాబ్ధిమధ్యమునఁ బుట్టిన యాదిమలక్ష్మియో యనన్. ॥44॥

గీ. కొలను వెలువడి తడినూలు వలువ విడిచి
మణుఁగు పుట్టంబుగట్టి యమ్మగువ యొప్పె
[80]జలద మెడవడి వర్షావసానవేళఁ
గాశకుసుమాట్టహాససంగతియుఁ బోలె. ॥45॥

ఉ. ఆ కలకంఠి యొయ్యఁ దడియార్చు నెడన్ జఘనాంతికంబులై
[81]కేకికలాపలీల నణకించి మధువ్రతమాలికాకృతిం

గైకొని యింద్రనీలమణిఖండవిలాసమలిమ్లుచంబులై
చీకటికొల్పె బ్రాహ్మణుని చిత్తము పెన్నెఱిసోగవెండ్రుకల్. ||46||

గీ. చికురసంతతి నీరార్చి చెలువ తుఱిమె
సేసకొ ప్పొక(యింత దక్షిణము మలఁగ)
చన్నుఁగవ[82]సొంపు కక్ష[83]దేశముల మెఱుఁగు
బ్రాహ్మణుని యాత్మఁ బల్లవింపంగఁజేయ. ||47||

గీ. దంతతాటంకచక్రమధ్యంబునందు
బాల కీలించెఁ గంకేళిపల్లవంబు
బాడబుని నేయఁదలఁచు శంబరరిపునకుఁ
బ్రథమ మదియ నమస్కారబాణమయ్యె. ||48||

గీ. పూనెఁ గుచముల వెలివాడపువ్వుఁబోణి
విప్పుగలయట్టి బండిగుర్వెందసరముఁ
బ్రథమరాగరసోద[84]యరక్తమైన
సచివనందను హృదయజసంగరమున. ||49||

వ. అప్పుడు సుకుమారుండు నిజాంతర్గతంబున. ||50||

సీ. ఏల చేయండు శేషేంద్రియంబులు నాల్గు | నలినగర్భుఁడు లోచనములుగాఁగ
నెట్టు గల్గె విధాత కీ రూపనిర్మాణ- | పరమాణువులు కోటిపరిమితంబు
లజుఁడు దీని సృజించి యాత్మ నువ్విళ్లూర- | కెట్లుండుఁ గూతు మోహించినాఁడు
కల్పింపఁబోలు శృంగార[85]సర్గంబున | దీని వాక్పతి [86]యున్నతి ఫలియించె
గీ. దీని [87]నిఖిలావయవములు తీర్చితీర్చి | చేయునపుడు ప్రయాసంబుఁ జెందుటయును
నొయ్యనొయ్యన బ్రహ్మ నిట్టూర్పువుచ్చె | నదిసుమీ పుష్పసమయమందానిలంబు. ||51||

వ. అని విచారిం[88]చుచు విప్రుండు చండాలకులకన్యకా*(మణి) దుర్లభంబగు సౌభాగ్యంబునకు నద్భుతంబందుచు దానితో సంభాషింపఁ గోరి చేరువ [89]నిలిచె జనంగమకన్యకారత్నమును నతని కిట్లనియె. ||52||

క. ఎందుండి [90]యేఁగు దెంచితి-
రెం దరిగెద రిచట నునికి కేమి కతంబో
కందర్పరూపరేఖా-
సౌందర్యవిలాసవిభవ[91]సర్వజ్ఞనిధీ. ||53||

వ. నిన్నుం జూచి సుఖామృత(హ్రద)ంబున మునింగిన చందంబున [92]రతిసముద్రంబును దేలిన విధంబున [93]సర్వానందంబుల కుపరిభాగంబున వర్తించు కరణి సకలమనోరథంబులకు సంకేతంబైన లాగున నా హృదయంబు నిర్వృతిం బొందియున్నయది. ||54||

ఉ. క్రొన్ననవింటిజోదు నలకూబరు నైషధునిం జయంతునిం
బున్నమనాఁటిచందురునిఁ బోలినవాఁడవు రూపసంపదన్
నిన్నొకవిప్రుఁగాఁ బరిగణింపఁగవచ్చునె కల్లగాదు మా

యన్నల[94]తోడు చూడు పులకాంకురముల్ మొలచెం గుచంబులన్. ||55||

గీ. అవనిసుర చింతకాయల కాజ్ఞ గాక
యరసిచూడంగ గ్రుక్కిళ్ళ కాజ్ఞ గలదె
యంటరాకున్న నేమి యంతంత నిలిచి
చిత్తమలరంగ నిన్ను వీక్షింపరాదె. ||56||

సీ. కమలినీపత్ర[95]పాత్రములఁ గాసారోద- | కముఁ దెచ్చి పాదపద్మములు గడుగఁ
జిలుక ముట్టని ఫలంబులు గోసికొని వచ్చి | పరికించి యారగింపంగఁ బెట్టఁ
గాంతార[96]కర్పూర కదలికాదళముల | సరసరీతులను వీజన మొనర్ప
నధ్వఖేదము వోవ హస్తద్వయంబున | నూరుకాండము లొత్తి యుపచరింప
గీ. వేడ్క[97]యయ్యెడు వినయంబు విస్త[98]రిల్ల | [99]భక్తి గొనఁసాగఁ బ్రమదంబు పారమేద
నీకు విప్రోత్తమునకు నీ నెలవులందుఁ | జెట్టదుర్జాతి యది నన్నుఁ జెఱిచెఁ గాని. ||57||

క. ఇది హూణమండలం [100]బ-
వ్వది నున్నది చెంచుపల్లె వనమధ్యమునన్
మదననిభ యీ పుళిందా-
స్పదంబు వెలివాడ (జన్మసదనము నాకున్). ||58||

తాళ రగడ. కనుఁగొనవలయును దౌదవ్వుల నెడ[101]గలిగి నిలిచియైనను మా యిండ్లన్
వనమధ్యంబున విప్రోత్తమ వెలివాడవనితలకు నేత్రోత్సవమై
యనిభృతపరభృతనఖ(శిఖరోల్లిఖితాంగణ)సహకారద్రుమశాఖా
ఘనఫలరసధారామృతపానోత్కంఠవివృత్తాననవటుకంబున్. ||59||

క. [102]పాణసివారము కమ్మని
ప్రాణము నెఱజాణదేవరా వినవలదా
వీణావాద్యముఁ బాటయు
వేణుస్వానంబు వేనవేల్ చందములన్. ||60||

వ. అని చండాలకన్యక పలికిన నవ్విప్రుండు భవితవ్యతాబలంబున. ||61||

సీ. ఇది యసజ్జనగోష్ఠి యిది [103]మోహవిలసితం | బిది [104]మహాపాపకం బిది యకీర్తి
యిది దుర్మదాంధత్వ మిది [105]కామవిక్రియ | (యిది యాగ్రహావేశ) మిది కుదృష్టి
యిది నారకద్వార మిది ప్రమాదస్థలం | బిది మౌర్ఖ్యకారణం బిది యనియతి
యిది యధర్మముత్రోవ యిది [106]పథప్రచ్యుతి | యిది యధోగతిహేతు విది యకృత్య-
గీ. మని విచారింప కవనీసురాధముండు | కలికి చండాలకన్యపైఁ గన్ను వైచెం
దీయతీయనివింట లేఁదేఁటినారి | శంబరారాతి మోహనాస్త్రంబు [107]దొడుగ. ||62||

వ. [108]అప్పుడతండు నిజాంతర్గతంబున. ||63||

సీ. మాంసంబు భక్షింప మనసు వెట్టిననాఁడ | దాక్షిణ్యగుణము [109]విధ్వంసమయ్యె
గంజాయిఁ దినఁగ నుత్కంఠ చేసిననాఁడ | లజ్జాభిమానంబు లుజ్జగిల్లె

హాలారసము గ్రోల నభిలషించిననాఁడ | సూనృతోక్తుల సుద్ది చూఱవోయెఁ
బరకళత్రముల[110]పైఁ బడఁదలంచిననాఁడ | ప్రజ్ఞావిలాసంబు పదటఁ గలసె
గీ. నింక నేటికి వంచింప [111]నిలుపు నాకు | బరువె యీ పాపములలోనఁ బాపమొకటి
వరుస వేయింటిమీఁద జవ్వాదికొమ్ము | తివుటఁ జండాలకన్యకఁ గవయువాఁడ. ||64||

వ. అని పరమసాహసంబు చేసి సుకుమారుండు చండాలకన్యకం జేరవచ్చి యిట్లనియె. ||65||

కవిరాజ విరాజితము[112]. సరసిజలోచన యొక్కమహాముని శాపవశంబునఁ బాణచిపై
ధర జనియించినదానవు నీవిది తథ్యము కిన్నరభామినివో
గరుడపురంధ్రివొ [113]ఖచరవధూటివొ గాని జఘన్యవు గావిఁక నన్
ధరణిసురోత్త[114]ము దగ వరియింపు సుధాకరసూర్యులు సాక్షులుగాన్. ||66||

వ. సామాన్యస్త్రీజనంబుల కిట్టి యమానుషలోకోచితంబులైన సౌభాగ్యంబు[115]లుం గల్గునె మునికోపవశంబున సముజ్ఝితదివ్యశరీరలగు దేవ[116]కాంతలు శాపవశోపనీతంబైన శరీరంబు నధిష్ఠింతురు తొల్లి [117]స్థూలశిరుండను మహాముని త్రిభువనలలామభూతయగు రంభ నేదేని యొక్కనిమిత్తంబున శపించెననియును దచ్ఛాపంబున నయ్యప్సరస బాడబరూపంబు ధరియించి మృత్తికాపతియందు శతధన్వుఁడను రాజును సేవించుచుం బెద్దకాలంబు మర్త్యలోకంబున నుండెననియును విందుము. ||67||

సీ. జలజగర్భుని మానసంబు వేదంబులు | దక్షప్రజాపతి దర్పకుండు
సౌదామనీవల్లి చంద్రికాలోకంబు | సప్తజిహ్వా జ్వాలసప్తకంబు
రవిమయూఖములు నీరవని దుగ్ధాంభోధి | మృత్యుదేవత[118]నోరి మెఱుఁగుఁబండ్లు
ముని కరిష్టాదేవికిని సంభవించిన | దివ్యగంధర్వజాతిద్వయంబుఁ
గీ. గారణంబులుగాఁ బుట్టినారు [119]పదియుఁ | నాల్గు కోట్లప్సరసలునా నాకసతులు
వారిలో నొక్కతెవు నీవు వారిజాక్షి | యేమి దుష్కృతిఁ బుట్టితో హీనజాతి. ||68||

గీ. తివుచుచున్నది భవదీయదృగ్విలాస-
మెత్తుకొనిపోవుచున్నవి యింద్రియములు
వెనుక ద్రొబ్బుచునున్నాఁడు మనసిజాతుఁ
డేమి సేయుదుఁ జెప్పవే యిందువదన. ||69||

గీ. వనిత నీ చిత్తమున కేను వత్తునేని
కామతంత్రంబునకు సంచకర్వు గాఁగఁ
జుంబనము సేయని మ్మోష్ఠబింబ మిపుడు
గండుఁగోయిల చిగురాకుఁ గమిచినట్లు. ||70||

గీ. అనుచు విప్రుండు తమకించి యంటుకొనియె
సమ్మతించియ యుండె నా చంద్రవదన
శూకలాశ్వంబు నస రేఁపఁ జొచ్చినప్పు
డనుమతింపదె యత్తళువైన బడబ. ||71||

వ. ధీరోదాత్త [120]యగుట నమ్మత్తకాశిని చిత్తజాయత్త యయ్యును దత్తఱపాటు లేక

యతనితో నిట్లనియె. ॥72॥

సీ. కలుగుచున్నవి యనేకములు వికల్పము | లాడుచున్నవి యపాయంబు లెదుర
నంతరాయము లసంఖ్యములు గన్పట్టెడు | సందేహములు పెక్కు చాయవాటె
నంకురితములయ్యె శంక లేరాళంబు | వికృతు లెన్నెని యావిష్కరించె
శాఖోపశాఖలఁ జాఁగుచున్నది రట్టు | గుటిలేక యుదయించె గోసనాస
గీ. యిన్నిటికి నోర్చి నీ కోర్కి యేను దీర్తు | నింతవానికి [121]నీకు నన్నీయ బరువె
యెప్పటికి [122]నిత్తునో లేక యీ శరీర | మిప్పటికిఁ జాలునో నిక్కమెఱుఁగఁ జెపుమ.
॥73॥

గీ. మొదలఁ గక్కుర్తిపడి [123]కూడి పిదప వాయు
నొక్క కమలాననకు డిక్కి యుండఁజాలఁ
డడవిఁ బెక్కు పుష్పములయందు వ్రాలు
చంచరీకంబు మగవాఁడు సరియ సువ్వె. ॥74॥

ఉ. చందురుఁ డంత చూడఁడు నిశా[124]సతి బున్నమనాడు గూడుచో
గందళితానురాగుఁడయి కానఁగవచ్చు నవోదయంబులం
జందము దప్పి మీఁద నొకచాయకు వచ్చుఁ గ్రమక్రమంబునన్
సుందరి పట్టునందుఁ బురుషుండును [125]నట్లయకాఁ దలంపుమీ. ॥75॥

వ. *అనిన విని సుకుమారుండు. ॥76॥

క. మగవారల నిందింపకు
తగవును బంతంబు నిజము ధర్మముఁ గృపయున్
మగవారికెగా కెందును
మగువలకుం గలవె చంద్రమండలవదనా. ॥77॥

సీ. హరుని చిచ్చుఱకంట నసమాస్త్రుఁ డీల్గిన | రతిదేవి యెట్లు జీవితముఁ జెందె
బాండుభూపాలుండు పరలోకగతుఁడైనఁ | గుంతి చావక యేమి కుడువనుండెఁ
బ్రథనాంగణమున సౌభద్రుండు చచ్చిన | బ్రతికె నెట్లు విరాటరాజతనయ
సింధురా జస్తమించిన నేల దుస్సల | కాషాయవస్త్రంబు గట్టుకొనియెఁ
గీ. బంక్తిరథుఁ డన్యలోకసంప్రాప్తుఁడైన | నేల కౌసల్య ప్రాణమే నెఱుఁగదయ్యెఁ.
దగవు ధర్మంబు పాడి పంతంబు లెట్లు | భామ లెట్లు వృథానులాపంబులేల? ॥78॥

గీ. అనినఁ జండాలకన్యక యాఁడువారి
మంచితనమును మగవారి మంచితనము
సరియ కీడని మేలని చర్చలేల
మనకు మన యాడికలు తప్పకునికి చాలు. ॥79॥

వ. విశ్వావసుండను గంధర్వరాజునకు మేనకయను నప్సరసకుం బ్రభవించిన ప్రమద్వరయను కన్యక స్థూలకేశాశ్రమవనంబునఁ బాదమర్దితంబగు పన్నగంబు గఱచినఁ బ్రవిలుప్తజీవిత యగుటయు భార్గవుండగు చ్యవనునకుఁ బౌత్రుండు ప్రమతికొడుకు [126]రురుం డాయురర్థం బొసంగి యయ్యంగన బ్రతికించెననియును, నర్జునుం డశ్వమేధాశ్వానుసారియై యాత్మజుండగు బభ్రువాహనునిచేత నాహవాంగణంబున (నతినిశాత) శరాహృతప్రాణుండైన నులూచి యను నాగకన్యక రసాతలంబుననుండి యేతెంచి (యుపచరించి) యుపగతప్రాణునిం జేసెననియు

విందుము. మంచితనంబు లాఁడువారికి మగవారికి సరియ యద్ది యటులుండె నా పంతంబు వినుము. ||80||

ఉ. నాకు మనంబునిండ నొక నమ్మిక సేయుము (సర్వకాలమున్)
గైకొనువాఁడ [127]నిన్ నను ము కాదన కెక్కడకైన వచ్చెద
న్నీ కొకటయ్యెనేని యవనీసురమన్మథ నిర్విశంకత
న్నాకముఁ జూఱ[128]వెట్టెద ధనంజయతీవ్రశిఖాముఖంబునన్. ||81||

వ. అనిన విని సంతోషించి సుకుమారుండు. ||82||

సీ. కలహంససంపద గల కలక్రేంకార- | కలకలంబైన యీ కొలను సాక్షి
ప్రసవసౌరభనటద్భృంభరంబైన యీ | [129]ఫలినీలతామంటపంబు సాక్షి
ప్రచ్ఛాయశీతలోపరిభాగమైన యీ | శశికాంతమణిశిలాస్థలము సాక్షి
తరులతాగుల్మసంతతపిధానాతప- | వ్యాపారమైన యీ వనము సాక్షి
గీ. మకరకేతను పాదపద్మములు సాక్షి | రతిమహాదేవి జఘనభారంబు సాక్షి
సత్య మెన్నఁడు నినుఁ బాయ సమ్మతించి | కౌగిలింపఁగఁ నీఁగదే కమలవదన. ||83||

వ. అనినఁ జండాలి కరారవిందంబులు [130]మొగిడిచి సవినయంబును *(సగౌరవంబును) సానురాగంబునుగా నతని కిట్లనియె. ||84||

ఉ. నేఁడు గృతార్థులైరి జననీజనకుల్ ఫలియించెఁ బుణ్యముల్
నేఁడు పురాకృతంబు లవనీరుహమూలనివాసియైన కా-
ట్రేఁ డిలు[131]వేల్పు నేఁడ యొనరించె మనోరథద్ధిసంపదల్
నేఁడుగదా (సువార మిది నీ కృపఁ) గంటి ధరాసురోత్తమా. ||85||

ఉత్సాహ. మలుసమర్త నంటకుండి మాలదాన నగుట నేఁ
గలయ [132]నీళ్ళనాడి కడవ గ్రంత యంటుకొనుటకై
కొలనఁ గ్రుంకిపోవుచుండి కుసుమబాణనిభుని ని-
న్నలఘు(తేజు) లోచనంబు లలరఁ జూచి వలచితిన్. ||86||

గీ. ఏమి సేయుదు నీకు నెట్టిత్తు నన్నుఁ
[133]బచ్చిముట్టునఁ గలుగు బీభత్స మెఱిఁగి
[134]యిచ్చగింపక యుండ నేనెట్లు నేర్తు
నధికతరమైన మన్మథాయత్తు నిన్ను. ||87||

వ. అనిన సుకుమారుండు చండాలకన్యక కిట్లనియె. ||88||

శా. ఏమాసించినఁ బ్రాణరక్షకయి యేమేఁ బాపముల్ సేసినన్
భామా చెల్లుఁ బురాణసంహితలఁ జెప్పన్ విందుమే కాదె వి-
శ్వామిత్రుం [135]డెడరైనచో శునకమాంసంబున్ భుజింపండె నీ
వ్యామగ్రాహ్యకుచంబు లంటి యిదె [136]నా ప్రాణంబు రక్షించెదన్. ||89||

వ. ఇదె యెదుర (ససంభ్రమభ్రమద్భ్రు)మరకుల చరణనఖశిఖాశిఖరవిశీర్యమాణ కుసుమకేసరరేణు త్రసరేణువిసరపిశంగితోపకంఠంబు లతామండపం బిదె వెనుకఁ గుటిలశుకత్రోటికోటివిపాటిత మధురఫలరసధారాసార దుర్దినాయమానాభ్యంతరప్రదేశంబు చూతతరువాటికాభ్యాశంబిదె కెలన

మదకలమల్లికాక్షపక్ష[137]పాళీనవపవనసంపాతకంపమాన కమలకేసరపరాగధూళీవిరచితాళీక సంధ్యానుబంధచకిత చక్రవాకనీడోద్భవక్రీడానీడంబులు, సరససైకతవేతసీనికుంజక్రోడంబు లిందు నీకు నింపు వుట్టినట్టియెడ నన్ను మన్నింపు మంటకున్నదానననిి భయంబందకు కుసుమసమయంబు గదా ఫలావాప్తికి మూలంబింకఁ గాలక్షేపంబు చేసితేని కందర్పుండు దర్పాతిరేకంబున భవద్భ్రూవల్లీమతల్లికిం దల్లియగు [138]నించువింటిం బద్ద దిగిచి కొదమ తుమ్మెదఱెక్కఁగఱిగట్టిన పూమిట్టకోలల హృదయం బుద్ఘాటించి చంపుఁ జంపకకుసుమగంధీ ప్రాణంబు రక్షింపుమిదె నీకు సేవాంజలి యని కంకణఝుణఝుణత్కారంబు తోరంబుగా సుకుమారుండు నఖకిరణపరంపరాకుసుమ కుట్మలాభిరామంబులగు కరకిసలయంబులు మోడ్చి ఫాలభాగంబునం గీలించిన. ‖ 90‖

శా. వాలాయంబుగ నద్ధరాసురుఁడు దన్ వాంఛించినన్ మందహా-
సాలంకారమనోజ్ఞమైన ముఖ మొయ్యన్వాం[139]చి చండాలి యా
లీలా[140]భావము కీలెఱింగి నవమల్లీకుంజమధ్యంబునం
గేలీతల్పముఁ దీర్చెఁ[141]బో మృదులకంకేలీప్రవాలంబులన్. ‖91‖

వ. అనంతరం [142]బధరీకృతకుసుమాయుధరూపసంపన్నుఁడగు నవ్వసుధానిలింపుం డపహసితసురసిద్ధగంధర్వవిద్యాధర లీలావిలాసినీవిలాసవతి యగు నవ్వెలివాడచేడియం గూడి సురతసౌఖ్యం [143]బనుభవించె నంత. ‖92‖

ఉ. కాయజవిక్రియం [144]బడఁగఁ గానికులంబున సంభవించి య-
న్యాయము సేయునే యిటు దురాత్ముఁడు వీఁడు [145]త్రపాభిమానముల్
మాయఁగఁదట్టి యంచు నతిమాత్రము లజ్జితుఁడైన కైవడిం
దోయజషండబాంధవుఁ డధోముఖుఁడయ్యె నభోఽంగణమ్మునన్. ‖93‖

గీ. గగనయానవేగంబున గలమరించి
కడుపునిండంగఁ గ్రోలిన కమలమధువుఁ
గ్రక్కెనో నాఁగ గగనమార్గంబునందు
భానుబింబంబు రక్తాతపంబుఁ గాసె. ‖94‖

శా. వ్రాలెం బశ్చిమశైలశృంగముపయిం బ్రత్యగ్ర[146]మధ్వాగమో-
న్మీలత్కింశుకకోరకస్తబకకాంతిన్ భానుమన్మండలం-
బాలంబించె మరుండు హస్తమున దాక్షారామలీలావతీ-
భ్రూలేఖానిభవిభ్రమాభ్యుదయముం బుండ్రేక్షుకోదండమున్. ‖95‖

క. క్రుంకె విభాకరబింబము
పంకజషండములు మొగిడెఁ బ్రత్యగ్వీథిం
గంకేలీతరుపల్లవ-
సంకాశచ్ఛాయఁ గొమరుసంజ జనించెన్. ‖96‖

గీ. పద్మినీషండములనుండి పాసి చనియెఁ
గోకమిథునంబు లత్యంతశోకపరతఁ
దోన యేతెంచె భ్రమరసందోహ మపుడు
కంతలోహార్గళంబుల కరణి [147]మొఱయ. ‖97‖

వ. ఇవ్విధంబునం బ్రతీచీకర్ణపూరరక్తోత్పలంబును జక్రవాకచక్రవాళకులచక్రవర్తియునగు మార్తాండుండు లోకాంతరంబున కవతరించిన గ్రమంబున నంబరతటాకవికచకమలినిసంజ మంజుమంజిష్ఠాపరాగసౌష్ఠవంబు [148]సంధించెఁ గృష్ణాగురుపంకవల్లికల యుల్లాసంబు నుల్లసంబాడుచుఁ జిలుపచిలుప చీఁకటి సిద్ధవిద్యాధరనితంబినీజనంబుల చెక్కుటద్దంబులతోడం జరలాడె [149]సాంధ్యదేవార్చనా బలిపిండంబులుం బోలె గగనమండలంబున వెండి[150]తగడుఁ దెగడి క్రిక్కిఱిసి చుక్కలు వొడిచెఁ బురుహూతాంతఃపురపురంధ్రీవిలాసదర్పణంబు దర్పకుని [151]మాటుఁ బొంది చందురుం డుదయగిరిశృంగశృంగాటకంబునఁ [152]బటికంబు గుండు చందంబొందె నప్పుడు చండాల*(కుల)వరారోహ వాహకుం డెక్కి విడిచిన వారువంబుఁ గొదమయుం బోలె సంభోగంబునం దృప్తి చని తనివోవని కౌతుకంబున సుకుమారుఁ గౌఁగిటం జేర్చి యిట్లనియె. ॥98॥

ఉ. అల్లదె వేఁటపల్లె యట నావల మా వెలివాడ యావలన్
భల్లనిపాతమాత్రమునఁ బర్వతనిర్ఝరసింధు వావలం
దెల్లని గోపురంబుల నతిప్రమదావహమైన రోహిణీ-
వల్లభమౌళిభామిని నివాసము (లా మహిత) ప్రదేశముల్. ॥99॥

గీ. ప్రతిభ సతతంబుఁ గొల్తు రా భద్రకాళి
జగతి నేఁబదియాఱు దేశములవారు
దశదినంబులు సింహకేతనము నిలిపి
హూణభూమికి దైవ మీ యుత్పలాక్షి. ॥100॥

వ. నీ వమ్మహాస్థానంబున వసియింపు మేను నీకు నాయావేళలఁ బరిచర్య [153]సేయుచు వంచన బయల్పడకుండ మెలంగెద సర్వకలావిశారదుండవైన నీకుం బ్రాకారగోపురద్వారవేదికా*(ప్రాకార) ప్రఘాణకుట్టిమహట్ట సౌధవీథీవిటంకంబులం గావ్యగోష్ఠీపరిహాసకథా బిందుమతీభిత్తికాప్రహేళికాభావన సుభాషితశ్రవణంబు, వారవిలాసినీదర్శనంబు, వైతాళికస్తుతిపాఠకంబు, దురోదరక్రీడ చిత్రకర్మంబు, వీణాస్ఫాలనంబు మొదలయిన వినోదంబులం [154]బ్రొద్దుపుచ్చం గలిగెడి వెండియు. ॥101॥

క. వెలివాడకుఁ గడుఁ జేరువ
సెలయేటికిఁ బొరువు [155]తాళ్ళుఁ జిట్టీఁదులు నా-
వలఁ దఱచు భద్రకాళీ-
నిలయం బది లెస్స నీకు నెలవు వసింపన్. ॥102॥

గీ. ప్రొద్దు వోకుండ [156]ముందటఁ బొదమ నీవు
కాళికాస్థానమునకు నీ [157]కాలిత్రోవ
విప్రగృహమున నీకు నే విందొనర్తు
ధర్మమిషమున నింటిపెద్దలకు జెప్పి. ॥103॥

వ. (అని చండాలి) చెలికత్తెయుఁ దానును వేఱొక్కతెరువున నిజనివాసంబునకుం జనియె సుకుమారుడు చెఱువుకొమ్ము దాపలం
బట్టుకొని విపినషండంబు నడుమఁగా బక్కణంబునకు దక్షిణంబు(న వెలివాడ) యొరసికొని పోయి [158]కాలిత్రోవం జని సెలయేఱు గడచి ముందట. ॥104॥

సీ. [159]బ్రహ్మ యెక్కెడి జాలపాదంబునకుఁ గేళి- | వసతియైన సరోజవాటితోడ
నైంద్రవాహనమైన యైరావణగ(జంబు | నోరూర్చు మోకయిందువులతోడ)
వైష్ణవరథమైన వైనతేయున [160]కాఁగ | నిరవైన ప్రాకారపరిధితోడఁ
గౌమారయానశిఖావళంబునకుఁ దాం- | డవమాడ సొబగైన గవనితోడ
గీ. వేడ్క [161]మాహేశుఁడెక్కెడి వృషభరాజు | దాఁక నిల్చిన కేళిభూధరముతోడ
సకల[162]శక్తినివాసమై చాలనొప్పు | చండిభవనంబు పొత్తెంచె సచివసుతుఁడు. ||105||

మ. [163]తన దౌశ్శీల్యము తా నెఱుంగుట వెలిన్ దౌదవ్వులన్ నిల్చి దు-
ర్జనుఁ డాతండు లలాటభాగమున హస్తద్వంద్వమున్ మోపి యొ-
య్యన లోలోన నమస్కరించెఁ బటుగర్వారంభసరంభశుం-
భనిశుంభప్రధనక్రమప్రకటబాహాకేళికిం గాళికిన్. ||106||

ఉ. మాలెత విందు బ్రాహ్మణకుమారుడు పక్కణవాసి వేణుకం-
డోలమునందుఁ దెచ్చిన గఠోరితచంద్రిక నిర్ఝరాపగా-
కూలమునన్ భుజించి ఘనగోపురవేదిక నిద్రవోయె న-
య్యాలరి బ్రాహ్మణుండు తుహనాచలకన్యకయాశ్రమంబునన్. ||107||

వ. మఱునాఁడు ప్రాతఃకాలంబున నిర్ఝరాంధఃప్రవాహంబున నవగాహనంబు చేసి కపటసంధ్యావందనంబును గృతకజపంబును (మిథ్యా)సూర్యోపాస్తియు నడపి బ్రాహ్మణ[164]బ్రువుండు. ||108||

సీ. దంతిదంతార్గళస్తంభభారముతోడ | రాజిల్లు ఘనగోపురములు సూచి
గండశైలచ్ఛేదఘటితమై యొరపైన | మేటికొమ్మలతోడి కోట సూచి
యమృతదీధితిలోని హరిణంబు వెఱపించు | సౌధాగ్రసింహధ్వజములు సూచి
యాటమండపముపై నభ్ర ముల్లేఖించు | జాంబూనదత్రిశూలంబు సూచి
గీ. చమురుగా(కులు కుసు)మగుచ్ఛములు వోలె | సకలశాఖోపశాఖల సంశ్రయింపఁ
బుష్పితాశోక[165]పాదపంబులునుఁ బోని | నింబములు సూచి యతఁ డద్భుతంబు సెందె. ||109||

ఉ. కాళికదివ్యమందిరము (కట్టెదురం బశుకంఠ)నాళకీ-
లాలరసంబు గ్రోలు నభిలాషమునం జనుదెంచియున్న వే-
తాళగణంబు వోలె నతిదైర్ఘ్యమునన్ దివి దాఁకియున్న హిం-
తాళవనంబు గన్గొని యతండు మహాద్భుతమందె నాత్మలోన్. ||110||

ఉ. పైపయి గర్భగేహమునఁ [166]బన్నికమీఁటి వెలుంగు మాలికా-
దీపశిఖాప్రరోహములు దేఱగఁ జూచి యనుస్మరించె లో-
నా పృథివీసురుండు మహిషాసురమస్త(కశోణితార్ద్ర)దు-
ర్గాపరమేశ్వరీపదనఖంబుల [167]రూపము సంవదించినన్. ||111||

గీ. [168]సదనవనవాటికానికుంజములయందు
నెలుక లధరోష్ఠసంపుటంబులు గదల్ప
శక్తిమంత్రాక్షరంబులు జపముసేయు
నవియువలె నున్న నద్భుతంబందె నతఁడు. ||112||

సీ. మంత్రవాదులతోడి మైత్రి సంపాదించు | యంత్రవాదులఁ గని యాదరించు

సిద్ధయోగీశ్వరశ్రేణి సంసేవించు | ధా(తువాదులకు వం)దనము సేయు
కదలి [169]వశ్యాశ్చర్యకథ లెఱుంగఁగఁగోరు | బిలము సాధింప నపేక్ష సేయు
బహుదేశభాష లభ్యాసింప వాంఛించు | శల్యతంత్రముమీఁదఁ జాఁపు మనసు
గీ. (ఘుటిక కట్టఁగఁ) బెన్నిధి [170]గుద్దలింప | నింద్రజాలంబు వన్నంగ నిచ్ఛగించుఁ
[171]గట్టిభవనములకు సురంగములు ద్రవ్వ | నేర్చుకొనుఁ బ్రత్యహంబును నీచబుద్ధి.
||113||

చ. [172]బతిచెడి మాంసభుక్తి మధుపాన జనంగమవంశ భామినీ
రతిఁ బరతంత్రుఁడై నడుపుఁ [173]బ్రత్యయమున్ ధరియింపుచుండు న-
ప్పతితుఁడు గంగమట్టియయుఁ బ్రన్నని నున్నని నీరుకావిదో-
వతులును (బ్రహ్మసూత్ర)ములు వంశ్యులయిండ్ల [174]భుజించు కోరికన్. ||114||

గీ. మాధుకరభిక్షలను స్వయంపాకములను
సత్రభోజవములఁ బిత్రుశ్రాద్ధములను
విందులను దేహయాత్ర గావించు నతఁడు
వేదశాస్త్రపురాణప్రవీణుఁ డగుట. ||115||

సీ. నీరాట నెపముగా నిర్ఝరంబుల కేఁగి | సవిధవానీరకుంజముల [175]నొండె
భూధరంబుల కిప్పపువ్వు దే ననిపోయి | కందరామధ్యభాగముల [176]నొండె
[177]శిశిరభూధరకన్య సేవింప ననిపోయి | [178]నక్తమాలముల నెన్నడుమ [179]నొండె
కలమ సస్యక్షేత్రములకుఁ గూళ్ళొగి మోసి | శణవాటికాప్రదేశముల [180]నొండె
గీ. నెట్టు [181]కనుఁబ్రామి వచ్చునో యింటివారి | [182]నెట్టు (వెరవదొ యొం)టిమై నిక్క కరుగ
నతివ పగలైన మాపైన నతనితోడ | నిచ్చ [183]నొకసారి సాగించు నిధువనంబు. ||116||

వ. [184]ఒక్కనాఁ డక్కనిష్ఠవర్తనుండు పక్కణశబరులం గూడి కరిక్రవ్యాదంబు(లగు కుక్కలం బట్టు)కొని ప్రత్యుషఃకాలంబున విపినవీథుల [185]నీవారభసలవిఘటితసరఃకమలషండసౌరభోద్గారభరిత దిక్కటాహంబు కరటిమార్గం బిదె, విదళితసమస్తముస్తాశకలసారంబు వరాహయూథపథం బిదె, కఠిన[186]విషాణకోటివిభిద్యమాన వల్మీకధూళిపాళికానిచులిత తరుపలాశంబు మహిషవర్త్మం బిదె, దూర్వాప్రవాళచర్వణ[187]హరిచందన పరిపాండురంబు [188]హరిణమార్గం బిదె, [189]కటుదీర్ఘఘర్ఘరవ్యాక్రోశంబు కర్కరేటుకులకులాయస్థానం బిదె, కహ(కహారా)వంబు, దాత్యూహవ్యూహప్రదేశంబు ననుచు నాఖేటకౌతుకంబున నాఖేలనక్రీడావిహారంబుల [190]నృశంసుండై, ప్రాణిహింస [191]యొనర్చుచు నుండియు. ||117||

గీ. పాపకర్ముండు కాంతారపథమునందు
[192]నదరిపా టొంటినంటి బ్రాహ్మణుల మొత్తి
యవహరించిన విత్త మన్యాయపరత
నంత్యజస్త్రీయుఁ దానును ననుభవించు. ||118||

గీ. ఇవ్విధంబున సుకుమారుఁ [193]డీలు వుడిగి
మాలచిగురాకుఁబోఁడితో మనువు మనఁగ

వచ్చె నొయ్యన మధుమాసవాసరములు
[194]వాసితాశోల్లసత్ఫుల్లకేసరములు. ॥119॥

సీ. కామినీగండూషకాదంబరీధారఁ | బులకించె నారామభూమిఁ బొగడ
చివురాకుఁ జవిచూచి చవిచూచి [195]యెలుఁగించెఁ | బంచమస్వరమునఁ బరభృతంబు
సంఫుల్లకోరకస్తబకాచితంబైన | కొరవిపై [196]భ్రమరించెఁ గొదమతేఁటి
పరిపక్వసహకారఫలరసాస్వాదన- | [197]మదమునం గీరంబు చదువదొణఁగె
గీ. విటవిటీసముదయములు వివిధవిధుల | నుపవనక్రీడ సల్పిరి యుబ్బుమిగిలి
యఖిలజనులకు సంతోష మావహించె | మాసరములైన [198]మధుమాసవాసరములు. ॥120॥

వ. ఇట్లు సకలజనమనోహరంబులగు మధుమాసవాసరంబుల(యందు), [199]నప్పాపిష్ఠుఁడు చండాలకన్యకం దగిలి యొండెఱుంగక లజ్జ యుజ్జగించి మానం బూనంబు చేసి కులంబు పదటం గలిపి శీలంబు పరిత్యజించి దిట్టకూళయై కన్నుగానక కావరంబెత్తి తిరుగుచుండఁ గర్ణాకర్ణి నతని దుశ్చారిత్రంబులెల్ల విని [200]యెక్కడెక్కడ నాడికొనం దొణంగి రంత నెంతేనియుఁ [201]దేటతెల్లయైన యతని దుర్వర్తనంబు ప్రసంగించి ప్రకాశంబుగా నాడుచుండి రంత. ॥121॥

క. క్రూరాత్ముఁ డితఁ డనఁగాఁ
జోరుం డితఁ డనఁగ నితఁ డశుద్ధుం డన దు-
శ్చారుఁ డితం డనఁగా సుకు-
మారున కపకీర్తి హూణమండలిఁ బ్రబలెన్. ॥122॥

వ. అంత నొక్కనాఁ డతండును నదియును బాతాళపంకకలుషంబగు మహాజలధిపూరంబునుం బోలె నంధకారంబు తోరంబై దిక్కులఁ బిక్కటిల్ల బహుళపక్షంబు*(నాఁటి) రాత్రి కాళికాగోష్ఠంబు కెలన జీర్ణోద్యానంబు నడుమ నక్తమాలతరుషండంబులోఁ దార కల్పించిన సంకేతస్థలంబునం దృణకుటీరంబునం గోద్రవ[202]పలాలపర్యంకంబున మదిరోమదోద్రేకసంభవంబైన మదనావేశంబున మనోభవశర [203]సీత్కారంబులనుం బోలె సీత్కారంబులవలనను, బంచబాణమాణిక్యకంకణక్వణితం(బులునుం బోని మణితంబులవలనను, ప్రద్యుమ్నరథరథ్యరాజకీరహేషాకలకలంబులం బోలె కులుకుటెలుంగులవలనను, శంబరారాతినికేతన లీలోద్యానవాటికాతరులతాసంవేష్టనబంధనబులుం బోని యాలింగప్రబంధంబులవలనను, మకరధ్వజోపహార ద్రాక్షాఫలరసపానానుబింబంబులుం బోని చుంబనంబులవలనను, కుసుమకోదండదండయాత్రాసమారంభజృంభమాణ విజయతుత్తుంభగంభీరభాంకారంబులకుఁ దాతలుం బోని ముష్టిఘాతలవలనను, బహువిధోపచారసంపన్నంబైన సురతంబు సాగించి రప్పుడు. ॥123॥

శా. హాలాపానమదాతిరేకమున నయ్యబ్జాక్షి గుంజాఫల-
ప్రాలంబంబు నటింపఁ జూపెను [రతిప్రౌఢిన్ స్వపుంభావమున్]
దాలీగర్భపలాశకల్పితబృహత్తాటంకచక్రద్వయీ
డోలాడోలనముల్ మనోభవభుజాటోపంబు రూపింపఁగన్. ॥124॥

వ. అనంతరంబ. ॥125॥

ఆ.వె. కేలు గేలఁ బెనఁగఁ గాల్గాలఁ బెనఁగంగ
వారు చొక్కి [204]సురతపారవశ్య-
నిద్ర జెంది రపుడు నిశ్వాసమారుత-
ప్రమదములను నట్టి సమయములను. ‖126‖

మ. కనియె నిద్దురవోయె మేలుకొనియెం గర్లుబ్బ గాంధారిప్రా-
ద్దున వానీరము పువ్వు రాల్చు తటి ముత్తో కంకటిం గూడి యొ-
య్యనఁ గోర్కొయ్యలు పశ్చిమాచలము డాయంబోవఁ గాత్యాయనీ-
వనమధ్యంబున బ్రహ్మబంధువు కుటీవాసాంతరాళంబునన్. ‖127‖

వ. మేలుకాంచి తన దౌర్జన్యంబు కారణంబుగా హూణమండలంబునం బట్టిన రట్టుసడి నిమిత్తంబునం దన కచిరకాలంబున గా[ఁగ]ల ప్రాణాభిమానభంగంబు దర్కించి పరదేశంబునకుఁ బోవువాఁడై చండాలిక మనంబునుం దనమీఁదం గల యనురాగంబునుం దెలియు పొంటె తత్కాలంబున మేలుకనియున్నదానితో నిట్లనియె. ‖128‖

క. సడియును రట్టును రవ్వయుఁ
బొడమెన్ నాకిపుడు హూణభూమండలిలో
బడితి[ని] నిట నీ దేశము
విడిచి చనన్వలయు నకృతవిషయంబునకున్. ‖129‖

గీ. మగువ పరదేశమున కేఁగి మగుడి వత్తు
కొంతకాలంబునకు నన్యచింత యుడిగి
యుండు నీ[వు] పుట్టింటియం దోర్పు గలిగి
మరలి రాఁడెట్టు [205]పరదేశ మరిగి మగఁడు. ‖130‖

వ. అని పలికిన నిర్ఘాతపాతంబునకంటె నిర్ఘృణంబైన యమ్మాటకు శిరీషకుసుమసుకుమారంబైన తన మానసంబున నుస్సురంచు పుల్కసి యాననంబు వాంచి నిట్టూర్పు నిగుడించుచు నూరకుండె నప్పుడు). ‖131‖

చ. కువలయపత్రనేత్ర కనుఁగొల్కులయం దుదయించె బాష్పబిం-
దువులు ధరాసురుండు తనుఁ దోడ్కొని[206]పోవ కుపేక్షసేయున-
న్న వదరవిందచక్రమిథునంబు లసహ్యావశాంగజాగ్నిచే
రవులుకొనంగఁ బుట్టిన నిరంతరధూమము సోఁకియో యనన్. ‖132‖

గీ. చామ హృదయంబుమీఁద హస్తంబు వైచె
నతఁడు తనుఁ బాసి యేఁగునో యనెడు భీతి
నుల్లమునయందు వసియించి యున్న తన్ను
వెడలిపోకుండ [207]నడ్డపెట్టెడు విధమున. ‖133‖

వ. అనంతరంబ యా చాండాలి యతని కిట్లనియె. ‖134‖

గీ. ఎట్టు వేగింతు సంసార మిచట నుండి
యేల నినుఁ బాసి యొంటి నా కిచట నుండఁ
గలుగనిమ్ము [208]బంధువులు పెక్కండ్రు నాకు
[209]బంధువు గలండె నాకు నీపాటివాఁడు. ‖135‖

శా. ఇచ్చోటన్ మధుపానగోష్ఠి సురతం బిచ్చోట సంగీతకం
బిచ్చోటం బరిపాటి నీ కలకలం [210]బిచ్చోట మానోదయం
బిచ్చో నంచు భవద్వియోగమునఁ దా నెవ్వారికిం బ్రీతిగాఁ
జచ్చున్ మన్మథవేదనానలమునం జండాలి విప్రోత్తమా. ॥136॥

మ. కరవీరప్రసవచ్ఛదారుణ [211]పయఃకాషాయవస్త్రంబుతో
శరతూలచ్ఛవి యజ్ఞసూత్రములతో జాంబూనదస్ఫూర్తిత-
స్కరమృత్స్నానిటలోర్ధ్వపుండ్రకముతో సాక్షా[212]చ్ఛుకబ్రహ్మతోఁ
దరమౌ నిన్ను మహాత్మ రేపకడ సందర్శించినం జాలదే. ॥137॥

ఉ. ధీరత పూని నీవు పరదేశము వోవఁగ నేను రాక యీ
[213]యూరనె యుంటినే ద్విజకులోత్తమ [214]నిత్యముఁ గాలికాగృహ-
ద్వారవితర్దికాస్థలము దవ్వులఁ జూచినయప్పు డెట్లొకో
కూరిమి పేర్మి గుండియ దిగుల్లని తల్లడ మందునో సుమీ. ॥138॥

సీ. తను నిద్ర మేల్కొలిపిన మాత్రమున జర- | త్కారుండు విడువఁడే ధర్మపత్ని
జమదగ్ని కొడుకుచేఁ జంపింపఁడే భార్య | లవమంత దోష ముల్లమున [215]నిల్ప
[216]యొకమాటి తప్పుగావక యహల్యాదేవి | నక్షపాదుఁడు ఱాయియగుమనండె
స్రుక్కి సన్నంబుగాఁ జూడఁడే కోపించి | సతి నరుంధతి వసిష్ఠర్షివరుఁడు
గీ. తగవు ధర్మంబు పాడి పంతంబు నిజము | పువ్వుఁబోఁడుల యెడ లేదు భూసురులకుఁ
బ్రథమమున నీవు చేసిన బాస నమ్మి | మోసపోయితిఁ [217]గులములో నీసు వడితి. ॥139॥

సీ. పద్మాకరమునకుఁ బసపాడఁ దెచ్చిన | దైవంబు చలము సాధ్యంబుగాఁగ
ననురాగరసము నా మనములో నూన్చిన | నయనేంద్రియములకుఁ బ్రియముగాఁగ
విడువ నిన్నెన్నఁడు విశ్వసింపవె యన్న | నీ సత్యమునకుఁ బున్నియముగాఁగ
నిక్షుకోదండ మెక్కిడి బాణ మఱిఁబోయు | కందర్పునకు మహాఖ్యాతిగాఁగ
గీ. [218]నెపుడు నీవు నను బాసి యేఁగి తపుడె | నీరనైనను నురినైన నెగడినైన
విడుతుఁ బ్రాణంబు [219]లిపుడ నీ యడుగు లాన | పలుమఱునుఁ బెక్కుమాటలు వలుకనేల. ॥140॥

గీ. అనినఁ జిఱునవ్వు నవ్వి నీ మనసు చూడ
నంటిఁగా కేను నినుఁ బాసి యరుగఁగలనె
యిట్టిపట్టున నెవ్వఱు నెఱుఁగకుండఁ
[220]బోవుటయ లెస్స యీ హూణభూమి విడిచి. ॥141॥

గీ. ఎల్లి శ్రీభద్రకాళికి నిద్ధభక్తి
యాత్ర యొనరించి వెళ్ళుద మర్ధరాత్ర
మీ విచారంబు చెప్పకు మెవ్వరికిని
వారిజానన రట్టువడ్డార మిచట. ॥142॥

ఉ. సంగరసవ్యసాచి[221]వరశాస్త్రవిశారదదేశికేశ్వరా
మంగళగీతవాద్యపరిమండిత [222]ముద్రకకుండలీకళా-
భంగురనృత్త భవ్యపరిభాసితసంతతనిర్మలాత్మకా

యంగజసన్నిభప్రథితహాట్టవిశేషమనోజ్ఞవర్తనా. ॥143॥

క. గౌరీవల్లభసేవా-
పారీణ విరాజివిభవభక్తిప్రతిభా-
భారోన్నతదివ్యాంగా
సారసగర్భప్రభావ సర్వజ్ఞనిధీ. ॥144॥

మాలిని. సరససుఖవినోదా సారశైవార్థమోదా
పరమపదవివేకా భానుతుల్యప్రభాకా
ధరణిధరసుధైర్యా దండసంగ్రామశౌర్యా
నిరుపమగుణధామా నిత్యకల్యాణసీమా. ॥145॥

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర *(సకలవిద్యాసనాథ) శ్రీనాథనామధేయ ప్రణీతంబయిన శివరాత్రి మాహాత్మ్యంబునందుఁ దృతీయాశ్వాసము.



[1] ము. వేదప్రోదిత.
[2] తా. జడత.
[3] తా. సఖి.
[4] తా. పంతంబున్ దధుధర్మముం.
[5] తా. సిద్ధించునే.
[6] ము. నేమిగా.
[7] తా. కేవలమతంక.
[8] తా. సరియె.
[9] తా. బంతయున్.
[10] తా. బుద్ధప్రక్రియల్.
[11] తా. దు చిరస్త్రీల.
[12] తా. అష్టమాది తోరంబున.
[13] తా. డవ్యయుఁడు విశ్వకర్తయనుట నిధను.
[14] ము. మొ ... ... నిధిగా. తా. మొగలిపూవిరిసెఁ గాదె
[15] తా. బ్రహ్మోస్మియం చాదురే. ము. మహాబ్రహ్మోహమం.
[16] ము. యటె.
[17] తా. దారెట్టిదో, లహహా.
[18] ము. వారయే.
[19] తా. తో.
[20] ము. మదనసంఫుల్ల.
[21] తా. తో గలియు.

[22] తా. తారహారవిభూష యక్షమాల్యముగ.
[23] తా కంగంప్రేంఖో. ము. కంగప్రక్షా.
[24] తా. బు.
[25] తా. యెమ్మెయిఁ బల్కకున్నాడొ.
[26] ము. యాడుచున్నాఁడొ... గర్వించియున్నాఁడొ శోకించినాఁడొ.
[27] తా. ప్రకారముల.
[28] తా. బరుచై
[29] ము. సిద్ధమ యతనిన్.
[30] తా. వంతుండును.
[31] ము. నిలువరుసఁ.
[32] ము. గనుపట్ట.
[33] తా. నుం.
[34] ము. సమద.
[35] (తాళపత్రములో) ఈ పంక్తులకు చాలినంత స్థల మూరక విడిచియున్నది.
[36] ము. డున్మహా.
[37] ము. లో.
[38] తా. మేసె గుంజె వలువల్ నిర్మోక. ము. మేనఁగూర్చె క.
[39] ము. సమ్మోదమునను జేసె.
[40] ??
[41] ము. డలఁతన్.
[42] తా. వేళ.
[43] తా. దప్పివోవంగ మధురోదకంబు గ్రోలి.
[44] తా. దొండితీగలు.
[45] ము. కలాపి పింఛమై.
[46] తా. నా నిద్రమేల్కని.
[47] తా. వీక్షించె.
[48] తా. సంభావించి.
[49] తా. ఎడన్.
[50] ము. సంతాన.
[51] తా. వొలయ.
[52] ము. దోర్దండంబు.
[53] ము. ఁబాసినట్లు.
[54] తా. నాకృతిన్ తను వినిశ్చలదృష్టియు దేహయష్టియై.
[55] ము. నకులయై యొరయా.
[56] ము. జారు.
[57] తా. మొక.
[58] తా. ప్రావృడ్వేళల వోలె నలినాక్ష పయినీల.
[59] ము. గరము.

[60] ము. శరర్తువువోలె.
[61] తా. యయ్యె.
[62] ము. విస్తృత.
[63] తా. తరళతర.
[64] తా. సంకుపిత.
[65] తా. విధంబున.
[66] తా. సంయతుని.
[67] తా. నిజాంతర్గతంబున.
[68] తా. సంప్రభవమైన.
[69] తా. బ్రాహ్మణులవలన.
[70] తా. నెద్ది.
[71] తా. నాది.
[72] ము. ప్రసంగంబును.
[73] తా. ప్రభావంబున.
[74] తా. నభినవ.
[75] తా. బగు.
[76] తా. శంబళిశంబళీ యరకు.
[77] తా. గాని.
[78] తా. గల పచ్చ.
[79] ము. హరిద్రముఁ దీరపంకముం.
[80] ము. తా. జలధి వెలువడి.
[81] తా. కేకరలోవలీల.
[82] తా. నొప్పు.
[83] తా. దేశమున.
[84] తా. ఆరక్తమైన.
[85] తా. సర్వంబున.
[86] తా. యున్మది భవించి.
[87] తా. యఖిలా.
[88] తా. పుచు.
[89] తా. నిలిచెదనని చనినం గన్యకా.
[90] ము. యరుగుదెంచితి.
[91] ము. సర్వస్వ.
[92] ము. నతి.
[93] తా. సర్వానందంబు లుపరి.
[94] ము. యాన.
[95] ము. పుటముల.
[96] తా. కల్హార.
[97] తా. యయ్యెడి.

[98] తా. రింప.
[99] ము. భక్తిగొనఁగఁ బ్రమోదంబు పారమేదు.
[100] తా. బి.
[101] ము. గలుగ.
[102] తా. పాణచి.
[103] తా. యసమ్మతదృష్టి.
[104] తా. మోహవిలసితం.
[105] ము. యాగ్రహావేశ.
[106] తా. పద.
[107] ము. దొడిగి.
[108] ము. ఏయునప్పుడు.
[109] తా. విధ్వస్తమయ్యె.
[110] ము. వెంబడ.
[111] తా. నిలువ.
[112] [AB. దీని ఛందస్సు హరిగతి రగడకు దగ్గరగా వుంది. కవిరాజవిరాజితము కానేరదు.]
[113] ము. యక్ష.
[114] ము. ముని న్వరియింపు.
[115] తా. లు గలునేర్చునె.
[116] తా. తాంగనలు.
[117] తా. స్థూలశరీరుండను.
[118] తా. నోర.
[119] తా. మరియు.
[120] తా. యగు.
[121] ము. నన్నీగు టెరవె. తా. నీకు నం న్నింన్నుం బరచె.
[122] తా. నైన నిత్తునో యీ శరీర.
[123] తా. నీవు.
[124] ము. నటి.
[125] తా. నిట్లియ కా.
[126] తా. రురుండనువాఁడు తన యాయువందు నర్ధం బొసంగి.
[127] తా. నిన్ననిన.
[128] తా. పట్టెద.
[129] ము. వలని.
[130] తా. మోడ్చి.
[131] ము. వేలుపొచు నొనరించె.
[132] తా. నీళ్ళాడి కడువం గాంతయింటి కొనుటకై.
[133] ము. బంచమని యింటఁ కల్లు బీభత్సునెటఁగి.
[134] తా. యిచ్చగించుకొనుండ నేనెంత నేర్తు.

[135] తా. డెడలైనచో.
[136] తా. నేఁ బ్రాణంబు.
[137] తా. పాధివిక్షేప ప్రభవసంపాత.
[138] తా. నించువిల్లు దెగనిడం దిగిచి.
[139] తా. చె.
[140] ము. భావ మెఱింగి యేగి నతవల్లీ.
[141] తా. బోఁటి మృదుకంకేళి.
[142] తా. బధఃకృత.
[143] తా. బు లనుభవించె నంత.
[144] ము. బడయఁ.
[145] తా. వ్రతాభిమానముల్.
[146] తా. మృద్భాగ.
[147] ము. మెఱయ.
[148] తా. నధిష్ఠించె.
[149] తా. సంధ్యాదేవతార్చన.
[150] ము. తగటు.
[151] తా. మారటం.
[152] తా. పటికంపుగుండు చందంబునుం బొందె.
[153] తా. సేయుదు.
[154] తా. ప్రొద్దుపుచ్చుచుండం గలిగెడు.
[155] ము. త్రాళ్ళు.
[156] తా. ముందరఁ బొదము.
[157] తా. కాలుద్రోవ.
[158] తా. కాలుద్రోవ.
[159] తా. బ్రాహ్మి.
[160] తా. కుఁగా.
[161] ము. మాహేశ్వరంబైన.
[162] ము. భక్తనివాసమై.
[163] ము. తనదౌ శీలము.
[164] తా. ప్రవరుండు.
[165] ము. పాదపంబులను జూచి.
[166] తా. పన్నిన.
[167] ము. డంబుల సంచరించినన్.
[168] ము. సరస.
[169] తా. వనాశ్చర్య.
[170] ము. గుద్దలించు.
[171] తా. గట్టు బాళములును సురంగా విధులను.
[172] ము. స్థితిచెడి మాంస(భోజనము సేసి) యసంగమ.

[173] ము. బ్రత్యహమున్.
[174] తా. భుజించున్ గోరికన్.
[175] ము. నొందు.
[176] ము. నొందు.
[177] ము. (శిఖరీంద్రవర)కన్య.
[178] తా. నక్తతమాల నెన్నడుము.
[179] ము. నొందు.
[180] ము. నొందు.
[181] తా. కనువామి.
[182] ము. నెట్లు (చీఁకటి నొం)టిమై నిక్కకరుగు.
[183] తా. నొకవాలు.
[184] తా. ఒక్కొక్కనాఁడ.
[185] తా. నిదె రభసవిఘటిత.
[186] ము. పాషాణ.
[187] తా. హరిచ్చండపరిపాండురంబు.
[188] తా. హరిణాధ్వం బిది.
[189] తా. కదా.
[190] ము. ఁగృశుండై.
[191] తా. యొనర్చుచు.
[192] ము. నదరిపాటున నొంటి.
[193] తా. డిల్లు.
[194] ము. వాసితాశోకసంఫుల్ల.
[195] ము. యెలిఁగించె.
[196] ము. బ్రమయించె.
[197] ము. ముదమున.
[198] తా. యమ్మాసవాసరములు.
[199] తా. నప్పాపిష్ఠి.
[200] ము. యక్కడక్కడ.
[201] తా. తేటతెల్లంబైన.
[202] ము. పలాశ.
[203] తా. శరాత్కారంబులునుం బోలె.
[204] తా. ము. యితర.
[205] తా. పరదేశి.
[206] తా. పోవ కుపేక్ష సేయు న, న్నవదినప్డు చక్రమిథునంబు. ము. పోక యుపేక్ష సేయ న.
[207] ము. అడ్డుపెట్టెడి.
[208] ము. పెక్కండ్రు బంధులును నాకు.
[209] తా. బంధువుఁడు నాకుఁ గలఁడె.

[210] ము. బిచ్చో, మనోజోదయం.
[211] ము. రజః.
[212] తా. త్తుక.
[213] తా. యూరన.
[214] తా. నిన్నును.
[215] ము. నిల్పి.
[216] ము. యొకమాటు.
[217] ము. కులమునం దీసు.
[218] తా. యెప్పుడేనేని ననుఁ బాసి యేఁగి తపుడు.
[219] ము. లపుడు.
[220] ము. పోవుటయు.
[221] ము. నయ.
[222] ము. మంద్రకరుండలీకళా.

# చతుర్థాశ్వాసము



## ఇష్టదేవతా ప్రార్థనాదికము



తరుణీ[1]సితవిలసన-
జాతశివానూనభక్తిసంపద్గురు వి-
ఖ్యాత[2]నుతకీర్తి సితజీ-
మూత[3]సితాఖిలదిగంత ముమ్మయశాంతా. ||1||

ఆ.వె. అక్కథకుఁడు శౌనకాదులైన మహాము-
నీంద్రులకుఁ బ్రియమున నిట్టులనియె
నట్లు భూమి విడిచి యరుగవలయు నింక
ననుచు మాటలాడు నవసరమున. ||2||

క. తెలతెలవాఱుచు వచ్చెం
బలపలనయ్యెం బయోదపథమునఁ దారల్
[4]కలవింకంబుల కోమల-
కలకలములు చెలఁగెఁ [5]గాళికావిపినమునన్. ||3||

సీ. సంభోగపరిఖిన్నశబరసీమంతినీ- | స్వేదవార్బిందువిచ్ఛేదకారి
విఘటమానాంభోజవిపినషండమధూళి- | పరిమళాసారసంపర్కసురభి
సమదకాంతారకాసరయూథ[6]రోమంథ- | సంభూతడిండీరశకలవాహి
లలితలుంగలవంగలవలీమతల్లికా- | లాస్యోపదేశలీలాగురుండు
గీ. యామినీశేషతుహినధారానుషంగ | జడిమభరమంద [7]సంచారచతురశాలి
యల్లనల్లనఁ [8]బొలుపారె నడవిలోనఁ | గాల్యసంధ్యాసుగంధుండు గంధవహుఁడు. ||
4||

ఉ. క్షోణిరుహాగ్రభాగముల జోకలుగట్టి వనీశిఖావళ-
శ్రేణులు తాండవంబు లొనరింపఁగ మంద్రగభీరభంగి శ-
ర్వాణిగృహంబులోని బలివైభవలీలకు మ్రోసెఁ గంచుని-
స్సాణము మాటిమాటి కనుశబ్దము లీనఁగ గోపురంబు[9]నన్. ||5||

శా. నిష్ఠాసంపద నర్ఘ్యపాణు లగుచున్ విప్రుల్ ప్రశంసింప మం-
జిష్ఠారాగము లంబకంబున నధిష్ఠింపన్ నిలింపాద్రిభూ-
కాష్ఠామధ్యమునందుఁ దోఁచెను శతాంగప్రష్ఠసర్పద్విష-
జ్జ్యేష్ఠుం [10]డప్పుడు నిష్ఠురప్రదరబంహిష్ఠద్యుతిశ్రేష్ఠతన్. ||6||

వ. ఆ దివసంబున. ॥7॥

ఉ. జాతరచేసె బ్రాహ్మణుఁడు చండికిఁ గమ్మని పిండివంటతో
నేతులతోడ మద్దికడ నిర్మలినన్నాముతో రసావళీ-
చూతఫలాళితోడ వరసూపముతో జిఱువాలతోఁడుతన్
[11]నీతులతోడ నప్పు డకనిష్ఠతరంబగు నిష్ఠ పెంపునన్. ॥8॥

వ. నాఁటిరాత్రి *(నిశా)సమయంబునఁ గాలకంఠకంఠమూల కాకోలవిషమషీ కళంకచ్ఛాయాసముల్లాసంబు *(నుల్లసనంబు) నుల్లసంబాడు నిబిడాంధకారంబున [12]నన్నెలవు గదలి చండాలియుం దానును సుకుమారుండు దుర్గమాటవీ[13]విషయంబు హూణదేశంబు గడచి ప్రతిదినప్రయాణంబుల నెడనెడం బక్కణ (గ్రామఘోషంబుల భిక్షాహార గోరస క్షౌద్రంబులనుం గందమూలంబులనుం గర్కంధూ [14]లికుచ కదలీ చూత మాతులుంగ లవలీ జంబూ తాల తిందుక ద్రాక్షాఫలంబులను శరీరయాత్ర నడుపుచు గంధసింధురఘటాకరటఫలక తటగళితమదజలాసారధారాసారిణీసంపర్క చంద్రకిత[15]బంధకిని యగు సింధురనది యుత్తరించి, యుత్తరాభిముఖుండై జంబూద్వీపవిశ్వంభరానితంబబింబ జాంబూనదమేఖలాపాశంబగు కాంభోజదేశం బతిక్రమించి, యభ్రంకష విశంకట శిఖరోత్సేధ బహులమహీధరస్కంధసంకులంబగు కిరాతమండలంబు పొత్తెంచి యందు బృందారకనగర సౌందర్యంబు ధిక్కరించు వైభవాధిక్యంబునం బ్రసిద్ధిగాంచి [కాంచీ]పట్టణంబునకుం జుట్టంబన నవంతికి సామంతంబన మధురకుం బ్రతియన మాయకుం బ్రతిచ్ఛాయనా నయోధ్య కధ్యాహారంబన ద్వారవతికిం బ్రతియన గాశికిం గీసవెలితియన నొప్పు వణిక్పథంబను [మ]హానగరంబు ప్రవేశించి. ॥9॥

ఉ. ఎంతయుఁ గాల ముండెను మహీసురుఁ డప్పురియందు వేదవే-
దాంతపురాణతత్త్వవిదులైన ధరామరు లుద్ధరింపఁగా
శాంతియు దాంతియుం ధృతియు సత్యము శౌచము బాహ్యవృత్తి య-
భ్యంతరవృత్తి ధౌర్త్యమును బాయక యెప్పుడు జెల్లుచుండఁగన్. ॥10॥

గీ. బ్రహ్మపురివాడలో వణిక్పథమునందు
జరిగె సంస్పృష్టిదోషంబు జరభి కతన
నెవ్వ రేలాగువారో యెట్లెఱుఁగవచ్చు
జగతిఁ గల [16]దిజ్యదోష మజ్ఞానకృతము. ॥11॥

గీ. విభవముల [17]వడ్డు పెండ్లిండ్లు విందు వీడు
భోజన ప్రతిభోజనమ్ములను వ్రతము-
లాదిగాఁ గల తిథులందు నతనిఁ గూడి
వ్య[వ]హరించెను వీట బ్రాహ్మణకులంబు. ॥12॥

గీ. నెలత బొమ్మంచు పుట్టంబు నెఱిక గట్టు
కాంత ధరియించు పచ్చనక్షకల బొట్టు
నింతి యొడికంబుగా వాడు నిల్లుబట్టు
వీటి విప్రాంగనలు దన్ను వినుతి సేయ. ॥13॥

సీ. కృపకు నాధారంబు కీర్తి కావాసంబు | దానధర్మముల కాధానకంబు
మూలంబు కాంతి కావాలంబు దాంతికి | నఖిలవిద్యలకును నాలయంబు

మంగళంబుల కిక్క మదవికారములకు | దూరంబు [18]నురువు సాధుత్వమునకు
దావానలము రాగతరుపల్లవములకు | నపలేపతిమిరసంహతికి హేళి)
గీ. [19]పట్టణము బ్రహ్మపురివాడ బ్రహ్మలోక- | మునకు సయిదోడు మోసల మోక్షమునకు
దూషితంబయ్యె సంసర్గదోషకలన | నంటుముట్టునఁ గలుషితంబయ్యె నాడు. ‖14‖

క. తనయల (నిద్దఱి) నిద్దఱు
తనయులనుం గాంచి కాలధర్మమునొందెన్
[20]వనజాస్య [21]గట్టివయసునఁ
దనయుఁడు పరలోకవిధులు తల్లికిఁ [22]జేసెన్. ‖15‖

గీ. ఏమి చెప్పంగ [23]నఱువదియేండ్ల వయసు
ముసలి సుకుమారుఁ డేకాంతమున రమించెఁ
గూఁతు లిద్దఱు బొమలపైఁ గురులు వ్రాలు
నంతమాత్రపుఁ జిన్నిప్రాయంబు వారి. ‖16‖

వ. అంతం గొంతకాలంబునకు వాని దుశ్చేష్టితంబు లెఱింగి బ్రాహ్మణులు *(వానిని) బహివెట్టి యూరు వెడల నడిచి యారూఢపతితుండైన వాని సంసర్గంబునం బుట్టిన దోషంబు బుద్ధిపూర్వకంబు గాదు కావునఁ గొంద ఱుపవసించియుఁ గొందఱుత్తప్తకృచ్ఛ్రంబు లనుసరించియుఁ గొందలఱు కృచ్ఛ్రాతికృచ్ఛ్రంబులు నడిపియుఁ గొందరు చాంద్రాయణంబు లాచరించియు (నెట్టకేలకు విశుద్ధి గావించిరి సుకుమారుండును). ‖17‖

సీ. (చెలికారు లంజనాచల గండ)శిలలకు | యమదూతలకు నభిధాంతరములు
ప్రతిబింబములు కాళరాత్రియామములకు | బుత్రసంతానంబు భూతములకు
నశుభకర్మముల కన్వాదేశములు మౌని- | శాపాక్షరములకు సంగడీలు
[24]కలికాలమునకు డగ్గఱిన చుట్టంబులు | ధూమకేతువులకుఁ దోడునీడ-
గీ. లంధకారంబులకు విందులనఁగ గిరుల- | యందు వర్తించు చెంచుల నాశ్రయించి
మనువు మనెఁ గూఁతులును దాను మహిసురుండు | కొంతకాలంబు మనములోఁ గుత్సలేక. ‖18‖

క. ఎనుబది యేఁడుల వార్ధక-
మునఁ [25]బ్రాజనశక్తి యుడిగిపో దాతనికిం
దినియెడిది పెద్దమాంసము
కొనియెడి[26]యది కల్లు మనసు క్రొవ్వెట్టుడుగున్. ‖19‖

గీ. కాంచె నిద్దఱు సుతుల నక్కామినులకు
వావి వర్ణంబు మాలిన వద రతండు
శాస్త్రములఁ జెప్పఁ[27]బడిన దోషంబు లెన్ని
యన్నియును జేసె నాతఁ డేమనఁగఁ గలదు. ‖20‖

వ. అంత. ‖21‖

క. హేమంతము శరదాగమ-
సామంతము [28]తుహినకణవిసంస్థులశబరీ-
సీమంతము మదనబల-

శ్రీమంతము [29]డాసె భువనసీమంతంబై. ॥22॥

మ. బలసుల్ పండెను దొండముక్కు వడియెం బ్రాసంగుచేల్ పోకమో-
కల పూఁబాళలతావిఁ గ్రోలి [30]పొదలెం గౌబేరదిగ్వాయువుల్
ఫలినీవల్లిమతల్లివల్లరులపైఁ బైపై నలివ్రాతముల్
పొలసెన్ మంచులు రాలె రాత్రికరిణీఫూత్కారవార్బిందువుల్. ॥23॥

చ. కలమవనాళికాకణిశకంటకకోటులచేతఁ జూడ్కి కిం-
పలవటిచెన్ ధరిత్రి తుహినాగమవేళఁ దటాకసారణీ-
సలిలము వాటి పండిన యజాంగలసీమము లెన్ని యన్నిటం
దలమగు సీతు పేర్మి గరు దాల్చిన భావము ప్రస్ఫుటంబుగన్. ॥24॥

క. కలవింక కలకలాకుల
వలభీగర్భములు సౌధవాటములు పురం-
బులయందుఁ దుహిన[31]వేళలఁ
జలి [32]గులగులఁ గూయునట్టి చందంబొందెన్. ॥25॥

క. పెనుఁజలి గడగడ [33]వణఁకుచు
వనదేవత [34]దంతవీణ వాయించెనొకో
యన మోకప్రేంకణంబుల
[35]ననగుత్తుల మొఱసె నలిగణము విపినములన్. ॥26॥

శా. బింబోష్ఠీకుచకుంభభారము లురఃపీఠంబులన్ హత్తి మో-
దంబారన్ మృదుకేళిశయ్యల శుభాంతర్గర్భగేహంబులం
దాంబూలీదళ[36]పూగపూరితముఖుల్ ధన్యాత్మకుల్ శీతకా-
లం బెంతేనియు నిద్రవోదురు నిశల్ సంభోగలీలావధిన్. ॥27॥

సీ. ధనదశుద్ధాంతకాంతాపయోధర[37]భార- | సంవ్యానపల్లవస్రంసనములు
కైలాసగిరికూటకల్పద్రుమాటవీ- | కుసుమగుచ్ఛరజోఽ[38]వగుంఠనములు
చంద్రభాగాసరిత్సలిలవీచీఘటా- | ప్రేంఖోలికాకేళిరింఖణములు
[39]రాఢాపురీహర్మ్యరత్నహేమగవాక్ష- | సంవేశనక్రియాసౌష్ఠవములు
గీ. వలనుగాఁ జంపకారణ్య[40]వాటిఁ దరిసి | కాశి యొరసి కళింగాంధ్రదేశసరణి
దక్షిణము సాఁగెను సపాదలక్షశైల | [41]కటకబంధుఁ డుదగ్దిశాగంధవహుఁడు. ॥28॥

గీ. చలి ప్రవేశించు నాగులచవితినాఁడు
మెఱయు వేసవి రథసప్తమీదినమున
నచ్చుసీతు ప్రవేశించుఁ బెచ్చు పెరిఁగి
[42]మార్గశిర పౌషమాసాల మధ్యవేళ. ॥29॥

గీ. ఇనుఁడు కోదండరాశిమీఁ దెక్కువేళ
నిక్షుకోదండవల్లి యెక్కిడు మరుండు
సమదవేదండసమమహాసత్త్వుఁడయ్యు
జనుఁడు కోదండమును బోలెఁ దనువు వంచు. ॥30॥

గీ. ఇండ్ల మొదలను నీరెండ [43]నీరికలను
ననుఁగుఁదమ్ముఁడు నన్నయు నాటలాడు

నత్తయును గోడలును గుమ్ములాడుఁ గుమ్ము
[44]గాఁచుచోటికి మకరసంక్రాంతివేళ. ॥31॥

సీ. కాశిలోఁ జక్రపుష్కరిణి [45]దుష్కృతశుష్క- | గహనావళీదావదహనజిహ్వఁ
గుక్కుటేశ్వరవరకుండి [46]పిఠాపురి- | నఘతమస్కాండచండాంశుదీప్తి
దక్షవాటంబు సప్తర్షిగోదావరి | కలిదోషపాషాణకులిశధార
గౌతమీతటిని మార్కండేయపురి మ్రోల | దురితాహిసంఘాతగరుడమూర్తి
గీ. నిన్నిటను దీర్థమాడంగ నేఁగుదెంతు- | రఖిలమునులుఁ బ్రభాతసంధ్యాగమముల
గ్రహగణేశుండు కోదండరాశిఁ బాసి | మకరమున కేఁగుదేరంగ మాఘవేళ. ॥32॥

మ. పఱివోయెం దుహినంబు పండె వరి యిప్పల్ వూసె శైలంబుల
[47]గఱివోగట్టెన్ వలరాజు తేఁటియెఱకం గాండప్రకాండంబులం
జఱపించెన్ గ్రహరాజు [48]మాఠరకునిం జక్రాద్రికూటంబునం
దఱిఁ గౌబేరదిగంతరిక్షపథయాత్రాజైత్రతుత్తుంభమున్. ॥33॥

వ. వెండియుం జకోరలోచనల కుచమండలంబులకుఁ గర్పూరఖండక్షోదంబుల మేదించిన చందనానులేపనైపథ్యం బపథ్యంబయ్యె. రథ్యవేగంబున ననూరుసారథి రథంబు ప్రతివిఘట్టనక్షుణ్ణ నక్షత్రక్షోదపాళీ చుళుకితోర్ధ్వాండభిత్తియై యుత్తరాయణంబు గైకొని కులూతశాతోదరీకపోల ముకురబింబంబులం బ్రతిబింబించె. సవ్యాపసవ్యక్రమంబునం జక్రమిథునంబుల నెట్టుకొని బిట్టేసియేసి విసిగి నిల్చి మనోభవుండు నిగిడించిన నిట్టూర్పునుం బోలె నిశాసమయంబుల నిండువెన్నెలలోనం జిన్నిచిన్ని నులివేఁడివడి పొడచూపె. కేదారక్షేత్రంబులం గలమగోపిక లొడికంగా దంచి (సడించిన) నిద్దంబులగు [49]దుద్దుగడు ప్రాసంగుఁబ్రాలు సద్యోమార్జనావశంబున నతిస్నిగ్ధవర్ణంబులై కర్ణాటదేశ[50]తాటంకినీ దశనవజ్రాంకురంబుల కాంతిసంపదలఁ [51]దలపించె. నీహారవ్యపాయంబున నిర్మలంబులై బహుళపక్షప్రదోషంబులయందు దారకంబులు వికచకుముదకోరకంబులు *(కెలంకులఁ) గొలంకులలోనం బ్రతిబింబించి మదకలకలహంసత్రోటికోటీవిఖండి మృణాలదండఖండంబుల భావంబు భజించె. హృదయోత్కంఠాతిరేకంబునఁ గంఠమూలకఠోర కాలకూటవిషమషీ కళంకపంకచ్ఛాయచ్ఛాటా[52]కంఠోక్త భువనరక్షాదాక్షిణ్యుండు దాక్షారామ భీమేశ్వరుండు దక్షిణజలధివేలావలయితంబులగు నేలాలవంగలవలీమతల్లికా కుడుంగక్రోడంబులం గ్రీడించుటకునై సారంగలోచనలుఁ దానును గోరంగి వెడలె. [53]వలవలని మంచుఁ దుప్పర ముసురుజడిం దడిసి జడనుపడి [54]వేగుఁబోఁకల పోఁక పూబాళల పరిమళంబులఁ [55]బుక్కిలించి యుమియుచుఁ, బక్కణంబులలోన నల్లనల పొలుపారు నడవికరువలి యసమసవిషమ కుసుమఫలక్రీడామతల్లికల [56]మల్లు పెనంగి డస్సిన భిల్లపల్లవాధరల గల్లఫలకంబులఁ గ్రొత్త యుదయించు చెమట చిత్తడి యుడిపె. కాశి శ్రీశైల [57]కుంభఘోణ శోణార్క కాంచీ కాంచనసభా కాళహస్తి కురుక్షేత్రాది పుణ్యస్థానంబులం గూపవాపీతటాకకుండికా [58]ప్రస్రవణశ్రోతస్వినులం బ్రత్యూషకాలంబులం బరమర్షిసార్థంబు తీర్థంబాడె నివ్విధంబున మాఘమాసవాసరంబులు వసంతసమయసామంతంబులు జరగుచుండ నా చండాలాది మనుష్యులకు భుక్తిముక్తులు ప్రసాదింపఁజాలి మాహేశ్వరులకు మహోత్సవంబు పాశుపతులకుం బ్రీతి కాలాముఖుల కవలంబంబు మునులకు మనికి జటాధారుల కాధారంబు పరివ్రాట్టులకుఁ బట్టుఁగొమ్మ వేదాంతులకు సంతోషం బాగమికులకు భాగధేయంబు మాంత్రికులకు మనువు తాంత్రికులఁ దావలంబు పౌరాణికులకుఁ [59]బ్రాణం బౌపనిషదుల కుపాయంబు ముముక్షులకు రక్ష శంభునకు విస్రంభస్థానంబు శాంభవికి [60]హృత్కారంబంబు హేరంబునకుం బ్రియంబు

తండువునకుఁ బండువు కుమారస్వామికిం బ్రేమాస్పందంబు భృంగిరిటికిం దంగెటిజున్ను దురితతతరుషండఖండనంబునకు గండగొడ్డలి యఘపటలతిమిర[61]సముదాయాహిమ ఘృణిసంతానంబు సంతాపశాంతికి భాగీరథీప్రవాహంబు శివరాత్రి పుణ్యకాలం బేతెంచిన. ||34||

సీ. ఆ వణిక్పథమున కనతిదూరంబున | గవ్యూతియెడ నుదక్పశ్చిమమునఁ
బర్వతోపత్యకాపర్యంతతటమున | సికతా[62]తినిర్మలక్షేత్రసీమ
మాలూరతరుషండమధ్యభాగంబునం | బ్రస్రవణాపగాపార్శ్వభూమిఁ
గుసుమవాటికలలోఁ గువలయాంభోరుహ- | కుముదమండితమైన కొలనితోడఁ
గీ. గోటతో గోపురములతోఁ గుట్టిమాట్ట- | మండపంబులతో మహామహిమ నొప్పు
[63]నాదిమధ్యాంత నాగేశ మనఁగ నొక్క | పుణ్యతీర్థంబు [64]త్రైలోక్యపూజితంబు. ||35||

గీ. అందు శేషప్రతిష్ఠితుం డమృతదివ్య-
లింగమంగళమూర్తి ఖట్వాంగపాణి
యర్ధశశిమౌళి నాగేశ్వరాహ్వయుండు
ప్రతివసించు ననేకకల్పములనుండి. ||36||

వ. ఆ శివరాత్రి పుణ్యకాలంబున. ||37||

సీ. శివగంగఁ బుణ్యాభిషేకంబు దీర్చిరి | దరి నొనర్చిరి [65]మూఁడు తర్పణములు
ధరియించి రంబునిర్ధౌతవస్త్రంబుల | నాచరించిరి బ్రహ్మయజ్ఞతంత్ర-
మర్ఘ్యాంజలిక్షేపణానంతరమ్మునం | దొనరించి రంశుమంతున కుపాస్తి
గృహదేవతార్చనక్రియ లాచరించిరి | యభ్యాగతులకు నర్హణలు నడిపి-
గీ. రవని[66]సురులెల్ల నాగేశ్వరాలయమున | కేఁగుదెంచిరి ప్రణమిల్లి రీశ్వరునకు
(జాగరమునకు) నాలుగు జాలుఁ బూజ- | [67]కాదిసంకల్ప మొనరించి రభవు మ్రోల. ||38||

గీ. ఆదరంబున సమ్మార్జనానులేప
ధూపపటువాసనలు తైలదీపములును
సంఘటించిరి వివిధసంస్కారవిధుల
బ్రాహ్మణులు నర్హులైనట్టి పౌరజనులు. ||39||

సీ. కాంస్యతోరణమాలికలు సంఘటించిరి | ప్రాసాదగోపురాభ్యంతరముల
రంభాతరుస్తంభసంభారములు సము- | త్పాటించి రొగిఁ బ్రతిద్వారమునను
బూజోపకరణపాత్రీజాత మఖిలంబు | సంస్కరించిరి భస్మసలిలశుద్ధిఁ
గరమొప్పు వృషభపుంగవకేతనంబులు | నిలువంగఁ బెట్టిరి వలభులందుఁ
గీ. గమలనీలోత్పలంబులుఁ గర్ణికార- | [68]మాలతీకుందములు హేమమరువకములు
మల్లికాకింశుకము లపామార్గవకుళ- | పాటలంబులుఁ గూర్చి రపారములుగ. ||40||

గీ. అపుడు సుకుమారకాహ్వయుం [69]డపరసంజ
నేఁగుదెంచెను నాగేశ్వరేశు గుడికిఁ
బుష్పవాటికలోఁ [70]గమ్మపువులఁ గోసి
పొలఁతులకు నిద్దఱకుఁ గొంచుఁబోవఁ దలఁచి. ||41||

క. కుడిచేత మాంసఖండము

[71]లెడకేలను మద్యరససహితమగు కంచుం
గుడుకయు ధరించి మదమున
వడవణఁకులు గొనుచు నతఁడు వచ్చెన్ గుడికిన్. ‖42‖

వ. జన్మాంతరస్థుండు వోలె రూపాంతరగతుండు వోలె నావిష్టుండు వోలె భూతాధిష్ఠితుండు వోలె గ్రహగృహీతుండు వోలె [72]నున్మత్తుండునుం బోలె మదిరామదాతిరేకంబునఁ దన్నుఁ దా నెఱుంగక పరిసరలతాకంటకానుషజ్యమానాంశుకోత్తరీయుండును నజ్ఞాతసమవిషమమేదినీభాగ విన్యాసప్రస్ఖలిత పాదద్వయుండునునై పలితపాండురంబులగు శిరోరుహంబులు విరిసి వీఁపునం బడ నొయ్యనొయ్యన నేతెంచి నిర్లజ్జుండును నిస్నేహుండును నృశంసుండును నగు నక్కర్మచండాలుండు గర్భగేహంబునకుఁ జక్కం గట్టెదుఱ నిలిచి రక్తకమలదళచ్ఛాయంబులగు కన్నులు దెఱచి విఘూర్ణమానతారకంబైన [73]వికారాలోకనంబున నలవోకయుం బోలె నిర్మలస్ఫటికమండపాధ్యాసీనుండును నమృతమయ జ్యోతిర్లింగమూర్తియు ముక్తాఫలధవళకాంతియుఁ ద్రిభువనవందితచరణుండును జరాచరగురుండును నగు నాగేశ్వరుని దర్శించి యమ్మహాదేవు [74]మౌళికపాలమాలికామండన ఖండేందు[75]శకలంబులకు గగనగంగాప్రవాహడిండీరఖండంబులకు నుష్ణీషఫణిఫణాఫలకంబులకుఁ జెలికారంబు సేయం జాలి పాంచజన్యసహోదరంబులన దుగ్ధాంబురాశిహృదయంబులనఁ జంద్రికా[76]శరణంబులన [77]నంగజాట్టహాసచ్ఛేదంబులన మెండుకొనియున్న పుండరీకంబుల పూజ గనుంగొని వెండియు. ‖43‖

ఉ. చాయన భోగిరాట్కటకసన్నిధిదీపిత దీపమాలికా-
చ్ఛాయఁ బురఃప్రదేశమునఁ జాఁగిన నిర్ఝరవాహినీమహా-
తోయము సావి చీర యెగఁద్రోచి చొరంగఁ దలంచె నెంత లోఁ-
తో యని కొంకికొంకి పతితుం డతఁ డాసవపానవిక్రియన్. ‖44‖

గీ. పవనవశమునఁ గేతకీప్రసవధూళి
యంగమున హత్తియుండంగ నాతఁ డపుడు
విమలభస్మసముద్ధూళన మొనరించి
పాశుపతదీక్షఁ గైకొన్న భంగి నుండె. ‖45‖

చ. కలఁగఁగఁ బాఱె నాతని యఘంబులు పంచహృషీకసంభవం-
బులు బహుకాలసంకలితముల్ దవవహ్నిచిటచ్ఛిటధ్వనిం
గలఁగఁగఁ బాఱు పక్షుల ప్రకారమునం దొలుజాముపూజకై
బలుపటహమ్ము లమ్మనుచు భర్గుని గేహమునందు మ్రోసినన్. ‖46‖

వ. ఆ శివరాత్రి పుణ్యకాలంబునఁ బురాణంబులు వినిపించువారును నితిహాసంబులు చదువువారును బంచాక్షరీ పంచబ్రహ్మాది మంత్రంబులు జపించువారును నీలకంఠస్తోత్రంబులు పఠించువారును బ్రాణాయామంబు లనుసంధించువారును బ్రత్యాహారంబులు నడుపువారును [78]బ్రదక్షిణంబులు సేయువారును భస్మోద్ధూళనంబు లొనర్చువారును దురోదరంబుల వినోదించువారును నష్టావధానంబులఁ గ్రీడించువారును వీణ లాస్ఫాలించువారును గావ్యగోష్ఠి సలుపువారును బరిహాసం బాదరించువారును బిందుమతి యభ్యసించువారును బ్రహేళికలు భావించువారును నాడువారునుం బాడువారును మేషకుక్కుట [79]కరేటు లావుక కపింజల యుద్ధంబులు వీక్షించువారును గుబ్జవామన కిరాతబర్బర జరఠమూక

జనవికారంబు లవలోకించువారునై జాగరంబులు సలుపుచునుండిరి. సుకుమారుండును నొక్కించుక యన్నుం [80]దేఱికొని వారిం జూచుచుండె నప్పుడు శివగంగానిర్ఝరజలతరంగ శీకరజాలజనిత జడిమంబులు నందిరోమంథ ఫేనబిందువాహులుం గుమారశిఖికలాప విధూననక్రియాలలితంబులుఁ బశుపతిజటాబద్ధ వాసుకినిపీతశేషంబులు హేరంబగండమండలనిష్యందమాన దానధారాకలుషగంధలహరీ పాణింధమంబులు భృంగిరిటి నికుంభ కుంభోదర ప్రముఖ నిఖిలగణపరిషద్ధూళితభసిత ధూళికావిసరంబులు[81] మాతృకాశ్రవణావతంసకహ్లారకోరక ప్రేంఖోళనప్రక్రియా సమభిహారానుమేయావతరణంబులు మహిసాక్షి గుగ్గులు ధూపధూమకంబులు మాలూరకిసలయామోద మేదురంబులు నగు మహాదేవనిశామారుతంబు లతనిమీఁద బొలుపారి పాతకంబులు దూల రాల్చె నట్టి సమయంబున. ॥47॥

గీ. అర్ధరాత్రంబుదాఁక నయ్యధమవృత్తి
[82]శివనిశావైభవంబు వీక్షించి చనియెఁ
దానకమునకు నది యాదిగా నతండు
విడిచెఁ దొల్లింటి [83]తన నీచవృత్తిబుద్ధి. ॥48॥

వ. అంతఁ గొంతకాలంబునకు. ॥49॥

క. కుక్కలలో శబరులలో
గక్కెర చిమ్మటలలోనఁ గార్కోళులలోఁ
బక్కణము గుడిసె నడుమను
గుక్కిపయిం జచ్చె నతఁడు ఘోరవ్యాధిన్. ॥50॥

క. శ్రీనాగేశ్వరశంభు-
స్థానంబున [84]గిరిశరాత్రి జాగర మలవో-
కైనను గనుఁగొన్నట్టి క-
తానను విగతాఘుఁడై యతఁడు మృతిఁ బొందెన్. ॥51॥

సీ. క్రిమి కంఠకుహరమార్గమున కడ్డము దొట్టి | పెద్దయేనియు బాధపెట్టకుండ
శ్లేష్మ ముద్రేకించి సెలవి రంధ్రమువాయ | మెఱసి నుచ్చిళ్ళు గ్రమ్మింపకుండ
దృగ్గోళకంబులు దిరుగంగఁ[85]బడి దృష్టి | యంధకారంబులో నణఁగకుండ
నెఱిదప్పి యుచ్ఛ్వాసనిశ్వాసపవమాన- | పరివాహగతు [86]లోటువడకయుండఁ
గీ. బరమయోగీశ్వరుఁడు వోలె బ్రహ్మరంధ్ర- | వీథిఁ బ్రాణంబు విడిచె నవ్విప్రకులుఁడు
పుణ్యశివరాత్రి నలవోక వోలెనైన | నురగధరుచెంత జాగరంబుండెఁ గాన. ॥52॥

వ. ఆ కాలంబునఁ గాలకింకరులు మృత్యుదేవతాసహితులై ముసలముద్గర (ఖడ్గ)తోమరాది ప్రహరణంబులతో(డం గదిసి) అతని లింగశరీరంబు వరుణపాశంబుల బంధించుకొనిపోవఁ గణంగిన నవ్వేళ శివదూతలు శివాజ్ఞావశంబున శూలాంకుశగదాభిండివాలపరిఘపరశ్వధ(పాణులై యేతెం)చి దవ్వుల నాకాశమార్గంబున. ॥53॥

ఆ.వె. ఓరి యమునిదూతలార యీ బ్రాహ్మణుఁ
గరుణ మాలి యేల కట్టినారు
విడుఁడు శివుని [87]యాన మృడునాజ్ఞ [88]దాఁటి మీ

రాజు (చెడుట యెఱు)గరా మదించి. ||54||

మాలిని. విడుఁడు విడుఁడు వీనిన్ విప్రునిన్ భాగ్యవంతున్
మృడుఁడు గరుణతోడన్ మిక్కిలిం గారవించెన్
జడుల కొరుల కేలా సంభవించున్ యథార్థం
బడర మఱి మృ(డానీళానుకం)పాలవంబుల్. ||55||

గీ. [89]యజ్ఞదానతపస్స్వానృతాదులైన
పుణ్యకర్మం బొనర్చిన పురుషునందు
నెట్లు సంతోషమండు నర్ధేందుమౌళి
యట్టి సంతోష మితనియం దావహించె. ||56||

వ. అనిన యమకింకరులు శంకరకింకరుల కిట్లనిరి. ||57||

సీ. [90]ఏ కార్యమునకయి యెచ్చోటి కరిగెద | [91]రరుగుఁడు మీరు మహాత్ములార
యితని క్లేశము చూచి యతికృపాపరతమై | పు(రుషార్థ మొన)రింప బూనినారె
హరుకింకరుల మన్న నాశ్చర్యమయ్యెడు | సదసద్వివేకంబు చాలకునికి
భవభక్తులకు నడ్డపడుట ధర్మము మీకు | నేమేల పట్టుదు మీశుభక్తు-
గీ. నితఁడు కలుద్రాగె ఱంకాడె [92]నెఱచిఁ దినియె | నిలిచి మూత్రించెఁ జండాలలలనఁ [93]గూడెఁ
గూఁతు రమియించెఁ దెరువాటు గొట్టెఁ బ్రజలం | జెంచురాజుల సేవించెఁ జెఱిచెఁ గులము. ||58||

సీ. కేలుదోయెత్తి మ్రొక్కెనె పాశుపతులకు | శరణార్థి [94]యనియెనే జంగములకు
ఫాలభాగమునందు భస్మంబు పూసెనే | యఱుతఁ దాలిచెనె రుద్రాక్షపూస
శివమంత్ర ముచ్చరించెనె జిహ్వ [95]తుదయందు | నరిగెనె యెన్నఁడే నభవుగుడికిఁ
బఠియించెనే మహాప్రమథచారిత్రంబు | తిరిగెనే మృడుపుణ్యతీర్థములకు
గీ. [96]దోసములు పెక్కుఁ చేసినఁ జేసెఁ గాని | కాలగళుభక్తి యావంతఁ గలిగెనేని
యడ్డపడ ధర్మమౌఁ [97]గాక యనఘులార | యర్థమే యీ దురాత్మున కడ్డపడఁగ. ||59||

ఉ. ఎట్టుగ నేఁగుదెంచితిరి యిందుకళాధర[98]భృత్యులార యీ
చెట్టదురాత్మునిన్ హరుని [99]చెంతకునుం గొనిపోవువారలై
యెట్టొకొ శంకరుం డొకని నెవ్వనినేఁ గొనితేరఁ బంపినం
బట్టఁగ [100]వచ్చినారొ తడఁబాటున వీని మతిభ్రమంబునన్. ||60||

సీ. అని హేతువులును దృష్టాంతంబులును జూపి | యమ(భృత్యు లియరైరి) యవనిసురుని
నూరకయుండె మృత్యువు నోర్ గదల్పక | భవునిచే మును పడ్డపాటుఁ దలఁచి
వరుణపాశములచే [101]వ్యథితచేతస్కుఁడై | సుకుమారుఁ డెంతేని స్రుక్కుచుండె
నెదురుచూడఁ దొణంగి (రీశ్వరయములును) | తారు పంచినవారు తడయుటయును

గీ. గాలయాపనమునకు నిగ్రహముఁ బూని | శంభుకింకరు లపు డవష్టంభ మెసఁగ
నౌడుగఱచుచు నప్పు డేకాంతముండి | సమధికంబైన సాహసోత్సాహ[102]వృత్తి. ||61||

ఉ. బిత్తరి దండిమాట లిటు ప్రేలెదరే యమరాజుసేవకుల్
చిత్తజవైరియాజ్ఞ యొకచీరికి గైకొనకంచు నుద్ధతిన్
మిత్తిని వారినిం గదిసి నిర్భరభూరిభుజాబలంబునన్
మొత్తిరి [103]యుర్కి బాహువులు [104]మోడిచి పట్టి వృషాంకకింకరుల్. ||62||

క. కడవసముల బ్రహరించిరి
యడిచిరి లాతముల మొత్తి రహివలయములం
బిడికిళ్ళను ఘట్టించిరి
తడఁబడ మృడుభటులు దండధరుకింకరులన్. ||63||

వ. *(ఇట్లు) మొత్తువడి యమకింకరులు [105]శంకరకింకరులకుం బ్రతిఘటింపక సుకుమారుని బరివేష్టించి యమలోకంబున కభిముఖులై యతనిం గొనిపోవం దొణంగి రప్పుడు రుద్రాక్షమాలికావక్షఃస్థలుండును జంద్రార్ధకృతశేఖరుండును భస్మోద్ధూళితలలితాంగుండును ద్రిలోచనుండును [106]నతిప్రమాణకాయుడును నగు నీలలోహితప్రమథుండు కాలాంబుదధ్వానగంభీరంబైన కంఠస్వనంబున నిట్లనియె. ||64||

సీ. పడసె నెవ్వాని కృప బ్రహ్మ బ్రహ్మత్వంబు | విష్ణుండు విష్ణుత్వవిభ్రమంబు
నీరేడుజగములు నెవ్వాని కుక్షిలో | నొక్కఁడొక్కంటితో నొరయుచుండు
నంధకేభజలంధరాది దానవకోటిఁ | గ్రాఁగించె నెవ్వాని కంటిమంట
యామ్నాయశాఖాసహస్రంబు లెవ్వని | నాసికారంధ్రనిశ్వాసధార-
గీ. లమ్మహాదేవు లెంకలమైన మేము | భర్త యానతి నిర్వహింపంగఁ [107]దలఁప
మమ్ముఁ జీరికిఁ గైకోక మదము పేరిట | నెట్టు కొనిపోయెదరు విప్రు నెఱయఁగట్టి. ||65||

ఉ. బుద్ధియ కల్లెనేని కొనిపోకుఁడు ధర్మము సూక్ష్మ [108]మీ యసం-
బద్ధములైన న్యాయములఁ బంతము వచ్చునె [109]మేము [110]దెంపుమై
యుద్ధము సేయఁజాలకయ యోహరిసాహరి నెంత చెప్పిన-
[111]న్నిద్ధరణీతలామరుని నీరు చలంబున మీకుఁ దక్కునే. ||66||

గీ. ఎంత చెప్పిన విన[112]రేమి యీకు మాకు
హరుని యాజ్ఞ[113]య బలవంత మల్పమెట్టు
[114]చాక నొవ్వక మీరు మా కాఁకఁ జెడక
[115]యిద్ధరామరు మాకిప్పు డిచ్చు టొప్పు. ||67||

క. నావుడును యమునిదూతలు
భావభవారాతి[116]ప్రమథవర్గముతోడన్
సేవకధర్మము తగవును
లావును బంతంబు [117]దృఢబలంబును మెఱయన్. ||68||

వ. [118]ఇట్లని పలికిరి. ||69||

క. చత్తుము చెఱఁబడుదుము కడు
నొత్తుము మీచేత నెట్టునుం దగవు మముం
బుత్తెంచిన పతిసన్నిధి
నుత్తర మెట్లిత్తు మాజ్ఞ యుపహతిఁ బొందన్. ||70||

సీ. చర్చించి చూడుఁ డా చంద్రార్ధమౌళికి | యమరాజు నిజభృత్యుఁ డౌనొ కాఁడొ
యభవుఁ డిచ్చినయట్టి యధికార మౌఁ గాదొ | యముఁడు గూర్చున్న ధర్మాసనంబు
త్రిపురాసురాంతకు [119]దివ్యదేహము గాదొ | [120]వేదస్మృతులు తత్త్వవిధిఁ దలంప
శిష్టరక్షయు దుష్టశిక్షయు శూలికి | (ననుమతం బౌఁ గాదొ) యాత్మలోన
గీ. నవకరము లెన్ని యన్నియు [121]నాచరించెఁ | బాపియగు విని నరకకూపమునఁ ద్రోచి
బాధ పెట్టంగవలసిన పట్టునందుఁ | బంతమే విడుఁ డంట యో ప్రమథులార. ॥71॥

ఉ. చచ్చిననేమి మూర్ఛ (నర సచ్చిన)నేమి ప్రహారవేదనన్
నొచ్చిననేమి పండ్లుచెవినోరు కరాంగుళి నేత్రగోళముల్
ముచ్చికనేమి [122]పట్టువడి [123]మొక్కిలి బంధనశాలలోనికిన్
వచ్చిననేమి భృత్యునకు [124]నచ్చిన యేలిక యాజ్ఞపట్టునన్. ॥72॥

గీ. తగవు ధర్మంబుఁ పాడి పంతంబు దెలిసి
యనుపుఁ డీ బ్రాహ్మణుని బాధ లనుభవింప
నొండె దురమున మమ్ము మృత్యువు జయించి
విప్రుఁ గొనిపొండు మాటలు వేయునేల. ॥73॥

క. మీకును మీ పతియానతి
మాకును మా భర్తయాజ్ఞ మన్నింపఁదగున్
[125]వాకోవాక్యమ్ముల వెడ
వాకాట్లం బల్బుజంబు వలవదు సేయన్. ॥74॥

క. అని యమునిభటులు పలికిన
విని శంకరభటులు తద్వివేకంబునకున్
మనమున సంతోషించియు
[126]మనసిజహరు శాసనమును మన్నించుటకై. ॥75॥

సీ. పొడికచ్చడములపైఁ బులితోలు నునుసేలు | కటిభారమునఁ గాసెకట్టు గట్టి
యభినవంబైన రుద్రాక్ష యొడ్డాణంబు | నాభిచక్రములోనుగా భరించి
ప్రిదిలి జాఱకయుండఁ బెనుఁబాప[127]ప్రోఁగులు | [128]శ్రవణభాగమునందు సంతరించి
యల్లిబిల్లిగ జటావల్లీమతల్లులు | గూర్చి పెంపొందఁ గీల్కొప్పు వెట్టి
గీ. భసితధూళిశరీర మధ్యంగమార్చి | యుద్ధవిడిఁ బారిషదయోధు లొక్కఁడొకఁడ
యాయుధంబులు ధరయించి యట్టహాస- | డమరుకధ్వాన సింహనాదములతోడ. ॥76॥

శా. ఆటోపారభటీసముద్భటతరాహంకారబాహాధను-
ర్జ్యాటంకారరవంబు లంబుజభవాండాభ్యంతరంబున్ సమా-
స్ఫాటింపంగ లలాటలోచనభుజిష్యుల్ దండభృద్భృత్యుల
ధాటీసంభ్రమలీలఁ దాఁకిరి వడిన్ ధారాధరాధ్వంబునన్. ॥77॥

సీ. ద్రాఘిష్ఠకఠినదంష్ట్రాదండసంఘట్ట- | కటుఘోరకిటకిటాత్కార మగుచుఁ
జటులఝుంఝూమరుజ్ఝంపాపరంపరా- | సన్నిభఘ్రాణనిశ్వాస మగుచు
[129]వికలతారకచక్రవిభ్రాంతిభీషణ- | స్ఫారచక్షుర్ద్వయీభయద మగుచు

[130]నిటలవీథివిటంకనిర్భరభ్రూకుటీ- | నటనక్రియాటోప[131]పటహ మగుచు
గీ. గాలమృత్యువు శాణచక్రమునఁ బట్టి | చికిలిచేసిన యడిదంబుఁ జేతఁ దాల్చి
జేగుఱించిన మొగముతోఁ జిత్తజారి- | ప్రమథవర్గంబుఁ దాఁకె నాగ్రహ మెలర్ప. ||78||

వ. ఠవణి[132]ఠమరువు ఠమఠమనినదము ఠవణించుచుఁ దచ్చటుల(తర) [133]ఠమామీఠడంబరవిష్కంభము కాష్ఠాకటాహముల నుద్ఘాటింప దినకరకరచ్ఛాయాచ్ఛేదాధిగమమున ధగద్ధగితములగు నిస్త్రింశకుఠారాద్యాయుధదీప్తులు రణలక్ష్మి నివాళింపంగ నపుడు విద్యాధరపన్నగయక్షగరుడగంధర్వాదులు మది నాహ్లాదింపంగ సురముని [134]కుంచె యాడింపంగ నిలింపపదమున భవునిలెంకలు శమనకింకరులును బాహావష్టంభవిజృంభణ మప్రతిహతముగ నొండొరువులఁ దాఁకిన భండనంబు ఘోరంబయ్యెను. ||79||

క. శంకరభటులును నంతక-
కింకరులు మిథఃప్రహార[135]కీలాలసటా-
పంకిలతనులయి కుసుమిత-
కంకేలీతరుల భంగిఁ గనుపట్టి రనిన్. ||80||

వ. అప్పుడు కింకరులయం దొక్కరుండు యముని సన్నిధికిం జని [136]యతని కిట్లనియె. ||81||

సీ. దేవ దేవర యాజ్ఞధృతి [137]నేము దలఁబూని | మృత్యుతోఁ గూడి భూమీస్థలమున
[138]కరిగి వణిక్పథమను పట్టనమునకు | ననతిదూరమున శైలాంతరమున
నడవిలో నొక మృగవ్యాధపక్కణమునం | [139]దరిగి గేహమున గుష్ఠామయమునఁ
జెడిపెకూఁతురు కాళ్ళకడనుండి యేడ్వంగఁ | బంచత్వ మొందిన పాపకర్ము
గీ. బ్రహ్మబంధుని సుకుమారుఁ బట్టి [140]తేఁగ | నభవుదూతలు [141]రానీక యాఁగినారు
మాకు వారికి దురమయ్యె నాకసమున | నెఱుఁగఁ జెప్పంగ వచ్చితి నిత్తెఱంగు. ||82||

వ. అనిన *(విని) కృతాంతుండు సమధికక్రోధావేశవివశస్వాంతుండై యులుంబరుండను సేనాని రావించి యతనితో నిట్లనియె. ||83||

గీ. చను ములుంబర వృషభలాంఛనుని లెంక-
లాఁగినారఁట మనవాండ్ర నాకసమున
నొక్క పాపాత్ముఁ గొనిరాఁగ నుద్దవిడిని
నేఁగి యా జటాధారుల నెగిచి రమ్ము. ||84||

క. గబ్బున [142]నెదిరించిన నొక
దెబ్బగొను(ము నీకు) నెదురె త్రిజగమున నొరుల్
తబ్బిబ్బుగ జంగములకుఁ
బబ్బంబులు పెట్టు ముష్టిపరిఘట్టనలన్. ||85||

గీ. వ్యాధు లష్టోత్తరశతంబు వచ్చుఁగాక
తోడ నేతెంచుఁగాక మృత్యువులు నూఱు
పంపినారము మున్నాడి భటులఁగూర్చి
కాలమృత్యువు గెల్చు శంకరునిహితుల. ||86||

వ. అని పల్కిన వల్లెయని యులుంబరుండు వివిధవ్యాధిమృత్యుపరివృతుండై కదలి యుద్దవిడిఁ దూర్యంబులు మొరయఁ ప్రమథానీకంబుఁ దాకి శస్త్రజాలంబులు నిగుడ్చి పేర్చి యార్చినం గోపించి పంచవదనుభటులు కుటిలభ్రూభంగభూషణంబులగు మొగంబులు జేవుఱింప నట్టహాసంబు చేసి యదల్చి డమరుడిండిమ [143]ఢమఢమధ్వానంబుతోఁ గీనాశకింకరుల ముసల భిండివాల తోమర మండలాగ్ర త్రిశూల పట్టిసంబులఁ బ్రహరించిన విచ్ఛిన్నబాహూరుచరణవక్షః(కటికంఠ)లలాటకృకాటులై విచ్చియు నొచ్చియుఁ జచ్చియుఁ దెరలియుఁ బొరలియుఁ దోఁగియుఁ డాఁగియుఁ (గొంచియు జలించియు) గ్రుస్సియు డస్సియుఁ గందియుఁ గుందియుఁ దారియు (దేరియు) మ్రొగ్గియు డగ్గియు నలసియు సొలసియు [144]వికావికలై దిక్కామొగంబులై యోరుసోరులై [145]గురియై బందబందై భండనంబు విడిచి వలియ(ఁ)బాటి వెళ్ళఁబాఱుచు) *(వెలవెలంబోయి) కృతాంతుని సన్నిధికిం బోయిరి. ఇట జటాధారులు సుకుమారుని బంధనంబు లూడ్చి యతని మున్నిడుకొని [146]హొన్నాళంపుఁ గరాచూరి చాయలం బంటించు మింటితెఱువునం జనిరి. అప్పుడా [147]సుకుమారుండు పుణ్యశివరాత్రివ్రతాలోకనప్రభావంబున. ॥87॥

తాళ రగడ. దవుదొవులఁ గాంచెం గైలాసము తరుణేందుకళాధరుని
నివాసము దశహరి[దవధి]స్థానస్థపుటితధవళచ్ఛాయాచ్ఛేదవిలాసము
ధ్రువమండల[వీథీ]సంరోధిస్థశృంగశృంగాటకవిహర-
త్ఖచరయక్షగరుడగంధర్వ[148]ప్రమదాస్తోమవిహితలీలాపరిహాసము
నవలేపాటోపసముద్ధృటవిఘ్నాధిపదీర్ఘవిషాణప్రఘణన-
వ్యాఘట్టన[[149]హర]పాదాద[ళితస్ఫటిక]ప్రస్థతటధ్వనివిసరము
[150]నవిహితలాక్షాముద్రానిగదవ్యాఖ్యాతాశోకలతాపల్లవ-
[151]యాథాతథ్యవిజిత్వ(ర)నీహారాద్రిసుతాచరణా[ధి]న్యాసము. ॥88॥

సీ. కామధుగ్ధేనుసం(ఘముల) తొట్టులు గాంచెఁ | గాంచెఁ గాంచనరత్నకందరములు
కాంచెఁ గల్పకవాటికాసహస్రంబులు | సిద్ధరసాపగాశ్రేణిఁ గాంచె
బహుహిరణ్మయమహాప్రాకారములు గాంచె | నమలిన(స్ఫటికసౌ)ధములు గాంచెఁ
బ్రబలచింతామణీస్పర్శవేధుల గాంచె | నానావిమానరత్నములు గాంచె
గీ. హావభావవిలాసరేఖావిశేష- | హారి [152]మూర్తుల రుద్రకన్యకలఁ గాంచె
(నంది దోడ్కొ)నిపోవ నర్ధేందుమౌళిఁ | గాంచె సుకుమారుఁ డంబికాకాంతు శివుని. ॥89॥

వ. కాంచి దండప్రణామంబులు చేసి చేతులు [153]మోడ్చి (సుకుమారుండు) నమశ్శంకరాయ, శశాంకమూర్ధాలంకారాయ, [154]త్రిపురపురంధ్రీనీరంధ్ర స్తనకుంభ[155]సముత్తంభిత కస్తూరికాస్థాసకముద్రా ద్రోహిబాహార్గళస్తంభాయ, జంభారిప్రముఖ నిఖిలదేవతాకోటిహాటక కిరీటకోటివిటంక[156]సందానిత మందారమాలికామకరందబిందునిష్యందధారాధౌత చరణారవిందాయ, జలంధరాసురకంధరాపీఠికావిఘట్టనక్రియాగరిష్ఠనిష్ఠురతా శశ్వ[157]ద్విభంగఖట్వాంగపాణయే, పశ్యల్లలాటాయ, మదనమదగదాగదంకారాయ, సంధ్యానటాయ. కరకలితడమరు[158]డాంకారబృంహిత బ్రహ్మాండమండలాయ, చండికాధిపతయే, నిరస్తసమస్తోపాధికాయ, సచ్చిదానందస్వరూపాయ, *(స్వమహామహిమప్రతిష్ఠాయ, నిరుపాధిక నిరవధిక నిర్విరోధ నిరవగ్రహ నిరభిసంధి నిర్భర కృపాసంపత్సుపూర్ణ మేధసే, [159]నృకపాలమాలికాభరణాయ సముద్దండపుండరీక) క్రవ్యాదకృత్తికంధాధురంధరస్కంధభాగాయ, భగవతే ధన్యోఽస్మి!

కృతపుణ్యోఽస్మి! *(నమస్తే నమస్తే) అని పలికి వెండియు. ‖90‖

తాళ రగడ. జయజయ శంకర జయజయ పురహర జయజయ (కరుణా)గుణవరుణాలయ
జయజయ తుహినక్ష్మాధరకన్యాసహచర శాక్వరవర శుభకేతన
జయజయ మందర[160]కుధరోల్లుఠనాసంక్షుభితమహాక్షీరోదన్వత్
జఠరక్రోడప్రభవద్గరళజ్వలనగిళనకల్మాషితకంధర. ‖91‖

వ. అని యనేకప్రకారంబులం బ్రస్తుతించిన సుకుమారుని మీఁదఁ గరుణాకటాక్షవీక్షణంబు లొలయించుచు విరూపాక్షుం డతనికిఁ గామగమనంబును హేమకింకిణీమాలికాసనాథంబును రుద్రకన్యాసహస్ర[161]సంకులంబునునగు దివ్యవిమానం బొసంగి ప్రమథత్వంబు కృపచేసెఁ బుణ్యవంతుల భాగ్యంబునకుం గొలఁది గలదె; యింక నెయ్యది [162]యడిగెద రడుగుండని సూతుండు నైమిశారణ్యనివాసులగు మహామునులకు సవినయంబును సస్నేహంబును సగౌరవంబునుగా విన్నవించిన. ‖92‖

గీ. పరమమునులు సూత్యాహసంభవుని సూతు
భక్తిఁ బూజించి యధికతాత్పర్య[163]గరిమ
భటులు ప్రమథులచే భంగపడుట చూచి
చిన్నవోయి యముం డేమిచేసెఁ బిదప. ‖93‖

మ. కరుణాసాగర శైవశాస్త్రకలనాగాంభీర్యశౌర్యోన్నతా
తరుణీమన్మథరాజపూజితకళా[164]ధర్మక్రియాసంస్తుతా
వరనీతిప్రతిభావిశేషకలనా వాగీశసంకాశ శ్రీ-
తరుణీనాథమనోజ్ఞరూప[165]విలసత్కావ్యార్థసంబోధనా. ‖94‖

క. ధర్మార్థాలయవరగుణ-
నిర్మాణవిశేషవిభవనిరుపమకార్యా
కర్మోత్కటబహు[166]గుణవృత-
నిర్మలసుజ్ఞాన[167]చతుర నిశ్చలధైర్యా. ‖95‖

మాలిని. శతధృతి[168]మతిదీపా సారనిర్మాణరూపా
సతతసుఖవినోదా సామగానప్రమోదా
వితతకవివరేణ్యా [169]వీరశైవాగ్రగణ్యా
యతులబలవివేకా హర్షనైర్మల్యపాకా. ‖96‖

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర *(సకలవిద్యాసనాథ) శ్రీనాథనామధేయ ప్రణీతంబయిన శివరాత్రి మాహాత్మ్యంబునందుఁ జతుర్థాశ్వాసము.

[1] తా. సుర.

[2] తా. తరకీర్తి.
[3] తా. శివాసిత.
[4] ము. కలకలవింకల కోమల.
[5] తా. కాళి విపినములోనన్.
[6] ము. సమ్మర్ద.
[7] ము. చతురసంచారకారి.
[8] ము. బొలుపారు నడవి నడుమఁ.
[9] తా. లన్.
[10] తా. డర్కుఁడు.
[11] తా. నేతుల.
[12] తా. నన్నెలవులం గదలి.
[13] తా. విషయంబునుంగా.
[14] తా. వితికుచ.
[15] తా. బంధకిణియగు.
[16] ము. దిజ్జ.
[17] తా. వడుగు.
[18] తా. ఉరుఉ.
[19] ము. గీ. గ్రామఘోషంబు పురివాడ బ్రహ్మలోక-ము ... ..డు మొగసాల.
[20] తా. వనజాక్షి.
[21] తా. గండివయసున.
[22] తా. దీర్చెన్.
[23] తా. నిరువది.
[24] తా. కలికాలములకు.
[25] ము. బ్రాక్తన.
[26] ము. దిది.
[27] తా. బడ్డ.
[28] ము. తుహినకణవిసంజ్ఞిత శబరీ.
[29] తా. సకలభువనసీమంతంబై.
[30] ము. పొరలెం.
[31] తా. వేళన్.
[32] తా. కులంకుల.
[33] తా. వడఁకుచు.
[34] తా. దండవీణ.
[35] తా. సనగుత్తులు.
[36] ము. భాగ.
[37] తా. భాస.
[38] తా. వకుంతనములు.
[39] తా. రాధరాపురి.

[40] తా. పాళి.
[41] తా. కటకబంధుండు తద్దిశా.
[42] తా. మార్గపౌషమాసంబుల మధ్యవేళ.
[43] ము. నీడికలను.
[44] తా. గాయుచోటికి.
[45] ము. దుష్కరశుష్క.
[46] ము. పీఠపురి శంకాతమస్కాండ.
[47] తా. గరిమందెన్.
[48] తా. మాఠరునిచే.
[49] తా. మద్ది ... పుడుంబ్రాలు నిగనిగడాలు సద్యోమార్గావకాశంబున విశుద్ధస్నిగ్ధవర్ణంబులగు.
[50] తా. తాటంకినుల.
[51] ము. దలంచె.
[52] ము. కుండు భువన.
[53] తా. పలపలని.
[54] ము. వ్రేకలగు పోఁక.
[55] తా. బుక్కిలించుమియుచు.
[56] తా. మల్లువెనంగి.
[57] తా. కుంభకోణ కోణార్క.
[58] తా. ప్రస్రవస్రోతస్వినులం.
[59] తా. ద్రాణం.
[60] ము. హృదయోత్కంఠయు.
[61] తా. సముదయాహి.
[62] తా. వినిర్మల.
[63] తా. నాదిమధ్యంబు.
[64] తా. నాగేశపూజితంబు.
[65] పుణ్యతర్పణములు.
[66] తా. బుధులెల్ల.
[67] ము. నాది.
[68] మాలతీందుక హేమాంబుమరువకములు.
[69] ము. డదరువజ్జ.
[70] తా. గొమ్మపువ్వు.
[71] తా. పెడ.
[72] ఉన్మత్తుండ పోలె.
[73] తా. కేకరాలోకంబున.
[74] తా. మౌళిం గపాల.
[75] తా. శకలంబునకు.
[76] తా. ధవళంబులన.

[77] ము. నంగజాట్టహాసంబు.
[78] తా. అంగప్రదక్షిణంబులు.
[79] తా. నక్రకరలావుక.
[80] తా. తేటికొన.
[81] తా. భసిత దవచితధూళికా ధూళిపాళికాసరంబులు.
[82] ము. శివు.
[83] ము. నీచపువృత్తిబుద్ధి.
[84] ము. గిరిశురాత్రి జాగరములు ... ... నను.
[85] ము. దృష్టియు.
[86] తా. లొంటిబడకయుండ.
[87] తా. యాజ్ఞ.
[88] ము. దాఁట.
[89] ము. అన్నదాన.
[90] తా. ఏ కార్యమునకునై.
[91] తా. అరుగుడా.
[92] తా. సతిని విడియె.
[93] తా. గవిసె.
[94] ము. ననియెనే.
[95] ము. నే ప్రొద్దు.
[96] ము. దానములు, పెక్కుఁ జేసినదానఁ గాని.
[97] తా. గాన.
[98] తా. భక్తులార.
[99] తా. చేరువకుం.
[100] తా. వచ్చినారు.
[101] తా. వ్యథితమనస్కుడైఁ.
[102] తా. మమర.
[103] తా. యుల్కి.
[104] తా. మోడ్చిరి.
[105] తా. శంకరభటులకుం.
[106] తా. అతిప్రమాణోపాయుండును.
[107] ?. దగదొ.
[108] తా. మిట్లు.
[109] తా. యేము.
[110] తా. నగ్గలింపగా.
[111] తా. న్నిద్ధరణీసురోత్తముని.
[112] తా. నేమొ నేము మీకు.
[113] తా. యు.
[114] తా. చాల నొప్పక పరిభూతిఁ జటులపడక.

[115] తా. యీా ధరాసురవరుని మాకిచ్చు టొప్పు.
[116] తా. ప్రముఖ భటవర్గముతో.
[117] తా. కడుఁ జలంబును.
[118] తా. ఇట్లు వలికి.
[119] తా. దివ్యాజ్ఞ యొఁ గాదొ.
[120] తా. వేదస్తుతులు.
[121] తా. నాచరించి.
[122] ము. పట్టపతి.
[123] తా. మొక్కిలి.
[124] తా. వచ్చిన.
[125] తా. వాకోపవాక్యముల.
[126] తా. మనసిజహరు శాసనమున.
[127] తా. ప్రొగ్గళ్ళు.
[128] తా. శ్రవణపాశమునందు.
[129] తా. వికట.
[130] తా. నిటలభేరి.
[131] తా. లటహ.
[132] తా. డమరువు ఢమఢమ.
[133] తా. డమా విరడవాడంబర నిరష్కంధము.
[134] తా. కుంచియ.
[135] తా. కృతరుధిరపటా.
[136] తా. యతనితో నిట్లనియె.
[137] తా. తోడఁ.
[138] ము. ఁజని వణిక్పథమను ఘనపట్టనమునకు.
[139] ము. గుప్తామయంబునఁ గుతిలపడఁగ.
[140] తా. తేర.
[141] తా. రాకుండ నాఁగినారు.
[142] తా. నేతెంచిన.
[143] తా. ఢమఢమ.
[144] తా. పికాపికలై బిక్కామృగంబులై.
[145] తా. గురిగురిలై బండుబండై.
[146] తా. హిన్నాళంబు కరాచోళి చాయలం బట్టించు.
[147] తా. బ్రాహ్మణుండు.
[148] తా. ప్రమథ.
[149] ము. పారద. తా. హపార.
[150] ము. నవిహితరూక్షా.
[151] ము. యాథాతవ్యయ విజిత్వనీహారాద్రి. తా. యాథాతవ్యయ విజిత్వర.
[152] తా. మూర్తులు.

[153] తా. మొగిడ్చి.
[154] ము. త్రిభువన.
[155] తా. సమస్తస్తంభిత.
[156] ము. సంవాసిత.
[157] తా. ద్విఘంగణా లంఘపాణయే.
[158] ము. తాంకార.
[159] ము. వృషాంక.
[160] ము. కందర కంధర.
[161] తా. సంనుతంబును.
[162] ము. (వినవలతు).
[163] తా. గతి యమ.
[164] తా. ధామ.
[165] తా. విలసత్కార్యార్థసంబోధనా.
[166] తా. గణవృత.
[167] తా. వరిత.
[168] ము. విస్ఫురత్పుణ్యగణ్యా.
[169] ము. యతులఫలవివేకా.

# పంచమాశ్వాసము



దయితప్రియసేవక
భూదివిజాశీర్వివృద్ధభూరిశ్రీపు-
ణ్యోదయ సమస్తజనసం-
మోదనసుఖకరవసంత ముమ్మయశౌంతా. ||1||

వ. అక్కథకుం డిట్లని చెప్పె. నివ్విధంబున నుక్కుమిగిలి ముక్కంటి ప్రమథులు ఘంటాహుడుక్కాడమరు ఢాంకారారవంబుగా వెంటాడించి తోలినఁ బలాయితులై (యమ)కింకరులు వసంతకాలకుసుమిత కంకేళీపాదపంబులభంగి పారిషదవీరఘోరత్రిశూలప్రహరణప్రహారంబులం బ్రభవించు క్రొత్తనెత్తురుల జొత్తిల్లుచు నెదురి కేతెంచిన పరివారంబునకుం బాటిల్లిన పలాయనత్వంబునకు జటాధారుల దౌష్ట్యంబునకు దుర్వృత్తుండగు సుకుమారు నుత్త[మ]పదప్రాప్తికిం జిత్తంబున విషాదంబు నొందుచుఁ జిత్రగుప్తు రావించి కృతాంతుం డతనితో నిట్లనియె. ||2||

చ. కవిలియ విచ్చి చెప్పు గణకత్వవిశారద చిత్రగుప్త సం-
భవదశ యాదిగాఁగ సుకుమారుఁడు చేసిన పుణ్యపాపముల్
వివరములైన వేదము[ఖ]విద్యలకుం బదునాలుగింటికిన్
శివుఁడు ప్రబంధకర్తయట నేరక చేసె ననంగ వచ్చునే. ||3||

వ. అనినఁ జిత్రగుప్తుండు కవిలియ సమ్ముఖంబునకుఁ దెచ్చి పాయపుచ్చి జంబూద్వీపంబున నార్యావర్తవిషయంబున వింధ్యాచలోత్తరభాగంబున నైరావతీశతద్రూవిపాశా సింధు[1]వితస్తానదీమధ్యంబున హేమాంగదుం డను రాజు రాజధాని రత్నపురంబున యజ్ఞదత్తుం డను బ్రాహ్మణుని భార్య సుశీలకుం బ్రభవించిన కుమారుండు సుకుమారుండు. ||4||

సీ. జూదంబు లాడెను శూద్రాన్నము భుజించెఁ | గలవారి గృహములు కన్నపెట్టెఁ
గొండెంబు చెప్పెను గురుల నిర్భర్త్సించె | బ్రాహ్మణాచారంబు పదటఁ గలపె
మదిర యాస్వాదించె మాలతొయ్యలిఁ గూడె | గంజాయి దినె [2]నన్యకాంతఁ జెఱచె
వెలవాడయోషిత్తువలన సంతతిఁ గాంచెఁ | గన్నకూతు రమించెఁ [3]గావరమున
గీ. జెంచు సేవించె నిల్లాఱడించుకొనియె | నధిప సుకుమారుఁ డిట్టి పాపాత్ముఁ డనిన
శ్రవణములు మూసుకొనియె హస్తముల యముఁడు | హరహర శ్రీమహాదేవ యభవ
యనుచు. ||5||

వ. కృతాంతుండు గొంతతడవు విచారించి చిత్రగుప్తుం గనుంగొని. ||6||

శా. ఏలా యీ యధమాధికారము పరాధీనత్వదుఃఖాఢ్యమున్

గైలాసంబున కేఁగియుఁ శివుని శ్రీకంఠున్ విరూపాక్షునిన్
త్రైలోక్యాధిపు సంస్తుతించెద మదధ్యక్షత్వచిహ్నాంబు [4]ము
గ్రాలంకారము పాదపద్మమణిపీఠాగ్రంబునం బెట్టెదన్. ॥7॥

సీ. విడువరో [5]యెందేని విహరింపఁ జనుఁగాని | కరవాఁడి ముక్కుల కాకిపిండు
ఖండింపరో వంటకాష్ఠంబులకుఁ గాఁగ | నసిపత్రములతోడి [6]యవనిజములఁ
దోలింపరో వజ్రతుండకీటంబులఁ | బ్రాకారపరిఖాంబుపార్శ్వములకు
నార్పరో ఘటసహస్రాంబుపూరంబులఁ | బ్రబలకుంభీపాకపావకములు
గీ. శాఠ్యముననైనఁ బరిహాససరణినైన | శంభునైనను హరినైన సంస్మరించి
పాపు లేఁగుచునున్నారు పరమగతికి | నారకము (వీడి) యీ యధికారమేల. ॥8॥

వ. అని యాక్షణంబ చిత్రగుప్తాదులతోడం గూడి యముండు విరూపాక్షసందర్శనార్థంబు శివలోకంబున కరుగువాఁడు త్రయోవింశతిసంఖ్యాకంబులైన స్వర్గలోకంబు(లు) గడచి సప్తర్షిమండలంబు లంఘించి మహర్లోకంబు దాఁటి సత్యలోకం బతిక్రమించి సర్వలోకోత్తమోత్తమంబును ద్వాత్రింశత్కోటియోజనవిస్తారంబును జాంబూనదవిమానసహస్రసంకులంబును బహ్వాశ్చర్యధుర్యంబునునగు మహాస్థానంబు ప్రవేశించి బహుయోజనవిస్తీర్ణంబులును నానాద్వారసమంచితంబులును మణితోరణసంయుక్తంబులును హేమరత్నవితర్దికోటిశోభితంబులు దివ్యరత్నవిమానాఢ్యంబులు దివ్యపతాకాచ్ఛత్రవిచిత్రంబులు శాతకుంభస్ఫటికరత్నస్తంభసంభరితంబులు మహాకాళ భృంగిరిటి కుంభకుంభోదర ప్రముఖ ప్రమథగణాకీర్ణంబులు ననంతాశ్చర్యయుక్తంబులునగు దివ్యకక్ష్యాంతరంబులు దఱిసి పూర్వద్వారంబున. ॥9॥

క. [7]సుయశోధీధనకాంతా-
దయితుని భసితత్రిపుండ్రధవళలలాటున్
నయనాభిరామమూర్తిన్
నియతాత్ముని నందికేశునిఁ బొడఁ గనియెన్. ॥10॥

వ. కాంచి దండప్రణామంబు చేసి శైలాది కిట్లని విన్నవించె. ॥11॥

సీ. దర్శింపవచ్చితిఁ దరుణేందుశేఖరు | నఖిలలోకాధీశు నమరవంద్యు
కార్యంబు లెన్నేని గలవు విన్నపము సే- | యంగ (నే) నధికారి నౌదుఁగానొ
[8]నీ శరణ్యుండనై నీవు ప్రతిష్ఠింప | ననఘ యున్నాఁడ ధర్మాసనమున
భృత్యభూతుఁడ నీకు సత్యంబ పల్కెద | నిన్ను దప్పంగ నే[9]నెన్న నొరుల
గీ. ననుచుఁ బ్రియమాడు యమరాజు నాదరించి | నంది శంభుని [10]సన్నిధానమున కేఁగి
మ్రొక్కి హస్తసరోరుహంబులు మొగిడ్చి | వినయ మొప్పఁగ నిట్లని విన్నవించె. ॥12॥

సీ. ఓ జగన్నాథ యో యుడురాజశేఖర | యో కృపాంభోరాశి యో త్రినేత్ర
యో విష్ణుధాత్రాది దేవతాకోటీర | పరిచిత శ్రీపాదపద్మయుగళ
యో జలంధరవైర యో గంధకరికృత్తి- | [11]కంథాధురంధర స్కంధపీఠ
యో నీలలోహిత యో లలాటాంబక- | జ్వలనజిహ్వాదగ్ధశరభచిహ్న
గీ. దక్షిణాశాధిపతి దండధరుఁడు దాను | చిత్రగుప్తుండు దేవర సేవ సేయ
నరుగుదెంచినవాఁడు తే నవసరంబు | ననువుపడ దుండుమందమో యానతిమ్ము. ॥13॥

వ. అని పలికి శివుని ముఖప్రసాదంబు నింగితం బెఱింగి నందికేశ్వరుండు తన్నుం బ్రవేశింపంజేయఁ జిత్రగుప్తసహితుండై చనువాఁడు ముందట. ||14||

సీ. దేవదేవుని పూర్వదిగ్భాగమునయందుఁ | పరమ(మా)హేశులఁ బాశుపతుల
[12]... ... ... ... ... ... ... ... ... ... ... ... | ... ... ... ... ... ... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ... ... ... ... ... ... | ... ... ... ... ... ... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ... ... ... ... ... ... | ... ... ... ... ... ... ... ... ... ... ... ...
గీ. వికటపాటలఘనజటామకుటకోటి- | ఘటిత కుటిలశశాంకరేఖాకలాప
భూషితులఁ జతుర్బాహుల భూరిబలుల | శ్రాద్ధదేవుండు చూచి విస్మయముఁ బొందె. ||15||

గీ. దక్షిణంబున వీక్షించె దండపాణి
యజుని బాండురపుండరీకాసనస్థు
నంగిరోవామదేవకణ్వాక్షపాద
కపిలసనకవసిష్ఠాది గణముతోడ. ||16||

సీ. బ్రాహ్మి [13]మాహేశ్వరి వారాహి కౌమారి | చాముండ యైంద్రి వైష్ణవి యనంగ
మాలతినాఁగ సుబాలికనా బల- | [14]ప్రమథినినా వికరాళి యనఁగ
కాళరాత్రి కరాళికా ప్రచండులనాఁగ | బ్రాహ్మ్యాది మాతృకాపరికరంబు
పార్వతి ప్రముఖబల ... ... ... ... ... ... | ప్రమథనాధిక భూతపరికరములు
గీ. ప్రమథవర్గంబు లయకాలభైరవుండు | పాశుపతములు చండకోపప్రచండ
చండచండార్చులును ఘోరశారభముల | శివుని పడమటి యెడ నిరీక్షించె యముఁడు. ||17||

వ. శంఖచక్రధరుండును పీతాంబరుండును గౌస్తుభోద్భాసితవక్షఃస్థలుండును గిరీట కటక హార నూపుర గ్రైవేయ కంఠికాది నానావిధ దివ్యాభరణభూషితుండును లక్ష్మీసహాయుండునునై పురాణపురుషోత్తముండును, నష్టవసువులును, ద్వాదశాదిత్యులును, సిద్ధ విద్యాధర గంధర్వాక్షిణ యక్ష భుజంగ గుహ్యాకులును మొదలుగాఁ గలవారును మఱియునుం గలవారల హరుని యుత్తరదిక్కునం గాంచి వైవస్వతుం డద్భుతంబందుచు నభ్యంతరమందిరంబు ప్రవేశించి. ||18||

సీ. వేదోక్తమగు క్రియావిధిఁ బాశుపతమహా- | వ్రతదీక్ష గైకొన్న వ్రతులఁ జూచె
విచ్ఛిన్నపాశులై విరహితద్వంద్వులై | విమలాత్ములైన యుత్తములఁ జూచె
[15]నద్వైతతత్త్వవిద్యారహస్య జ్ఞాన- | సంపన్నులగు యతీశ్వరులఁ జూచె
నిగమాంతవివిధోపనిషదర్థ వాసనా- | ఘనులైన యోగిపుంగవులఁ జూచె
గీ. దివ్యసింహాసనాసీనుఁద్రిపురహరునిఁ | [16]బర్వతోద్భవాపరిపూర్ణపార్శ్వభాగుఁ
గాలకంఠునిఁ జంద్రరేఖాకిరీటు | శ్రీమహాదేవు నభవు వీక్షించె యముఁడు. ||19||

వ. వీక్షించి దండప్రణామంబు చేసి నిలిచి చేతులు మొగిడ్చి మహేశున కిట్లని స్తుతించె. ||20||

తాళ రగడ. జయజయ సచరాచరసర్వజగత్సర్గస్థితిసంహారతిరోభా-
[వా]నుగ్రహలీలాపంచవిధవ్యవహారవినోదైకపరాయణ
జయజయ హాటకగర్భకిరీటస్థాపితబహువిధమణిఘృణిపటల-
వ్యతికరకిమ్మీరిత[17]పాదాబ్జద్వంద్వపీఠికోపాంతవసుంధర

అహరహ [18]రహమహమిక యా త్వా మభివందే పృథుగోధివీథికా-
దృగ్ధూమధ్వజజిహ్వా[19]రంహోమ్మృత్కణాయమానప్రసవాయుధ
మహిమానం తవ కో వా స్తోతు[ం] ప్రభవతి విషనిధివిషకల్మాషిత-
కంఠమూలకంఠోక్తాశేషజగత్సంరక్షాదాక్షిణ్యక్షమ
శరణం మమ తవ చరణం భూయాత్సరసిరుహపలాశోదరారుణం
ఫణిధరపరివృఢకాభర[ణాంచిత] పరమకృపాగుణకింకర శంకర
కురు మయి దాక్షిణ్యం ప్రాలేయక్షోణీధరదుహితృస్తనకుంభ-
స్థల(కస్తూరీ)స్థాసకముద్రాస్థగితవిపులవక్షఃపీఠాంతర
హర శంభో విశ్వేశ మహాదేవామరవల్లభ శివ సర్వాత్మన్
నీలకంఠ శంకర వృషభధ్వజ [20]నిటాలలోచన భర్గ పాహి మాం
ధరణీధరకోదండశింజినీదందశూకపరివృఢగుణటాంకృతి-
ధారానిర్భిన్నత్రిపురాసురదారహృదయసంపుట మాం పాలయ
సత్యం జ్ఞానమనంతం బ్రహ్మస్వప్రతిష్ఠిత మాద్య మనాద్యం-
త మనాధారం వ్యోమ్నిపతే [21]సంతతం సమస్తోపాధి ధ్రువమితి
నిత్యం నిత్యవివేకశాలినో నియతా శ్శాంతా నిరహంకారా
ధ్యాయన్తి మహాయోగిపుంగవాఽయం తస్మై భవతే నమశ్శివ
జ్వాలాజాలకరా(ళ)జ్వలనస్తంభరూప మభిబిభ్రతా త్వయా
త్రైలోక్యాతిశయాళు మోహితౌ తామరసాసనకైటభాంతకౌ
లీలాయోర్ధ్వభాగాధోభాగోల్లేఖ కుతూహల [22]హంసపోత్రిణీ
కింపచానవిజ్ఞానవైభవా [23]కే వయం భవ తాం జ్ఞాతుం భ్రమ
స్ఖలితగతి రతద్వ్యావృత్త్యా యం చకితమభిధత్త శ్రుతి రపి రభవాన్
[24]కస్య హి వాచా సంస్తోతవ్యః [25]కతివిధగుణకః కస్య హి విషయః
హర శంభో వృషభధ్వజ శూలిన్ హాలా[హల]ధర శంకర గిరిశే
త్యహరరహ [రహం] పఠామి [ఏతైః] కుఠరాయుధస్థితై ర్భ్వాయో స్థిత
సమున్నతై ర్భ్వాయా చ్చరణాంబురుహ మున్నతం దీర్ఘాయుష్యాయ [మమ]
జటాదిపలాస్తే భూయాసుః మమ
ప్రత్యాసీదతి సంధ్యాసమయే ప్రారబ్ధజగత్సంస్క్రియావిధౌ
దండపాణి చంక్రమణోత్సాహీ తాండవకేళి[26]శీలినః (?) ॥21॥

సీ. హరినీలలింగంబునందు దైత్యారాతి | మణిలింగమున నగ్రమాధవుఁడు
కమలరాగాశ్మలింగమునందు సప్తార్చి | కమనీయరత్నలింగమున నేను
నీలలింగమునందుఁ బౌలోమ్యధీశుండు | కరువలి వజ్రలింగంబునందు
గరుడదానవయక్షగంధర్వకిన్నర- | ఖచరులు లోహలింగంబునందు
గీ. భక్తిఁ బూజించి తమతమ పదవు లొంది- | రేను నా యధిరాజ్యంబు నేలికొంటి
నర్థి నెవ్వని కృపఁ జేసి యట్టి నిన్ను | సంస్తుతించెదఁ జంద్రార్ధశకలమౌళి. ॥22॥

వ. సర్వజ్ఞ [27]సకలసృష్టిస్థిత్యంతకారణవరేణ్య భక్తిగమ్య సకలకల్మషాపహ శ్రీపాదపద్మ వేదాగమపురాణేతిహాససంహితామహాఫలభూత సర్వభూతహృదయస్థిత అఖిలదేవమయ మహాదేవ నీకు నమస్కరింతు. ॥23॥

సీ. ఎవ్వానియందుండు నెల్లభూతంబులు | సింధువునందు వీచికలు వోలె
నెవ్వాఁడు వసియించు నెల్లభూతములందు | నంబువుల్లోలంబునందు వోలె
నెల్లభూతంబుల హృదయంబులందును | వసియించు నెవ్వఁ డాకసము వోలె
నొకఁడు పెక్కై తోచు నుదధిఁ జంద్రుఁడు వోలె | నెవ్వఁ డజ్ఞానమూఢేంద్రియులకు
గీ. పురు(షుఁ)డని బ్రహ్మమని యజ్ఞపురుషుఁడనియు | నర్కుఁడని వాయువని

శక్రుఁడని హరియని
చంద్రుఁడని కొల్తు రాయాయి సరణివారు | భక్తి నెవ్వాని నట్టి నీ బంట నభవ. ‖24‖

వ. ఒక విన్నపం బవధరింపుమా. ‖25‖

సీ. ధర్మాసనమున [28]కాధ్యతఁ గృప చేసితి | [29]దక్షిణాశాధిపత్యంబు నొసఁగి
పాపులం బా(పా)నురూపదండంబుల | దమియించుటకు నియోగము ఘటించి
చనవరిఁ జేసి [30]పంచిననాటినుండియు | నేర్చిన చందాన నియమపరత
దేవరయాజ్ఞ యేదియు వెలిగాకుండ | వర్తిల్లుదును సమవర్తి నగుచు
గీ. నభవ యెన్నండు నా దూత [31]లాటువడరు | భర్గ యెన్నండు నా యాజ్ఞ పలుచఁగాదు
శర్వ సుకుమారుఁ[32]డనెడు దుర్జాతి పుట్టి | చావఁబట్టి యే నష్టకష్టములఁ బడితి. ‖26‖

గీ. అభవ నీ కింకరుండు ఖట్వాంగహేతి
కాలమృత్యువు [33]మునిపండ్లు రాల మొత్త
మూలఁబడియున్నయది ముండమోపి వోలె
నిల్లు వెడలక యది మహోప్రాభరమున. ‖27‖

హరిగతి రగడ. [34]అయయో మొట్టో యబ్రహ్మ(ణ్య)ం [35]బనుచును నాక్రోశించుచు(ను మహా)-
భయవిహ్వాలులై యేతెంచిరి మత్పార్శ్వమ్ములకు మదీయకింకరులు
[36]జయనాద హలా సమధికలీలాసంరంభంబున దేవర ప్రమథులు
పయికొని వచ్చిరి పులికళవసముల [37]ప్రహరించుచు వీఁపుల వెంటాడగ. ‖28‖

మ. అవుఁగాకేమి జగజ్జనిస్థితిలయవ్యాపారపారంగతుం-
డవు నీ లెంకలచేత శిశుఁబడు టెగ్గా మద్భటశ్రేణి కీ
యవినీతాత్మునకై పిశాచమునకై యాభాసదుర్బ్రాహ్మణ-
బ్రువచండాలునకై [38]పెనంబడుటకై భూతేశ సిగ్గయ్యెడిన్. ‖29‖

సీ. ముట్టైన చండాలి [39]ముట్టెనో ముట్టఁడో | యడుగంగరాదె యీ యధమజాతి
నన్యకామినుల ఙంకాడెనో యాడఁడో | యడుగంగరాదె యీ యధమజాతి
త్రావెనో త్రావఁడో [40]తాళ్ళ హాలారసం | బడుగంగరాదె యీ యధమజాతి
గారాపుఁగన్నియఁ గవిసెనో కవియఁడో | యడుగంగరాదె యీ యధమజాతి
గీ. రాజరేఖావిభూషణా! రాజసంపు | [41]తప్పు దండువు లేకుంట తథ్యమయ్యె
నిట్టి పాపాత్ము సర్వలోకేశ్వరుండు | [42]వెనుక నిడుకొన్న మాకు నేమనఁగ వచ్చు. ‖30‖

గీ. ప్రమథు లవనిసురుని మేన బంధ మూడ్చి
వరుణపాశంబు లెచ్చోట వైచినారొ
యరసి తెప్పించు వానిఁ జంద్రావతంస
నాకు నెర విచ్చినాఁ డంబునాయకుండు. ‖31‖

సీ. జలధరంబులనుండి స్రవియించు జలధార | లెన్నవచ్చిననేని యెన్నవచ్చు
గగనమండలిఁ దారకాచక్రవాళంబు | లెన్నవచ్చిననేని యెన్నవచ్చు
భాగీరథీమహాపగలోని సికతంబు | నెన్నవచ్చిననేని యెన్నవచ్చుఁ

గలశపాథోరాశికల్లోలమాలిక | లెన్నవచ్చిననేని యెన్నవచ్చుఁ
గీ. గాని నరునకు నెన్నశక్యంబుగావు | పాయకీతండు చేసిన పాతకములు
భర్గ యేమని విన్నపింపంగ నేర్తు | నిట్టి పాపాత్ముఁ బొడఁగాన [43]మెన్నఁడేని. ||32||

గీ. ఎన్ని శాస్త్రంబు లీక్షించియేని నేరఁ-
డెట్టి విద్వాంసుఁడైన నర్ధేందుమౌళి
యితఁడు చేసిన పాతకం బింతటిదియ
[44]యనఁగ దానికి నిష్కృతి యాచరింప. ||33||

గీ. [45]అపరతంత్రుండవని చెప్ప నాగమములు
నిగమములు నీక చెప్పుదు నీలకంఠ
యీ దురాత్ముని కతన నీ కెఱుకపడితి
[46]నపరతంత్రుండవైతి మా కందఱకును. ||34||

వ. అని దండప్రణామంబు చేసి కరకమలంబులు మొగిడ్చి నిలిచియున్నఁ గనుంగొని మందస్మితసుందరవదనారవిందుండై యిందుధరుం డిట్లనియె. ||35||

సీ. మకరరాశిస్థుఁడై మార్తాండు డుండంగ | సమకొన్న మాఘమాసంబునందు
సితచతుర్దశినిశి శివరాత్రి యను పేరం | బ్రఖ్యాతిగనిన యా రాత్రియందు
[47]నట్టి నాళ్లాలును నవధానపరత[48]మై | జాగరవ్రతచర్య జరుపవలయు
నా జాగరవ్రతం బనఘప్రాజాపత్య | సత్ఫలం బీనోపు సాధకునకు
గీ. నవనిసురుఁడాది చండాలుఁ డాదిగాఁగ | నీ వ్రతము సేయఁగా నర్హు లెల్లవారు
నన్ని చందాల నీ వ్రతం బలఘుఘోర- | పాతకంబుల నెల్లఁ గాల్పంగఁ జాలు. ||36||

శా. జ్ఞానాజ్ఞానకృతంబులయ్యుఁ బశుహింసాబ్రహ్మహత్యాసురా-
పానస్తేయము లాదిగాఁ గలుగు పాపంబుల్ దహించున్ నిమే-
షానన్ శంభునిశావ్రతంబు ప్రబలజ్వాలావృతం బగ్ని [49]యె-
ట్లేనిం గాలుచు నార్ద్రశుష్కముల నొక్కిం తిధ్మభారంబులన్. ||37||

వ. ఈ సుకుమారుండు. ||38||

గీ. మకరరాశిస్థుఁడై (యంశుమాలి) యుండ
మాఘ(కృష్ణ)చతుర్దశి (మధ్య)రాత్రి
నన్నుఁ (బూజింప) [50]వీక్షించినాఁడు జను(లు)
(నట్టి)(కతమున) (పు)(ణ్యాత్ముఁ)డయ్యె నితఁడు. ||39||

వ. అదియును. ||40||

గీ. కూతుఁ జండాలి నాలిఁగాఁ గోరి రాత్రి
పుష్పములు గోయ నేతెంచి పువ్వుఁదోట
పార్శ్వమున నుండఁ గాంచె నా భక్తజనులు
నన్నుఁ బూజించి జాగరణ(ంబు) సేయ. ||41||

సీ. తీర్థమాడింపంగ దివ్యాంబరము గట్టి | చందనం బలఁదఁ బుష్పములు పూన్ప
ధూపంబు లర్పింప దీపంబు ముట్టింప | ఘంట వాయింప శంఖంబు లూఁద
నైవేద్య మొసగంగ నాగవల్లీపూగ- | మునఁ [51]కప్పురంబు దాంబూల మిడఁగ

నద్దంబు సూపంగ నాలవట్టము ద్రిప్ప | సురటి వట్టంగఁ జామరము వీవ
గీ. బహువిధ[52]స్తుతులు పఠియింపంగ వినియుఁ | గోయతనమునఁ బువ్వులు గోయవచ్చి
చూచి శివయామినీవ్రతస్థులను నన్నుఁ | దత్ఫలంబున గణపతిత్వంబు నొందె. ॥42॥

వ. వేదసారంబున శివునిం బూజింపుచు శివరాత్రివ్రతంబు చేసి (బ్రహ్మ) బ్రహ్మత్వంబు నొందె. విద్యాసారంబున శివునిం బూజింపుచు శివరాత్రివ్రతంబు చేసి వసురుద్రాదిత్యులు దేవత్వంబు గైకొనిరి. రాజసూయసహస్రంబును నశ్వమేధాయుతంబును గపిలధేనుకోటిదానంబును బుణ్యక్షేత్రనివాసంబును దీర్థావగాహంబును నొనర్చిన ఫలంబు కోటిగుణితంబై సుకుమారునకు సిద్ధించె. ఇతండు సర్వతపస్వులకును నిఖిలపుణ్యావంతులకును సకలభాగ్యాధికుండు. వణిక్పథంబునఁ గల్పాంతపర్యంతం బనేకభోగం(బు ల)నుభవించి కాలాంతరంబున దధీచుండనం (బరఁగు) మాహేశ్వ[రుండై] భూమియందు జన్మింపఁగలఁడు. ఇట్టిది శివ[రాత్రి]పుణ్యవ్రత మాహాత్మ్యంబు. ॥43॥

గీ. అనిన విని యంతకుండు పురాంతకునకు
భక్తిఁ బ్రణమిల్లి పరమతాత్పర్య మొప్ప
దేవదేవునిచే నుపదేశమంది
యభవురాత్రి యముండు సేయంగఁ బూని. ॥44॥

వ. పుణ్యశివరాత్రివ్రతంబు చేయఁబూని యభవుతో “దేవా నీ భక్తులు మాననీయులు; వారి లక్షణంబులు నాకుఁ దెలియవలయు నానతి” మ్మనుటయుఁ బ్రసన్నహృదయుండై పరమేశ్వరుండు. ॥45॥

సీ. అఖిలాంగకముల భస్మాలేప మొనరించు | నతని నా భక్తుఁగా నాత్మఁ దలఁపు
భసితత్రిపుండ్రంబు భాలపట్టికఁ దీర్చు | నతని నా భక్తుఁగా నాత్మఁ దలఁపు
రుద్రాక్షమాలికల్ రూఢిగా ధరియించు | నతని నా భక్తుఁగా నాత్మఁ దలఁపు
లింగపూజాసక్తిలీనమానసుఁడైన | నతని నా భక్తుఁగా నాత్మఁ దలఁపు
గీ. (ప్రణవశతరుద్ర్య)మును [53]నధర్వంబు శిఖియుఁ | [54]బవనగీతియుఁ ద్వరితంబుఁ బౌరుషంబు
నీలరుద్ర్యంబుఁ బఠియించు నియతి నెవ్వఁ | డతని నా కూర్మిభక్తుఁగా నాత్మఁ దలఁపు. ॥46॥

వ. అనిన విని ప్రీతిచేతస్కుఁడై యముఁడు మాహేశ్వరుండును, దక్షిణామూర్తియు, మృగాంకధరుండును, నీలకంఠుఁడును నగు పరమేశ్వరునకు నభివాదనంబుచేసి “దేవ! సుకుమారుని నిమిత్తంబున దేవరచేతఁ బుణ్యాశివరాత్రీవ్రత మాహాత్మ్యంబును, భస్మోద్ధూళనత్రిపుండ్ర మాహాత్మ్యంబును, రుద్రాక్ష మాహాత్మ్యంబును నెఱింగితిఁ గృతార్థుండనైతి” నని పలికి పునఃప్రణామం బాచరించి సముచితప్రకారంబున వీడ్కొని యముండు నిజపురంబునకుం జని సభామధ్యంబునం ధర్మాసనాసీనుండై [యౌలుం]బరాదుల తన దూతల రావించి యందఱం [గలయం] గనుఁగొని యిట్లనియె. ॥47॥

గీ. వినుఁడు భటులార యవధానవృత్తి మీరు
శంభుభాషిత ముడుగుఁడు సంశయంబు
ధరణి నెచ్చోటనై[న]నుఁ దిరుగునప్పు-

డిందుశేఖరు భక్తుల నెఱుఁగుకొనుఁడు. ||48||

వ. వారి లక్షణంబు లెటువంటివనిన. ||49||

సీ. కమియ భస్మోద్ధూళనము శరీరంబున | భసితత్రిపుండ్రంబు భాలమునను
బ్రణవమంత్రజపంబు రసనాంచలంబున | సావిత్రి హృదయాంబుజంబునందు
శతరుద్రశివసూత్ర జ[ప] మహాదేవాది | నామావళీకీర్తనము గళమున
శివపురాణాగమశివకథాశివకీర్తి | శివమహత్త్వంబులు శ్రవణములను
గీ. నలవరించినవారు పురారిభక్తు | లట్టివారల దొల నందంద కాంచి
భక్తి నంజలిచేసి తాత్పర్యమొప్ప | దొలఁగిపొం డెల్లకాలంబు దూతలార. ||50||

సీ. మృగటంకధరుఁడైన మీనాంకదమనుని | రక్తవర్ణంబైన రాజమౌళి
పంచాననుండైన పరమేశ్వరుని దక్షి- | ణామూర్తియైన పినాకపాణి
నర్తకుండైన పన్నగపతిగ్రైవేయు | నర్ధనారీశ్వరుండైన శివుని
దివిజవంద్యుండైన త్రిపురాసురాంతకు | (బహుమూర్తియుతుఁడైన ఫాల)నయను
గీ. నాత్మ నెవ్వఁడు చింతించు (ననవరతము) | నతని శివభక్తుఁగాఁ దెలియంగవలయు
వందనం బాచరింపంగవలయు నతని | కర్థి(ని) బ్రదక్షిణంబు సేయంగవలయు. ||51||

సీ. కడు నేకకాలద్వికాలత్రికాలంబు | నంగంబులందు భూ తలఁదిరేని
యజ్ఞానమునఁ బ్రమత్తాలస్యముననైన | ధవళాంధుకోటీరుఁ దలఁచిరేని
మృడునకునై యష్టమీచతుర్దశులందు | నుపవాసముండంగ నోపిరేని
షట్కాలములయందు సర్వలోకేశ్వరు | శ్రీమహాదేవుఁ బూజించిరేని
గీ. వారు మాన్యులు పార్వతీవల్లభునకు | వారె వంద్యులు మముఁబోటివారికెల్ల
నట్టివారల మన్నింపరైతిరేని | ద్రోహమగు మీకు నాకు నద్రోహులార. ||52||

క. శివునెడ భక్తియు నెప్పుడు
శివభక్తుల జూచినపుడు శివుఁడను తలఁపున్
శివశివ కలిగినవారల
[55]శివసాదృశ్యులను మీరు చేరకుఁ డెపుడున్. ||53||

క. అలవోకయుఁ గలలోనను
మలహరుభక్తులను నీశు మన్నించినవా-
రల (భక్తవరుల) శైవులఁ
దలఁపకుఁడీ దూతలార దండింపంగన్. ||54||

ఆ.వె. పాపకర్మునైన భాగ్యహీనునినైనఁ
బట్టిచూడ మీకుఁ బాడిగాదు
శైవవరులఁ జేరి సేవించువారలు
పురహరుండ కాఁగ బుద్ధి గనుఁడు. ||55||

ఆ.వె. జంతుకోటిలోన శంకరపాదాబ్జ-
సేవ సేయువారిఁ [56]జేర కెపుడు
దూరమందుఁ దొలఁగి దూషింప కెంతయు
భక్తి గొలువవలయు [57]భటులు మీరు. ||56||

క. ప్రాసాదము నిర్మాల్యము
వాసితొ పాదోదకంబు వైభవ మలరున్
[58]డాసినఁ గైకొనువారలఁ
దా సేవింపంగవలయుఁ దథ్యము సుండీ. ‖57‖

వ. అని కృతాంతుఁడు తామసాధ్వానంబు(?) నౌలుంబరాదులకుఁ జెప్పి యీ ప్రకారంబులయందు ఘంటాధ్వానంబులతో సర్వజంతువిజ్ఞాపనంబుగాఁ జాటుండని యంతర్ధానంబు గావించె. దూతలు నట్లు కావించిరి. ఈ ప్రకారంబున శౌనకాదులకు రోమహర్షణమునిప్రవరసుతుండు సూతుండు చెప్పెనంత. ‖58‖

శా. రామామన్మథ భోజరాజకవితారమ్యప్రభావో(న్న)తా
సామాగానవిశేషశాస్త్రకలనా సంభావ్యసారోదయా
సోమార్కానలనేత్రతేజ గురుశుశ్రూషాత్మసంవర్ధితా
(హేమాద్రీశ్వర ధైర్య! దానఖచరా) [59]యిద్ధప్రతాపోన్నతా. ‖59‖

క. లింగార్చ(నదే)హా నవ-
సంగత శైవార్థతత్త్వసముదితమోహా
శృంగారార్థవిశేషా
మంగళసంధానకృత్య మహిమౌన్నత్యా. ‖60‖

మాలిని. [60]పరమపరకలాపా భాసురానంగరూపా
సురుచిరశుభమూర్తీ శో[భితా]నందవర్తీ
................................................
................................................ ‖61‖

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర సకలవిద్యాసనాథ శ్రీనాథనామధేయ ప్రణీతంబయిన శివరాత్రి మాహాత్మ్యంబునందుఁ బంచమాశ్వాసము.



[1] తా. వితస్తానాది మధ్యంబున.
[2] తా. కన్యకాంత.
[3] తా. గారవమున.
[4] ము. ను.
[5] తా. యందేని.
[6] తా. యవని జలము.
[7] తా. సుయశోభీధనకాంతా.
[8] తా. నిశరవాండనై.
[9] తా. నెఱుఁగ.
[10] తా. సన్నిధానముకు నేఁగి.

[11] తా. కంతా.

[12] ఈ పాదములకు సరిపోవునంత స్థలము తాళపత్రమున ఊరక విడువబడినది.

[13] తా. మాహిషి.

[14] తా. ప్రమథిసేనా.

[15] తా. అద్వైతతత్వవేదద్వయరహస్యజ్ఞాన.

[16] తా. బర్వతోద్భవాపూర్ణుం బార్శ్వబాగు.

[17] తా. పాదాంభోరుహద్వంద్వపీఠికోపాంత.

[18] తా. మహమేకయా.

[19] తా. రహస్త్యకణాయమాన.

[20] తా. నిటల.

[21] తా. సంట్టతమస్తసమస్తోపాధిధ్రుమమితి.

[22] తా. హలపవిత.

[23] తా. కైవయం భవత్తం జ్ఞాతుం.

[24] తా. కస్యేకయో వాచా.

[25] తా. కతివిధగుణయన్ హలమిహభిరుహే యై రసై.

[26] తా. శోలినః.

[27] తా. సకలస్థిత్యకారణవరేణ్య.

[28] తా. కాద్యత.

[29] తా. దక్షిణేశాధిపత్యంబు.

[30] తా. పంపితి.

[31] తా. లోటు.

[32] తా. డనియెడి.

[33] తా. ముకుబండ్లు.

[34] తా. అయిదొ మొరయో.

[35] తా. బని యాక్రోశించుచు.

[36] తా. జయవాది.

[37] తా. వీఁపులు ప్రహరించుచు వెంటాడించంగను.

[38] తా. పెనుంబడుటకై.

[39] తా. ముట్టునో.

[40] తా. త్రాళ్ళ.

[41] తా. తప్పుతండువు.

[42] తా. వెనక.

[43] తా. మెన్నండూ.

[44] తా. యనుని. ము. యగునె.

[45] తా. అవిర.

[46] వపర.

[47] తా. నాటి.

[48] తా. య్యై.
[49] తా. య.
[50] తా. వీక్షించునాఁడు.
[51] తా. గప్పురమునం.
[52] తా. స్తోత్రముల్.
[53] తా. నధ్వరంబు.
[54] తా. బాపనీతియు.
[55] తా. శివసాదృశ్యులురు.
[56] తా. జేయ.
[57] తా. భటుల.
[58] తా. దాసిన.
[59] తా. యుద్ధ.
[60] తాళపత్రమున రెండు పాదములే యున్నవి.